భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ లింగ పురాణం



వచనం : డా॥ జయంతి చక్రవర్తి

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ లింగ పురాణం






జిల్లెళ్ళమూడి అమ్మ

మాతృశ్రీ అనసూయాదేవి ఆశీస్సులతో...

వచనం : డాక్టర్ జయంతి చక్రవర్తి

ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

ప్రచురణ



శ్రీ బాలాజీ పబ్లికేషన్స్

28-25-32/1, అరండల్‌పేట, ఏలూరురోడ్, విజయవాడ-2

సెల్ : 9441176276 / 9966675815

# శ్రీ లింగ పురాణం


| | | |
|---|---|---|
| వచనం | : | డాక్టర్ **జయంతి చక్రవర్తి**<br>విజయవాడ. 9390526272 |
| ప్రథమ ముద్రణ | : | 2014 |
| ముఖచిత్రం | : | రమణ |
| డి.టి.పి. &<br>పేజి లే-అవుట్ | : | విద్యార్థి క్రియేషన్స్<br>విజయవాడ |
| ముద్రణ | : | శ్రీ స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్<br>విజయవాడ-3 |
| ప్రచురణ | : | **శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**<br>నసురుల్లాఖాన్ వీధి<br>అరండల్‌పేట, విజయవాడ |
| వెల | : | ₹. 60 /- |




ఆర్షవిజ్ఞాన భాండాగారాలైన అష్టాదశ పురాణాలని ఆంధ్రజాతికి అందించిన శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్ట్ వారికి, ఆ పురాణాలను అనువదించిన మహారచయితలకి సహస్రాధిక ప్రణామాలు సమర్పిస్తున్నాం.

# భగవాన్ వేదవ్యాస మహర్షి

## వ్యాసగుహ, సరస్వతీ తీరం, బదరీనాథ్



*అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరోహరిః ।*
*అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః ॥*

## కృతజ్ఞతలు

అష్టాదశ పురాణాలని సామాన్య జనానికి అందించాలని సంకల్పించిన శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ అధినేత **శ్రీ పుట్టగుంట వీరయ్యచౌదరి (బోస్) గారికి** ముందుగా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ గ్రంథాలకి తమ అమూల్యమైన ఆశీస్సులందించిన శ్రీ పీఠాధిపతులు పరమపూజ్య **శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానంద సరస్వతీ స్వామివారికి,** అస్మద్గురువర్యులు ఆర్షవిద్యాసాగర **బ్రహ్మశ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి గారికి** సహస్రాధిక వందనాలు సమర్పిస్తున్నాను.

ప్రోత్సహించిన మిత్రులు రోహిత్ ప్రింటర్స్ అధినేత శ్రీ పుప్పాల అప్పారావు గారికి, డా॥ కానుకొల్లు బాలకృష్ణ, వలివేటి శివరామకృష్ణమూర్తి, వేదాంతం సార్వభౌమ, ఉన్నవ గణేష్‌లకి..... అలాగే ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసిన శ్రీమతి వినీల గారికి పేజి మేకింగ్ చేసిన విద్యార్థి క్రియేషన్స్ వారికి ప్రత్యేక అభినందనలు...



# ఆశీస్సులు

డా॥ జయంతి చక్రవర్తి గారు అనేక ఆధ్యాత్మిక రచనల ద్వారా తెలుగు పాఠకులకు సుపరిచితులు. విజయవాడ కనకదుర్గ దేవస్థానం పక్షాన వెలువడుతున్న 'కనకదుర్గ ప్రభ' పత్రికకు ప్రారంభ సంపాదకులుగా ఆయన పేరు తెచ్చుకున్నారు. 'దశ మహావిద్యలు' పుస్తక రచన తరువాత డా॥చక్రవర్తి గారు అష్టాదశ పురాణాలను తెలుగు పాఠక ప్రపంచంలోకి లోతుగా తీసుకువెళ్లాలని సంకల్పించారు. ఒక్కొక్క పురాణ సారాంశాన్ని ఒక్కొక్క చిన్న పుస్తకంగా విడుదల చేయాలన్న ఆ రచయిత సంకల్పం ప్రశంసనీయం.

ఈ చిన్నిపొత్తాలు పాఠకులందరికీ ప్రయోజనకరంగా, సదుపాయకరంగా ఉంటాయి. వీటి ఉపయోగాన్ని పాఠకులందరూ అందిపుచ్చుకోవాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.



స్వామి పరిపూర్ణానంద

**జయ వత్సరం, శ్రావణ పూర్ణిమ**

**(10.8.2014)**

"ఆర్షవిద్యాసాగర", "మధురభారతి"
మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



దూరవాణి : 81061 96418

301, శ్రీ సాయి ఎన్‌క్లేవ్, అడవి శేషగిరిరావు వీధి, లక్ష్మీనగర్
సత్యనారాయణపురం, విజయవాడ-520011



తేది : 19-8-2014

# ఇది సృష్టి కథ

"అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష" అనే వెక్కిరింపు లోకంలో బాగా ప్రచారంలో ఉంది. వెక్కిరించడానికి అన్నమాటే అయినా, ఇది నిజమని మాత్రం చెప్పక తప్పదు. వేదం సృష్టితత్త్వాన్ని, సృష్టికి మానవుడికి ఉన్న సంబంధాన్ని, మానవుడికి సృష్టికర్తతో గల అనుబంధాన్ని వ్యక్తం చేసింది. వేదం ఏ ఒక్కరో రచించిన గ్రంథం కాదు. సృష్టితత్త్వాన్ని, పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవాలని ఆరాటపడిన మహర్షి సముదాయానికి అంతర్నేత్రానికి గోచరించిన ఒక దర్శనం. హృదయస్థానంలో వినిపించిన ఒక నాదం (శ్రుతి).వేదం 'అపౌరుషేయం' అని కూడా పెద్దలు గుర్తించారు. 'అపౌరుషేయం' అంటే మానవుమాత్రుడి రచన కాదు అని అర్థం.

అనాదిగా అలా దిగి వచ్చిన వేదం వ్యాసమహర్షి కాలానికి చిక్కువడిన దారాల రాశిగా ఉంటే, ఆ చిక్కును విడదీసి, వేదవిభాగ నిర్ణయంచేసి, వేదం మనకు అక్కరకు వచ్చేలా చేశాడు ఆ మహర్షి. ఆనాటి నుండి అతడికి 'వేదవ్యాసుడు' అనే పేరు వచ్చింది. సకల వేదాల సారాన్ని 555 సూత్రాలుగా "బ్రహ్మసూత్రాలు" రచించాడు. అయినా, ఆ మహర్షికి తృప్తి కలుగలేదు. వేదమనే విత్తనంలో నుంచి విశాలమైన పురాణ మహావృక్షాలను అంకురింపచేశాడు. అందుకే పురాణాలకు

"వేదోపబృంహణాలు" అని పేరు. "ఉపబృంహణం" అంటే విత్తనాలు నుంచి మొలక రావడం. విత్తనంలో ఏమి ఉన్నదో మొలకలో, మొక్కలో, చెట్టులో అదే ఉంటుంది.

వేదవాఙ్మయంలో దాగిన సృష్టితత్త్వాన్ని కథారూపంగా వివరించడానికి అష్టాదశ పురాణాలను రచించాడు వ్యాసమహర్షి. మానవాభ్యుదయం కోసం వెలువడిన ఈ పురాణ వాఙ్మయసారాన్ని సంక్షిప్తంగా సంకలనం చేసి అందిస్తే, ఈనాటి సమాజానికి శ్రేయస్సు కలుగుతుందని సంకల్పించాడు మా శిష్యమిత్రుడు డా॥ జయంతి చక్రవర్తి. తన ఓర్పు నేర్పులతో అష్టాదశ పురాణాల ఆంతర్యాన్ని వాడుకభాషలో నేటి జన సామాన్యానికి అందుబాటులోకి తెచ్చే పవిత్రమైన బాధ్యతను నెరవేర్చాడు.

మంచి సాహిత్యాన్ని మన సమాజానికి అందించే మహత్తర లక్ష్యంతో శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఈ అష్టాదశ పురాణాలని ప్రచురించటానికి ముందుకు వచ్చారు. వీరిద్వారా ఇంకా ఎన్నో చక్కని గ్రంథాలు వెలుగు చూస్తున్నాయి.

పురాణ వాఙ్మయంలోని పుణ్యకథా విశేషాలను ఈనాటి సమాజానికి పంచే కృషిలో పాలు పంచుకుంటున్న మా చక్రవర్తి, సంప్రదాయ సాహిత్యాన్ని ప్రచురించే సత్కార్యాన్ని మహాయజ్ఞంగా స్వీకరించిన ప్రచురణకర్త శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఎంతైనా అభినందనీయులు.

వీరిద్దరికీ అంతర్యామి అనంత శుభాలనూ ప్రసాదించాలని ఆశీర్వదిస్తూ, ఈ గ్రంథాలు ప్రజలకు చేరువ కాగలవని ఆకాంక్షిస్తున్నాను.

- మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



# పురాణ పురుషుడు శ్రీమన్నారాయణుడు



# విషయసూచిక





# ఉపోద్ఘాతము

అం.ఆ

**వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ ।**
**నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా ॥**

**వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్ ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

## అష్టాదశ పురాణాలు

మన భారతవాఙ్మయంలో వేదాల తరువాత అంతటి ప్రాశస్త్యాన్ని పొందిన గ్రంథాలు పురాణాలు. వేదాల్లో చెప్పిన ధర్మాల్ని కథలరూపంలో, ఆఖ్యానాల రూపంలో సామాన్యులకు సైతం అర్థమయ్యేలా తెలియచెప్పేవే పురాణాలు. అందుకే పురాణాల్ని పంచమవేదంగా కీర్తించారు. అసలు పురాణం అంటే? పురా అపినవం-పురాతనమైనప్పటికీ నూతనంగా వుండేది అని అర్థం. అలాగే 'పురా ఆనతి' అంటే ప్రాచీనకాలంలో జరిగింది అని, వాయుపురాణం పురాణశబ్దాన్ని నిర్వచిస్తే, 'పురాఏతత్ అభూత్' పూర్వం ఇలా జరిగింది అని బ్రహ్మాండ పురాణం పురాణశబ్దానికి అర్థాన్ని చెబుతుంది. వీటన్నిటినీ క్రోడీకరించి చూస్తే పురాణం అంటే పూర్వకాలంలో జరిగిన ఎన్నో విషయాల్ని వివరించి చెప్పేది అని తెలుస్తోంది.

పురాణాలు ఎన్ని-

పురాణాలు మహాపురాణాలు, ఉపపురాణాలని రెండు విధాలుగా వున్నాయి. మహాపురాణాలు 18, అలాగే ఉపపురాణాలు 18.

**బ్రహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవచ ।**
**భాగవతం నారదదీయం మార్కండేయంచ కీర్తితమ్ ॥**

**ఆగ్నేయంచ భవిష్యంచ బ్రహ్మవైవర్త లింగకే ।**
**వారాహంచ తథా స్కాందం వామనం కూర్మ సంజ్ఞకమ్ ।**
**మాత్స్యం చ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్ ॥**

1.బ్రహ్మపురాణం 2.పద్మపురాణం 3.విష్ణుపురాణం 4.వాయు పురాణం 5.భాగవత పురాణం 6.నారదపురాణం 7.మార్కండేయ పురాణం

8.అగ్నిపురాణం 9.భవిష్యపురాణం 10.బ్రహ్మవైవర్త పురాణం 11.లింగపురాణం 12. వరాహ పురాణం 13.స్కాంద పురాణం 14.వామన పురాణం 15.కూర్మ పురాణం 16.మత్స్య పురాణం 17.గరుడ పురాణం 18.బ్రహ్మాండ పురాణం- ఈ పద్దెనిమిదీ మహాపురాణాలు. అలాగే 18 ఉపపురాణాలు కూడా వున్నాయి. ఈ మహాపురాణాల పేర్లని గుర్తుంచుకోవటానికి శ్లోకం కూడా వుంది.

**'మ' ద్వయం 'భ' ద్వయం చైవ 'బ్ర'త్రయం 'వ' చతుష్టయం।**
**అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥**

'మ' తో మొదలయ్యేవి రెండు 1.మత్స్య 2.మార్కండేయ

'భ' తో మొదలయ్యేవి రెండు 1.భాగవత 2.భవిష్య

'బ్ర' తో మొదలయ్యేవి మూడు 1.బ్రహ్మ 2.బ్రహ్మవైవర్త 3.బ్రహ్మాండ

'వ' తో మొదలయ్యేవి నాలుగు 1.వాయు 2.విష్ణు 3.వామన 4.వరాహ

అ-అగ్ని, నా-నారద, ప-పద్మ, లిం-లింగ, గ-గరుడ, కూ-కూర్మ, స్కా-స్కాంద ఇలా మొత్తం పద్దెనిమిది పురాణాలు.

## పురాణాలు విష్ణుస్వరూపం

అష్టాదశ పురాణాలను సాక్షాత్తు విష్ణు స్వరూపంగా పోల్చారు. 18 పురాణాలని మహావిష్ణువు శరీరంలోని 18 అంగాలుగా భావిస్తారు మన ప్రాచీన ఋషులు.

1. బ్రహ్మపురాణం - శ్రీ మహావిష్ణువు శిరస్సు
2. పద్మపురాణం - శ్రీ మహావిష్ణువు హృదయం
3. విష్ణుపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిభుజం
4. వాయుపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమభుజం
5. భాగవతపురాణం - శ్రీ మహావిష్ణువు ఊరువులు
6. నారదపురాణం - శ్రీ మహావిష్ణువు నాభి
7. మార్కండేయపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిపాదం
8. అగ్నిపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమపాదం

9. భవిష్యపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిమోకాలు
10. బ్రహ్మవైవర్తపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమమోకాలు
11. లింగపురాణం - శ్రీ మహావిష్ణువు కుడి చీలమండ
12. వరాహపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమ చీలమండ
13. స్కందపురాణం - శ్రీ మహావిష్ణువు కేశాలు
14. వామనపురాణం - శ్రీ మహావిష్ణువు చర్మం
15. కూర్మపురాణం - శ్రీ మహావిష్ణువు పృష్ఠభాగం
16. మత్స్యపురాణం - శ్రీ మహావిష్ణువు మెదడు
17. గరుడపురాణం - శ్రీ మహావిష్ణువు మాంససారం
18. బ్రహ్మాండపురాణం - శ్రీ మహావిష్ణువు ఎముకలు

పురాణ లక్షణం :-

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంత రాణి చ ।**
**వంశానుచరితం చేతి పురాణం పంచ లక్షణం ॥**

పురాణానికి ఐదు లక్షణాలు ప్రధానంగా వుండాలని చెప్పారు. 1.సర్గ-అంటే ప్రపంచ సృష్టి, 2.ప్రతిసర్గ-ఈ ప్రపంచ ప్రళయం, 3.వంశం-రాజుల, ఋషుల, దేవతలకు సంబంధించిన వంశ విశేషాలు-అవతారాలు 4.వంశానుచరితం-రాజవంశాలలో, ఋషుల వంశాలలో పుట్టిన వారి జీవితచరిత్రలు, 5.మన్వంతరాలు-మనువులు, మనువు ద్వారా ఏర్పడ్డ సంతతి, ఆయా మన్వంతరాలలో జరిగిన విశేషాలు. ఈ విధంగా ప్రతిపురాణం పంచలక్షణాలతో కూడి వుంటుంది.

పురాణకర్త :-

**విష్ణోరంశో మునిర్జాత సత్యవత్యాం పరాశరాత్ ।**
**పురాణ సంహితాం దద్యే తేషాం ధర్మ విధిత్సయా ॥**

అనే ఈ ప్రమాణ శ్లోకం ప్రకారం సత్యవతీ పరాశర మహర్షి కుమారుడుగా శ్రీ మహావిష్ణు అంశంతో జన్మించిన వ్యాసుడే అష్టాదశ పురాణాల కర్త అని తెలుస్తోంది. ఈయననే కృష్ణద్వైపాయనుడు అని కూడా అంటారు. పురాణాలకు కర్త వ్యాసుడైతే వక్త సూతమహర్షి. ఈయన నైమిశారణ్యంలో శౌనకాది మహామునులకు ఈ పురాణాలన్నిటినీ ప్రబోధించాడు.

### పురాణాల ప్రాచీనత :-

వేద వాఙ్మయం ఎంత విస్తృతంగా వుందో, పురాణ వాఙ్మయం కూడా అంత విస్తృతంగా వుంది. సాధారణంగా లోకంలో వేదాలు అత్యంత ప్రాచీనమైనవని చెబుతారు. అయితే ఈ శ్లోకం వేదాలకన్నా పురాణాలే ప్రాచీనమైనవని చెబుతుంది.

**పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతమ్ ।**
**నిత్యం శబ్దమయం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ।**
**అనంతరంచ వక్త్రేభ్యః వేదాంతస్య వినిర్గతాః ॥**

పూర్వం బ్రహ్మ నోటి నుంచి వందకోట్ల శ్లోకాలతో ముందు పురాణాలు బయలుదేరి ఆ తరువాత వేదాలు బయలుదేరాయట. ఇలా వందకోట్ల శ్లోకాలతో చతుర్ముఖ బ్రహ్మతో చెప్పబడ్డ పురాణం మొత్తం ఒక్కటిగానే వుండేది. అల్పబుద్ధులైన మానవుల కోసం ఆ బ్రహ్మదేవుడే వ్యాసుడి రూపంలో వచ్చి ఆ కోటిశ్లోకాల పురాణాన్ని నాలుగు లక్షల శ్లోకాలలోకి కుదించి దాన్ని పద్దెనిమిది పురాణాలుగా రచించాడని స్కందపురాణం చెబుతుంది.

**పురాణమేక మేవాసీ దస్మిన్ కల్పాంతరే నృప ।**
**త్రివర్గ సాధనం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ॥**
**స్మృత్వా జగాదచ మునీన్ ప్రతి దేవశ్చతుర్ముఖః ।**
**చతుర్లక్ష ప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా ।**
**తదష్టాదశధా కృత్వా భూర్లోకేஉస్మిన్ ప్రభాష్యతే ॥** *(స్కంద పురాణం)*

## పాఠకులకు నమస్కారం

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన అష్టాదశ పురాణాలు ఆర్షవిద్యా భాండాగారాలు. ఆ భాండాగారాలలో నిక్షిప్తమైన ప్రధాన విషయాల్ని 18 పుస్తకాలుగా క్రోడీకరించి మీ ముందుకు తెస్తున్నాం. సరళమైన భాషలో మేము ప్రచురించిన ఈ 18 పురాణాలని ఆదరించి, మమ్మల్ని ప్రోత్సహిస్తారని ఆశిస్తూ... మీ

**- ప్రకాశకులు, వచనకర్త**

# అష్టాదశ పురాణాల మొదటి వక్త - శ్రోత

అష్టాదశ పురాణాలను మొదటగా చెప్పిన వక్తలు వారి నుంచి మొదటిసారి విన్న శ్రోతలు ఈ క్రింద చెప్పిన విధంగా వుంటారు. అదేవిధంగా ఒక్కొక్క పురాణానికి వక్తృ శ్రోతృపరంపర వేరువేరు విధాలుగా కూడా ఉంటుంది.

| సం. పురాణం | ఏకల్ప వృత్తాంతం | వక్తృశ్రోతలు |
|---|---|---|
| 1. బ్రహ్మ పురాణాన్ని | బ్రహ్మ కల్పంలో | బ్రహ్మ మరీచి మహామునికి బోధించాడు |
| 2. పద్మ పురాణాన్ని | పద్మ కల్పంలో | స్వాయంభువమనువు బ్రహ్మకు బోధించాడు |
| 3. విష్ణు పురాణాన్ని | వరాహ కల్పంలో | పరాశరుడు బ్రహ్మకు బోధించాడు |
| 4. శివ(వాయు)పురాణాన్ని | శ్వేత కల్పంలో | శివుడు వాయువుకు బోధించాడు |
| 5. భాగవత పురాణాన్ని | సారస్వత కల్పంలో | విష్ణువు బ్రహ్మకు బోధించాడు |
| 6. నారద పురాణాన్ని | బృహత్ కల్పంలో | పూర్వ భాగాన్ని – సనకాదులు నారదునికి బోధించారు. ఉత్తరభాగాన్ని – వశిష్ఠుడు మాంధాతకు బోధించాడు |
| 7. మార్కండేయ పురాణాన్ని | శ్వేత వారాహకల్పంలో | మార్కండేయుడు జైమినికి బోధించాడు |
| 8. అగ్ని పురాణాన్ని | ఈశాన కల్పంలో | అగ్నిదేవుడు వశిష్ఠుడికి బోధించాడు |
| 9. భవిష్య పురాణాన్ని | అఘోర కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |
| 10. బ్రహ్మవైవర్త పురాణాన్ని | రథంతర కల్పంలో | సావర్ణి నారదుడికి బోధించాడు |
| 11. లింగ పురాణాన్ని | కల్పాంత కల్పంలో | పరమశివుడు నారదుడికి బోధించాడు |
| 12. వరాహ పురాణాన్ని | మనుకల్పంలో | విష్ణువు పృథ్వికి బోధించాడు |
| 13. స్కాంద పురాణాన్ని | తత్పురుషకల్పంలో | స్కందుడు భూమికి బోధించాడు |
| 14. వామన పురాణాన్ని | కూర్మ కల్పంలో | బ్రహ్మ పులస్త్య మహామునికి బోధించాడు |
| 15. కూర్మ పురాణాన్ని | లక్ష్మీ కల్పంలో | విష్ణువు పులస్త్య మహామునికి బోధించాడు |
| 16. మత్స్య పురాణాన్ని | సప్త కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 17. గరుడ పురాణాన్ని | గరుడ కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 18. బ్రహ్మాండ పురాణాన్ని | భవిష్య కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |

# పురాణాలు ఎందుకు చదవాలి?

**పురాణశ్రవణే శ్రద్ధా యస్య స్యాద్బ్రాతరస్వహమ్ ।**
**తస్య సాక్షాత్ప్రసన్నః స్యాత్ శివో విష్ణుశ్చ సానుగః ॥**

**యత్స్నాత్వా పుష్కరే తీర్థే యాగే సింథౌ చ సంగమే ।**
**తత్ఫలం ద్విగుణం తస్య శ్రద్ధయా వై శృణోతి యః ॥**

**యే పఠంతి పురాణాని శృణ్వన్తి చ సమాహితాః ।**
**ప్రత్యక్షరం లభంత్యేతే కపిలాదానజం ఫలమ్ ॥**

**అపుత్రో లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్ ।**
**విద్యార్థీ లభతే విద్యాం మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ ॥**

**యే శృణ్వన్తి పురాణాని కోటిజన్మార్జితం ఖలు ।**
**పాపజాలంతు తే హిత్వా గచ్ఛన్తి హరిమందిరమ్ ॥**

పురాణాలు వినడంలో ఎవరికైతే శ్రద్ధ ఉంటుందో మరియు నిత్యము ఎవరైతే శ్రవణం చేస్తారో, అటువంటి వారి విషయంలో శివ–కేశవులు మరియు వారి గణాలు సంపూర్ణానుగ్రహం ప్రదర్శిస్తారు. పుష్కర తీర్థాల్లో, ప్రయాగ మొదలైన నదీసంగమ క్షేత్రాల్లో స్నానాలాచరిస్తే ఏవిధమైన పుణ్యం పొందగలరో దాని రెట్టింపు పుణ్యం పురాణ శ్రోతలకు లభిస్తుంది. భక్తి శ్రద్ధలతో పురాణ పఠన–శ్రవణాలు చేసేవారు కపిలగోవును దానం చేస్తే కలిగే పుణ్యరాశిని పొందగలరు. పుత్రులు లేనివారు పుత్రులను, దరిద్రులు ధనాన్ని, విద్యార్థులు విద్యను, మోక్షగాములు మోక్షాన్ని పొందగలరు. పురాణ శ్రోతలు తమ కోటి జన్మల పాపాలను దూరం చేసికొని చివర్లో శ్రీమన్నారాయణమూర్తి సాయుజ్యం పొందగలరు.

# పురాణ వైభవం

**అష్టాదశ పురాణానాం నామధేయాని యః పఠేత్ ।**
**త్రి సంధ్యాం జపతే నిత్యం సోఽశ్వమేధ ఫలం లభేత్ ॥**

ఈ అష్టాదశ మహాపురాణాల పేర్లను ఉదయ–మధ్యాహ్న–సాయంకాల సమయాల్లో ఎవరైతే పఠిస్తారో వారు అశ్వమేధ ఫలాన్ని పొందగలరని భావం.

# శ్రీ లింగ పురాణం



శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥

అష్టాదశ పురాణాలలో పదకొండో పురాణం శ్రీ లింగమహాపురాణం. "లైంగంతుగుల్ఫకం దక్షమ్' అన్న వాక్యాన్ని బట్టి ఈ పురాణం పురాణ పురుషుడైన శ్రీమన్నారాయణుడి కుడి చీలమండగా వర్ణించబడింది. "తదేకాదశ సహస్రం హరమాహాత్మ్య సూచకం' అనే మాటప్రకారం ఈ పురాణంలో మొత్తం పదకొండువేల శ్లోకాలున్నాయి. ఈ పురాణం పూర్వార్ధం, ఉత్తరార్ధం అని రెండు భాగాలుగా రచించబడింది. పూర్వార్ధంలో 108 అధ్యాయాలుండగా ఉత్తరార్ధంలో 57 అధ్యాయాలున్నాయి. పరమేశ్వర తత్త్వాన్ని సంపూర్ణంగా వివరించే మహాపురాణం ఇది. ఇరవై ఎనిమిది రకాల శివావతారాలకి సంబంధించిన కథలు లింగపురాణంలో చెప్పబడ్డాయి.

## లింగపురాణంలో చెప్పబడ్డ విషయాలు

**1-40 అధ్యాయాలు :** వీటిలో మంగళాచరణం, శివలింగవిశేషాలు, లింగశబ్దార్థ నిర్వచనాలు, ప్రాథమిక సృష్టి విశేషాలు, బ్రహ్మ చేసిన సృష్టిక్రమం, అగ్ని సృష్టి కథనం, శివానుగ్రంతో బ్రహ్మానందభోగాలనుభవించటం, యోగమార్గంలో శివుణ్ణి ఉపాసించటం, అష్టాంగయోగ నిరూపణం, యోగవిఘ్న కారణాలు, శివానుగ్రహాది నిరూపణం, సద్యోజాత తచ్ఛిష్య నిరూపణం, వామదేవ, తత్పురుష, అఘోర విశేషాలు, అఘోర మంత్రోపాసన, ఈశానబ్రహ్మ, పంచబ్రహ్మస్తోత్రం, శివలింగ ఆవిర్భావం, శ్రీమహావిష్ణువు చేసిన విష్ణుస్తుతి, బ్రహ్మవిష్ణువులకి శివుడి వరప్రదానం, హరిహర బ్రహ్మకృత శివస్తోత్రం,

సర్పోదయం, రుద్రోత్పత్తి, సద్యోజాతాది మూర్తుల ఆవిర్భావం, వ్యాసుడి యోగాచార్యత్వం, స్నానవిధి, సంధ్యావందనం, బ్రహ్మయజ్ఞ నిరూపణం, లింగార్చనవిధానం, మానసిక లింగార్చన, దారువనంలో మునుల్ని శివుడు పరీక్షించటం, శ్వేతమునివృత్తాంతం, దారువనంలోని మనుషులు శివుణ్ణి ప్రార్థించటం, శివుడు బోధించిన పాశుపత వ్రతం, భస్మస్నానవిధి లాంటి విషయాలు సవివరంగా వర్ణించబడ్డాయి.

**41-80 అధ్యాయాలు :** ఈ అధ్యాయాలలో దధీక్షి క్షుప సంవాదం, క్షుపుడు చేసిన విష్ణుస్తుతి, నందికేశ్వర వృత్తాంతం, ఆదిసృష్టి, యుగధర్మాలు – వేదవ్యాసుడి పురాణక్రమం, కలియుగధర్మాలు, బ్రహ్మ దేవీపుత్రుడుగా మారటం, శిలాదమునికి శివుడు పుత్రుణ్ణి ప్రసాదించటం, నందికేశ్వరుడు శివానుగ్రహాన్ని పొందటం, నందికేశ్వరుడికి గణాధిపత్యం, శివుడి సర్వాత్మభావం, భూలోకంలో ఉన్న సప్తద్వీపాలు, జంబూద్వీపంలో ఉన్న వర్షాలు, అగ్నీధ్రుడివంశం, మేరుపర్వత వైశాల్యం,జంబూద్వీపవర్ణనం, ఇంద్రాదుల పట్టణాలు, పరమేశ్వరుడి నాలుగు స్థానాలు, గంగాదినదుల ఉత్పత్తి, ప్లక్షద్వీప విశేషాలు, సూర్య, ధృవుల గతి, సూర్యరథ వర్ణనం, చంద్రరథం–చంద్రుడి కళలు, బుధాది గ్రహాలరథాలు, మండలాలు, సూర్యుడికి గ్రహాధిపత్యం, మూడు రకాల అగ్నులు, సూర్యుడి వేయికిరణాలు. ధృవుడి చరిత్ర, దేవదానవ గంధర్వాదుల ఉత్పత్తి, సూర్యచంద్ర వంశ వర్ణనం శివసహస్రనామ నిరూపణ, సూర్యచంద్రవంశరాజుల విశేషాలు, యయాతి వృత్తాంతం, యదువంశం, శ్రీకృష్ణుడి అవతరణ, ఆదిసృష్టి కథనం, త్రిపురాసుర వృత్తాంతం, లింగార్చన ప్రాముఖ్యం, శివలింగభేదాలు లాంటి విశేషాలు వివరంగా చెప్పబడ్డాయి.

**81-120 అధ్యాయాలు :** వీటిలో – శివుడిసాకార నిరాకార స్వరూపాలు, శివవిగ్రహప్రతిష్ఠ, శివమందిర నిర్మాణఫలం, భక్తమహిమ, అహింసామహిమ, శివపూజాఫలం, కైలాసవైభవం,ద్వాదశలింగవ్రతం, సర్వపాపహర వ్యపోహన స్తవం, నక్తవ్రతం, ఉమామహేశ్వర వ్రతం, శివపంచాక్షర మహామంత్ర విధి,

శివధ్యానం, సనత్కుమారాదులకి మాయతొలగటం, మోక్షప్రాప్తి, అణిమాద్యష్టసిద్ధి ప్రాప్తి, శివయోగుల సదాచారం, ప్రణవమహిమ, శ్రీశైలక్షేత్రాదిమహిమ, అంధకాసుర వృత్తాంతం, హిరణ్యాక్షవధ, వరాహదంష్ట్రాన్ని శివుడు ధరించటం, నృసింహస్వామి ఉగ్రత్వాన్ని శరభేశ్వరావతారంతో శాంతి పరచుట, జలంధర వధ, శివుడిద్వారా శ్రీహరి సుదర్శనచక్రాన్ని పొందటం, సతీదేవి పార్వతిగా జన్మించటం, దక్షయజ్ఞవినాశనం, పార్వతీ పరమేశ్వరుల కల్యాణ వైభవం, ఉపమన్యుడి వృత్తాంతం వంటి మహత్తర విషయాలు వర్ణించబడ్డాయి.

**121-165 అధ్యాయాలు :** ఈ అధ్యాయాలలో - శివలింగార్చన మహిమ, శివుడి అష్టమూర్తులు, శివుడి మూర్తుల సంజ్ఞలు, భార్యాపుత్రులు, పంచబ్రహ్మ నిరూపణం, మహేశ్వరుడి సంజ్ఞలు, బహువిధాల శివరూపాలు, సూర్యమండలంలో శివుణ్ణి పూజించే విధి, తంత్రోక్త శివపూజావిధానం, నియమం, మానసశివపూజా విధి, అఘోర శివపూజావిధి, షోడశమహాదానాలు, తులాదానమహిమ, హిరణ్యగర్భదానం, తిలపర్వత దానం, సువర్ణభూమిదానం, గణేశదానం, సువర్ణ గోదానం, లక్ష్మీ దానం, తిలధేనుదానం, సహస్రగోదానం, హిరణ్యాశ్వదానం, కన్యాదానం, సువర్ణవృషభదానం, సువర్ణగజదానం, లోకపాలాష్టకదానం, త్రిమూర్తిదానం, జీవచ్ఛ్రార్ధనిరూపపణం, శివలింగస్థాపన ప్రాముఖ్యం, సర్వదేవతా ప్రతిష్ఠాపనా విధి, అఘోరశివప్రతిష్ఠ, విగ్రహవిధి, వజ్రవాహనికా విద్య, వజ్రేశ్వరీవిద్య, మృత్యుంజయమంత్ర విధానం, త్రయంబక మంత్ర శబ్దార్థాలు, లింగపురాణ పఠన శ్రవణ ఫలం ఇత్యాది విషయాలు సవివరంగా చెప్పబడ్డాయి.

## మంగళా చరణం

నమో రుద్రాయ హరయే బ్రహ్మణే పరమాత్మనే ।
ప్రధాన పురుషేశాయ సర్గస్థిత్యంతకారిణే ॥

రుద్రుడిగా స్మరించినంతనే పాపాల్ని పరిహరించే శ్రీహరిగా, సూక్ష్మ ప్రపంచాన్ని స్థూల ప్రపంచంగా పరిణమింపచేసే చతుర్ముఖ బ్రహ్మగా ఉన్న ప్రధాన పురుషుణ్ణి, సృష్టి స్థితి లయాలు చేసే త్రిమూర్తులకి మూలపురుషుడైన పరమాత్మకి నమస్కారం.

శివలింగ పీఠం మీద బ్రహ్మ, పానవట్టం మధ్యభాగంలో శ్రీహరి, పానవట్టం మీద పిండరూపంలో సకలదేవతా సార్వభౌముడైన రుద్రుడు నివసిస్తారు. కనుక శివలింగం సాలగ్రామం కన్నా ఎంతో గొప్పదని తెలుసుకోవాలి. శివలింగం క్రింద ఉండే వేదిక శక్తి స్వరూపం పైనున్న పిండరూపం శివుడిగా చెప్పబడుతున్నాడు. ఇలా శివలింగం శక్తి శివాత్మకమైనదని కూడా తెలుసుకోవాలి.

వేదాల ప్రారంభంలో, వేదాల చివర పఠించబడే ఓంకారాన్ని అధిష్టించే వాడే మహేశ్వరుడని చెప్పబడినందువల్ల ఓంకారాన్ని మహేశ్వర స్వరూపంగా భావించాలి. శివుడి మూర్తి (విగ్రహం) ని పూజించటం కన్నా శివలింగాన్ని పూజించటమే శ్రేష్ఠమని శైవాగమగ్రంథాలు చెబుతాయి.

## లింగ శబ్దం – అర్థం – నిర్వచనం

'లింగం' అనేది నిరాకార స్వరూపం. ఆ స్వరూపం ఏర్పడటానికి ప్రకృతి ఆధారమైంది. ఇక్కడ ప్రకృతి అంటే 'శక్తి' కాబట్టి, ఆ శక్తితో కూడిన శివుడు, శక్తి ద్వారా ఈ జగత్తుని కల్పిస్తున్నాడు. ఇక్కడ 'లింగం' అంటే శివుడికి చెందిన ఒకానొక లోకోత్తర స్థితి అని గ్రహించాలి. "ఆకాశం లింగమిత్యాహుః పృథివీతస్యపీఠం' అనే నిర్వచనాన్ని బట్టి పద్నాలుగు లోకాలతో కూడిన ఈ ప్రపంచమంతా శివలింగ స్వరూపమే అని తెలుస్తోంది.

ఇరవైఆరు మహాతత్త్వాలు సమిష్టిగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులనే మూడురూపాల్ని ధరించి, సృష్టి, స్థితి, లయాలు చేస్తున్నాయి. ఈ ముగ్గురు మూర్తులకీ మూలపురుషుడు శివుడేనని పురాణాలు, వేదాలు నిర్వచించాయి.

శివసంకల్పం అనేది బీజం కాగా, విష్ణువు జగద్యోనిగా వున్నాడు. అలాంటి జగద్యోనిలో శివసంకల్పం అనే బీజం విడవగా ఆ విష్ణువు నాభి కమలం నుంచి బ్రహ్మదేవుడు ఆవిర్భవించాడు. శివుడు తన శక్తిని వేరు పరిచి ప్రేరేపించగా, ఆ శక్తి స్వయంగా సత్త్వరజస్తమోగుణాత్మకమైన జగత్తుని సృష్టిస్తోంది.

ఈ శివశక్తి ఎరుపు, తెలుపు, నలుపు రంగులతో నిర్మించిన జగత్తుని నిత్యమని భ్రమించి, జనన మరణ సమన్వితమైన సంసారంలో మునిగి తేలుతుంటాడు ఒకడు. మరొకడు ప్రకృతిని వివిధ జన్మల్లో అనుభవించి, విసిగి వేసారి చివరికి శివుణ్ణి ఆశ్రయిస్తాడు.

ప్రకృతిని సూక్ష్మ పంచభూతాలు చేరుకోగా, మహతత్త్వం మొదట పుట్టింది. తరువాత ఆ మహత్తత్వం నుంచి అహంకారం, దాని నుంచి శబ్దం, శబ్దం నుంచి ఆకాశం, ఆకాశం నుంచి స్పర్శం, దాన్నుంచి వాయువు, వాయువు నుంచి రూపం, రూపం నుంచి తేజస్సు, తేజస్సు నుంచి రసం, రసం నుంచి జలం, జలం నుంచి గంధం, ఆ గంధం నుంచి పృథివి(భూమి)ఆవిర్భవించాయి.

శబ్దాదుల్ని గుర్తించటం కోసం ఐదు జ్ఞానేంద్రియాలు ఐదు కర్మేంద్రియాలు వాటితోపాటు సంకల్ప వికల్పాత్మకమైన మనస్సు ఏర్పడింది.

ఈ బ్రహ్మాండంలో మొత్తం పద్నాలుగు లోకాలుంటాయి. వీటిలో ప్రధానమైన లోకం భూమండలం. ఈ భూమిని పదిరెట్లు జలం ఆవరించింది. ఆ జలాన్ని పదిరెట్లు తేజస్సు ఆవరించింది. ఆ తేజస్సుని వాయువు పదిరెట్లు చుట్టుకుని ఉండగా, ఆ వాయువుని పదిరెట్లు ఎక్కువగా ఆకాశం ఆవరించింది. ఆ ఆకాశాన్ని అహంకారం ఆవరించగా, ప్రకృతి అహంకారాన్ని ఆశ్రయించింది. ఈ ఏడు ఆవరణలకీ అధిష్ఠాత కమలాసనుడైన బ్రహ్మదేవుడు.

ఆదికర్తా చ భూతానాం సంహర్తాపరిపాలకః ।
తస్మాన్మాహేశ్వరో దేవో బ్రహ్మణోఽధిపతి శివః ॥

సకల ప్రాణుల్నీ పుట్టించే ఆదికర్త, రక్షకుడు, సంహారకర్త అయిన బ్రహ్మ విష్ణు రుద్రులైన త్రిమూర్తులకి అధిపతి ఆ శివుడే ఆయనే జగత్కర్త. కోట్లకొద్దీ బ్రహ్మాండాలు సృష్టించబడగా, అందులో ఉన్న ప్రతి బ్రహ్మాండంలో సృష్టి-స్థితి- లయ కర్తలుగా బ్రహ్మ - విష్ణు-రుద్రులే ఉంటారు.

ఇది పురుషాధిష్ఠిత అయిన ప్రకృతి ద్వారా జరిగే ప్రాథమిక సృష్టి.

## ప్రాథమిక సృష్టి విశేషాలు

ప్రాథమిక సృష్టి జరిగిన ప్రారంభసమయాన్ని పగలు అని, ఆ సృష్టి ముగిసిన కాలాన్ని రాత్రి అని అంటారు. బ్రహ్మదేవుడు పగలు ఈ ప్రపంచాన్ని సృష్టించి, రాత్రి దాన్ని ఆవాంతర ప్రళయం ద్వారా నశింపచేస్తాడు. ఈ విధంగా బ్రహ్మసృష్టి అహోరాత్రాలుగా కొనసాగుతుంది. అయితే ఆదికర్త అయిన పరమేశ్వరుడికి దివారాత్రి కాలవిభాగం వుండదని వేదాలు చెబుతాయి.

బ్రహ్మదేవుడి ఉదయకాలంలో దేవతలు, ప్రజాపతులు, మహర్షులు వ్యక్తంగా ఉంటారు. ఆయన రాత్రికాలంలో వారంతా సూక్ష్మరూపంలో దాగి, తిరిగి ప్రభాతసమయంలో జన్మిస్తారు. బ్రహ్మదేవుడి పగటికాలాన్ని కల్పం అంటారు. ఈ పగలు ఎంతో రాత్రి కూడా అంతే ఉంటుంది.

1.కృతయుగం 2.త్రేతాయుగం 3.ద్వాపరయుగం 4.కలియుగం అని యుగాలు మొత్తం నాలుగు. ఈ నాలుగు యుగాలనీ కలిపి మహాయుగమంటారు. ఇలాంటి వెయ్యి మహాయుగాలలో మొత్తం 14 మంది మనువులు పాలకులుగా ఉంటారు.

1. **కృతయుగం :** నాలుగువేల దివ్య సంవత్సరాలుంటుంది.
2. **త్రేతాయుగం :** మూడువేల దివ్య సంవత్సరాలుంటుంది.
3. **ద్వాపరయుగం :** రెండువేల దివ్య సంవత్సరాలుంటుంది.
4. **కలియుగం :** వెయ్యి దివ్యసంవత్సరాలుంటుంది.

ఈ నాలుగు యుగాలు సంధ్యలు, సంధ్యాంశలతో కలిపి 12వేల దివ్య సంవత్సరాలుగా ప్రవర్తిస్తాయి. మానవకాలమానం ప్రకారం చెప్పాలంటే 43,32,000 మానవ సంవత్సరాలు.

మానవుల నెలరోజులు పితృదేవతలకి ఒక్కరోజు అవుతుంది. పితృదేవతలకి శుక్లపక్షం పగలుగా, కృష్ణపక్షం రాత్రిగా ఏర్పడుతుంది. మానవుల ముప్పైనెలలు పితరులకి 1 నెల అవుతుంది. మానవుల 360 నెలలు పితృదేవతలకి ఒక సంవత్సరం అవుతుంది. మానవుల వందసంవత్సరాలు వారికి మూడు సంవత్సరాలుగా ఉంటుంది.

ఇక దేవతల కాలమానం గురించి చెప్పాలంటే మానవుల ఒక సంవత్సర కాలం దేవతలకి ఒక్కరోజు. ఈ సంవత్సర కాలంలో భాగమైన ఉత్తరాయణం దేవతలకి పగలుగా, దక్షిణాయనం హరికి రాత్రిగా చెప్పబడింది.

మానవుల 3030 సంవత్సరాలు సప్తర్షులకి ఒక సంవత్సరం. మానవుల 9090 సంవత్సరాలు ధ్రువుడికి ఒక సంవత్సరం అలాగే 36,100 మానవ సంవత్సరాలు ఒక దివ్యవత్సరంగా పరిగణించబడింది.

ఈ సృష్టిలో వైమానిక దేవతలనేవారు మొత్తం 28 కోట్లమంది ఉంటారు. అవాంతర ప్రళయం సంభవించినప్పుడు మహర్లోకంలో ఉండే వాళ్ళంతా జనోలోకానికి చేరుకుంటారు.

బ్రహ్మదేవుడికి వెయ్యి కల్పాలు అనగా ఒకరాత్రి. పగలు గడిస్తే ఒక సంవత్సరం గడిచినట్టు. ఇలాంటి బ్రహ్మ సంవత్సరాలు 8 వేలు గడిస్తే ఆయనకి ఒకయుగం అవుతుంది. ఇలాంటి బ్రహ్మయుగాలు ఒక వేయి గడిస్తే దాన్ని 'సవనం' అంటారు. ఇలాంటి సవనాలు మూడువేలు గనుక పూర్తయితే బ్రహ్మదేవుడి పదవీకాలం పూర్తవుతుంది.

ఈ విధంగా ఇప్పటివరకూ వేయికోట్ల కల్పాలు గడిచిపోయాయి. తిరిగి మరో వేయికోట్ల కల్పాలు రానున్నాయి. ప్రకృతి ద్వారా ఆవిర్భవించిన ఈ ప్రపంచ వినాశం అనేది శివుడి ఆజ్ఞతోనే సంభవిస్తుంది. సృష్టి సంహారం జరిగేడప్పుడు, ప్రకృతి పురుషుణ్ణి ఆశ్రయిస్తుంది. సత్త్వరజస్తమోగుణాలు మూడూ ఎక్కువ తక్కువగా ఉంటే సృష్టి ప్రారంభమవుతుంది. అవి మూడూ సమానమైతే సృష్టి నశించబడుతుంది. దాన్నే ప్రళయం అంటారు. ఈ త్రిగుణాల వైషమ్యానికీ, సామ్యానికి కారణం పరమేశ్వరుడే. ఆయన తన లీలలో భాగంగా సృష్టి స్థితి లయాలని చేస్తుంటాడు.

అసంఖ్యాతాశ్చ కల్పాఖ్యా హ్యసంఖ్యాతాః పితామహాః ।
హరయశ్చాప్యసంఖ్యాతా స్త్వేక ఏవ మహేశ్వరః ॥

ఎన్నో కల్పాలు, ఎందరో బ్రహ్మలు, ఎందరో విష్ణుమూర్తులు ఉన్నప్పటికీ పరమేశ్వరుడు మాత్రం ఒక్కడే. ఆయనే పరబ్రహ్మ. ఆ పరమేశ్వరుడు ప్రకృతికి బద్ధుడు కాకపోవటం వల్లనే ఆది మధ్యాంత రహితుడుగా పరిగణించబడ్డాడు.

ఈ చరాచర ప్రపంచమంతా ప్రళయంలో నశించి మొత్తం జలమయమైపోగా ఆ నీళ్ళలో బ్రహ్మదేవుడు ప్రయాణించి నారాయణుణ్ణి శరణువేడాడు. నారాయణుడు తిరిగి నూతన సృష్టి ప్రారంభంకావాలని భావించి, నీళ్ళలో మునిగిపోయిన భూమిని, వరాహరూపంతో ఉద్ధరించాడు. అప్పుడు మళ్ళీ నదీనద సముద్రాలతో సకలజీవరాశులతో కూడిన సృష్టి ప్రారంభించబడింది.

## బ్రహ్మ చేసిన సృష్టి క్రమం

బ్రహ్మదేవుడి నుంచి ముందుగా తమస్సు, మోహం, మహామోహం, అంధతామిస్రం వీటితోపాటు అయిదు విధాలుగా ఉన్న అవిద్య ఆవిర్భవించాయి. వీటితో బ్రహ్మకి సంతృప్తి కలగలేదు. వెంటనే ముఖ్యసృష్టిని చేయటం ప్రారంభించాడు.

ముఖ్యసృష్టిలో భాగంగా ముందుగా వృక్షాలని, తరువాత అడ్డంగా నడిచే జంతువుల్ని, వాటి తరువాత ఊర్ధ్వ మార్గంలో సంచరించే దేవతల్ని సృష్టించాడు. వారి తరువాత ఈశ్వరానుగ్రహాన్ని సంపాదించే నేర్పు కలిగిన మానవులు బ్రహ్మనుంచి ఆవిర్భవించారు.

పంచభూతాలు, పంచతన్మాత్రలు, తిర్యక్కులైన పశుపక్ష్యాదులు, దేవతలు, మానవులు, ఈశ్వరానురగ్రహ పాత్రులైన సనక సనందనాది మహర్షుల్ని సృష్టించాడు బ్రహ్మదేవుడు. ఈ విధంగా బ్రహ్మ చేసిన తొమ్మిదిరకాల సృష్టిలో సనకసనందనాది మహర్షులు బ్రహ్మ మనసునుంచి మొదటిసారిగా జన్మించారు. వారు జ్ఞాన యోగనిష్ఠులై పరమేశ్వరారాధనలో లీనమైపోయారు.

బ్రహ్మదేవుడు శివధ్యానయోగం చేసిన మహిమతో తొమ్మిది మంది ప్రజాపతుల్ని సృష్టించాడు. వారే 1.మరీచి 2.భృగువు 3.అంగిరసుడు

4.పులస్త్యుడు 5.పులహుడు 6.క్రతువు 7.దక్షుడు 8.అత్రి 9. వశిష్ఠుడు. ఈ తొమ్మిది మందినీ నవవిధప్రజాపతులంటారు. వారంతా వేదవేదాంగ పారంగతులు. బ్రహ్మతో సమానులు. అలాగే 1.సంకల్పం 2.ధర్మం 3.ధర్మంతో కలిసి ఉండే అధర్మ మార్గం అనే మూడింటితో కలుపుకుంటే మొత్తం బ్రహ్మమానస పుత్రులు పన్నెండుమంది.

శతరూప స్వాయంభువ మనువుని వివాహం చేసుకుని ఇద్దరు కుమారుల్ని, ఇద్దరు కుమార్తెల్ని కన్నది. శతరూపపుత్రుల్లో పెద్దవాడు ప్రియవ్రతుడు కాగా, రెండోవాడు ఉత్తానపాదుడు. ఆకూతి ప్రసూతి అనే ఇద్దరు శతరూపకి కుమార్తెలు. వీరిలో ఋచి అనే ప్రజాపతి ఆకూతిని వివాహం చేసుకోగా, ప్రసూతిని దక్షప్రజాపతి పెళ్ళాడాడు. వీరిలో ప్రసూతి దక్షుడి ద్వారా ఇరవైనాలుగుమంది కుమార్తెల్ని కన్నది. వారే 1.శ్రద్ధ 2.లక్ష్మి 3.ధృతి 4.పుష్టి 5.తుష్టి 6.మేధ 7.క్రియ 8.బుద్ధి 9.లజ్జ 10.వపు 11.శాంతి 12.సిద్ధి 13.కీర్తి 14.ఖ్యాతి 15.శాంతి 16.సంభూతి 17.స్మృతి 18.ప్రీతి 19.క్షమ 20.సన్నతి 21.అనసూయా 22.ఊర్జ 23.స్వాహా 24.స్వధా అనేవారు.

వీరిలో శ్రద్ధనుంచి కీర్తి అనే ఆమె వరకూ ఉన్న పదమూడుమంది కుమార్తెల్ని ధర్ముడనే ప్రజాపతి కిచ్చి వివాహం జరిపించారు. తరువాత కుమార్తెల్లో భృగుమహర్షి 'ఖాతి'ని, మరీచి సంభూతిని, అంగిరసుడు – స్మృతిని, పులస్త్యుడు – ప్రీతిని, పులహుడు – క్షమని, క్రతువు సన్నతిని, అత్రిమహర్షి – అనసూయాదేవిని, వశిష్ఠమహర్షి – ఊర్జని, విభావసుడు (అగ్నిదేవుడు) స్వాహాని, పితృదేవతలు స్వధాదేవిని వివాహం చేసుకున్నారు.

దక్షప్రజాపతి ఎంతో పుణ్యాత్ముడు. కనుకే ఆదిశక్తి అవతారంగా వున్న 'సతీదేవిని' కుమార్తెగా పొందాడు. లోకమాత అయిన ఆ సతీదేవి లోకనాయకుడైన పరమేశ్వరుణ్ణే పతిగా పొందింది.

పూర్వం బ్రహ్మదేవుడు సృష్టి ప్రారంభంలో పరమేశ్వరుడి అర్ధనారీశ్వర రూపాన్ని చూసి "ప్రభూ! నీ దివ్య రూపంలో ఉన్న ప్రకృతి(శక్తి)ని, పురుషుణ్ణి

విడివిడిగా విభజించి చూపు” అని ప్రార్థించాడు. దానికి అంగీకరించిన శివుడు తనలో ఉన్న స్త్రీ రూపాన్ని విడిగా ప్రదర్శించగా ఆమే సతీదేవిగా పరిణమించిందని మరొక కథనం.

ముల్లోకాల్లో ఉన్న స్త్రీలంతా సతీదేవి అంశలు కాగా, ఏకాదశ రుద్రులు– ఇతర పురుషులందరూ ఈశ్వరాంశతో జన్మించిన వారని భావించాలి. పూర్వం దక్షప్రజాపతి ఆదిశక్తిని ప్రార్థించి తనకు కుమార్తెగా జన్మించమని ప్రార్థించగా ఆమె అనుగ్రహించి దక్షుడికి పుత్రికగా జన్మించింది. ఆమెకి ‘సతీదేవి’ అన్న పేరుపెట్టి యుక్తవయసు రాగానే పరమేశ్వరుడికిచ్చి వివాహం చేసాడు దక్షుడు.

**ధర్ముడి సంతానం :** బ్రహ్మదేవుడు ధర్ముణ్ణి సృష్టించగా ఆయనకి వరుసగా–కామం, దర్పం, నియమం, సంతోషం, లాభం, శ్రుతం, దండం, సమయం, బోధం, అప్రమాదం, వినయం, వ్యవసాయం, క్షేమం, సుఖం, యశస్సు అనే పదిహేను మంది పుత్రులు జన్మించారు. వీరిలో ధర్ముడికి క్రియ అనే భార్య ద్వారా దండం, సమయం అనేవారు, బుద్ధి అనే భార్యద్వారా – అప్రమాదం, బోధం అనేవారు జన్మించగా, మిగిలిన పదకొండుమంది పుత్రులు ధర్ముడి ఇతర భార్యల ద్వారా జన్మించారు.

1. **భృగుమహర్షి–ఖ్యాతి సంతానం :** లక్ష్మీదేవి – ధాత – విధాత
2. **మరీచి మహర్షి–ప్రభూతి సంతానం :** పూర్ణమాసుడు, మారీచుడు; వీరితోపాటు తుష్టి, దృష్టి, కృష్టి, అపచితి అనే పుత్రికలు
3. **పులహమహర్షి–క్షమాదేవి సంతానం :** కర్దముడు, వరీయాంసుడు, సహిష్ణువు అనే పుత్రులు; పీవరి అనే కుమార్తె
4. **పులస్త్యుడు–ప్రీతి సంతానం :** దత్తోర్ణుడు, వేదబాహువు అనే పుత్రులు; దృషద్వతి అనే పుత్రిక
5. **క్రతుమహర్షి–సన్నతి సంతానం :** వాలఖిల్యులనే పేరుతో ప్రసిద్ధి చెందిన అరవైవేల మంది పుత్రులు
6. **అంగిరసుడు–స్మృతి సంతానం :** సినీవాలి, కుహూ, రాక, అనుమతి అనే నలుగురు కుమార్తెలు; లబ్ధానుభావుడు, అగ్నికీర్తిమంతుడు అనే పుత్రులు

7. **అత్రిమహర్షి -అనసూయ సంతానం :** శ్రుతి అనే కుమార్తె, సత్యనేత్రుడు, భవ్యుడు, ఆపుడు, శనైశ్చరుడు, సోముడు అనే కుమారులు

8. **వశిష్ఠమహర్షి - ఊర్జసంతానం :** రజస్సు, సుహోత్రుడు, బాహువు, సవనుడు, అనవుడు, సుతపుడు, శుక్రుడు అనే ఏడుగురు పుత్రులు

అమిత తేజోవంతుడైన అగ్ని సృష్టిమొదట్లో బ్రహ్మదేవుడి ముఖం నుంచి ఆవిర్భవించి, తిరిగి రెండోసారి అంగిరస మహర్షి పుత్రుడుగా జన్మించాడు. ఈ అగ్నిదేవుడే ప్రజలందరిలో జఠరాగ్ని రూపుడిగా వారికి ప్రాణమై ఉంటున్నాడు.

**అగ్ని సంతానం :** అగ్నిదేవుడికి స్వాహాదేవి ద్వారా పవమానుడు, పావకుడు, శుచి అనే ముగ్గురు పుత్రులు జన్మించారు. వీరిలో ఆరణిని-ఉత్తరారణితో మథించగా పుట్టినవాడు పవమానుడు కాగా, పావకుడు మెరుపువల్ల ఆవిర్భవించాడు. ఇక శుచి అనేవాడు సూర్యకిరణాల నుంచి ఉద్భవించాడు. ఇలా అగ్నిపుత్రులైన ఈ ముగ్గురితో పాటు మొత్తం నలభైతొమ్మిది మంది అగ్నులు యజ్ఞయాగాలలో ఉపయోగించబడుతున్నారు. ఈ నలభై తొమ్మిది అగ్నులూ తాపసులుగా, వ్రతనిష్ఠులుగా, ప్రజాపతులుగా, రుద్రాత్మకులుగా ప్రసిద్ధిచెందారు. వారంతా స్వధా అనే భార్యద్వారా 'మేనక' అనే మానసపుత్రికని కన్నారు.

మేనకాదేవి హిమవంతుణ్ణి వివాహం చేసుకుని మైనాకుడు, క్రౌంచుడు అనే పుత్రుల్ని, 'ఉమ' అనే కుమార్తెని అలాగే గంగ అనే పవిత్రమైన నదిని కూడా కన్నది. వీరితో పాటు యజ్ఞయాగాలకి అధికరణంగా ఉండే 'ధరణి' అనే మానస పుత్రికని కూడా కన్నది.

దాక్షాయణీ సతీయాసా పార్శ్వం రుద్రస్యపార్వతీ ।
తాం ధ్యాత్వా వ్యసృజద్రుద్రా ననేకాన్నీలలోహితః ॥

దక్షప్రజాపతి పుత్రిక అయిన సతీదేవి తన తండ్రిచేత అవమానించబడి, శివరహితంగా, ఆయన చేస్తున్న యజ్ఞవాటికలోనే ఆత్మార్పణ చేసుకుంది.

తిరిగి ఆమే మేనకా హిమవంతులకి పార్వతిగా జన్మించి పరమేశ్వరుణ్ణి భర్తగా పొందింది. పరమేశ్వరుడు సతీదేవినే తలుచుకుంటూ ఎంతో మంది రుద్రుల్ని పుట్టించాడు. అలా జన్మించిన వారంతా రుద్రుడితో సమానమైన శక్తి సామర్థ్యాలు కలిగినవారు. ఆ రుద్రులందరూ పద్నాలుగు లోకాల్లో నిండిపోయారు. మహా పరాక్రమవంతులైన రుద్రులు మరణంలేని వారవటంతో బ్రహ్మదేవుడు ఎంతో ఆందోళనపడి శివుడితో "ప్రభూ! జరామరణాలు లేకపోతే సృష్టికార్యం కొనసాగదు. దయచేసి మరణం ఉన్నవారిని సృష్టించు" అని ప్రార్థించాడు. అప్పుడు శివుడు "బ్రహ్మ! అలాంటి సృష్టి నీవే చేయి" అని ఆజ్ఞాపించటంతో బ్రహ్మ చరాచర ప్రపంచాన్నంతా జరామరణాలతో ఉండే జీవులతో సృష్టించాడు. శంకరుడు తాను సృష్టించిన రుద్ర గణాలన్నిటినీ తన ఆజ్ఞకి లోబడేవారిగా చేసుకున్నాడు.

శంరుద్రస్సర్వ భూతానాం కరోతి ఘృణయాయుతః ।
శంకరశ్చాప్రయత్నేన తదాత్మాయోగ విద్యయా ॥

**శివానుగ్రహం :** సకల ప్రాణులకీ ఇహపరాల్లో సుఖాన్ని కలిగించేవాడు, కరుణామయుడు శంకరుడని పిలువబడతాడు. ఈ సుఖం మానవ ప్రయత్నంతో లభించేది కాదు. పరమేశ్వరుణ్ణి 'శివోఽహం' అన్న భావనతో (శివుడే నేను) ఆరాధించటాన్నే భక్తి యోగం అంటారు.

అష్టాంగ యోగాన్ని భక్తి పూర్వకంగా అభ్యసించటం వల్ల 'శివదర్శనం' లభిస్తుంది. సాధకుడు క్రమంగా విరక్తి భావాన్ని పెంచుకుంటే సంసార బంధాల నుంచి విముక్తి పొందగలుగుతాడు. మానవుడు దుర్గుణాల్ని వదిలిపెట్టి సద్గుణాల్ని అలవాటు చేసుకుని, వైరాగ్యంతో చిత్తశుద్ధి పొందితే, శివధ్యానం అభ్యాసం చేయటానికి యోగ్యుడవుతాడు. అలాంటి వాడికే శివధ్యానం సిద్ధిస్తుంది.

వేదశాస్త్రాలలో చెప్పిన వర్ణాశ్రమధర్మాలు, ఉపాసనాత్మకమైన జ్ఞానం, వైరాగ్యం, ఈశ్వరభావం ఇవన్నీ కేవలం శివానుగ్రహంతోనే లభిస్తాయి.

యేశంకరాశ్రితాస్సర్వే ముచ్యంతే న సంశయః ।
న గచ్ఛంత్యేవ నరకం పాపిష్ఠాఽ పి దారుణమ్ ।
ఆశ్రితాః శంకరం తస్మాత్ ప్రాప్నువంతి చ శాశ్వతం ॥

శరణాగత వత్సలుడైన శంకరుణ్ణి ఆశ్రయించిన వారంతా మోక్షాన్ని పొందుతారు. ఇందుకెలాంటి సందేహం అక్కర్లేదు. నిజమైన శివభక్తులు పూర్వజన్మ ప్రారబ్ధం వల్ల ప్రస్తుత జన్మలో పాపాత్ములైనప్పటికీ మరణానంతరం ఆ జీవులు నరకంలోకి ప్రవేశించరు. కనుక పరమేశ్వరుణ్ణి త్రికరణ శుద్ధిగా ఆశ్రయించి అందరూ శాశ్వతమైన కైలాస ప్రాప్తి పొందాలి.

## శివ యోగాచార్యులు

అత్యంత వైరాగ్యంతో, ప్రాణాయామం మొదలైన అష్టాంగ యోగాన్ని అభ్యసిస్తూ, కరుణ, దయ లాంటి సద్గుణాలతో నిండి ఉన్నప్పటికీ, ఎన్నో రకాల ధర్మాల్ని ఆచరించినప్పటికీ శివయోగులు తమ తమ కర్మానుసారంగానే స్వర్గ-నరకాల్ని పొందుతుంటారు. దీనివల్ల తెలిసిందేమిటంటే అష్టాంగయోగాన్ని అభ్యసించటం వల్ల మోక్షం రాదని, అయితే శివానుగ్రహంతో "శివుణ్ణి ఉపాసించాలి" అనే జ్ఞానం కలగగా, ఆ జ్ఞానం ద్వారా ఆయన్ని శ్రద్ధగా ఉపాసించినందువల్ల శివధ్యానయోగం సిద్ధిస్తుంది. అలాంటి ధ్యానం వల్లనే ముక్తి సులభతర మౌతుంది.

**వ్యాసావతారాలు :** ద్వాపరయుగాంతంలో వ్యాసావతారాలు కలియుగం ప్రారంభంలో యోగాచార్యుల అవతారాలు ఉంటాయి. ఈ యోగాచార్యుల్లో ఒక్కొక్కరికీ నలుగురు శిష్యులు, వారికి ప్రశిష్యులు-ఇలా ఎంతో మంది పరంపరగా అవతరిస్తారు. వీరందరూ పరమేశ్వరానుగ్రహ పాత్రులు.

శ్వేత వరాహకల్పంలో, వైవస్వతమన్వంతరంలో వ్యాసావతారాలు, శివయోగావతారాలు ఈ విధంగా చెప్పబడ్డాయి. వీరంతా వేదాల్లో పురాణాల్లో చెప్పిన విజ్ఞానాన్ని లోకంలో ప్రవర్తింపచేస్తారు.

1.క్రతువు 2.సత్యుడు 3.భార్గవుడు 4.అంగిరసుడు 5.సవిత 6.మృత్యువు 7.శతక్రతువు 8.వశిష్ఠుడు 9.సారస్వతుడు 10.త్రిధాముడు

11.త్రివృతుడు 12.శతతేజస్కుడు 13.నారాయణుడు 14.తరక్షువు 15.ఆరుణి 16.దేవుడు 17.కృతంజయుడు 18.ఋతంజయుడు 19.భరద్వాజుడు 20.గౌతముడు 21.వాచఃశ్రవుడు 22.శుష్మాయణి 23.తృణబిందువు 24.రుక్షుడు 25.శక్తి 26.పరాశరుడు 27.జాతూకకర్ణ్యుడు, కృష్ణద్వైపాయనుడు – వీరంతా వ్యాసావతారాలు.

**మన్వంతరాలు :** మనువుల్లో మొదటివాడు 1.స్వాయంభువ మనువు. తరువాత వరుసగా 2.స్వారోచిషమనువు 3.ఉత్తమ మనువు 4.తామసమనువు 5.రైవతమనువు 6.చాక్షుషమనువు 7.వైవస్వతమనువు 8.సూర్యసావర్ణి మనువు 9.బ్రహ్మసావర్ణి మనువు 10.ధర్మసావర్ణి మనువు 11.రుద్రసావర్ణి మనువు 12.పింశంగ మనువు 13.శబలమనువు 14.వర్ణకమనువు – వీరంతా పద్నాలుగు మంది మనువులు. వీరి పేరుతోనే మన్వంతరాలు ఏర్పడ్డాయి.

ప్రస్తుతం ఈ మన్వంతరాలలో ఆరు మన్వంతరాలు గడిచిపోయాయి. ఇప్పుడు నడుస్తున్నది ఏడోదైన వైవస్వత మన్వంతరం. ఈ మన్వంతరంలో – ఇరవై ఎనిమిదో మహాయాగంలోదైన కలియుగం ప్రారంభంలో శివయోగాచార్యులు ఆవిర్భవించారు.

**శివయోగాచార్యులు :** కలియుగం ప్రారంభంలో ఆవిర్భవించిన శివయోగాచార్యులు 1.శ్వేతుడు 2.సుతారుడు 3.మదనుడు 4.సుహోత్రుడు 5.కంకణుడు 6.లోగాక్షి 7.జైగీషవ్యుడు 8.దధి వాహనుడు 9.ఋషభుడు 10.ముని 11.ఉగుడు 12.అత్రి 13.సుబాలకుడు 14.గౌతముడు 15.వేదశీర్షుడు 16.గోకర్ణుడు 17.శిఖండభృత్ 18.జటామాలి 19.అట్టహాసుడు 20.దారుకుడు 21.లాంగలి 22.మహాకాయముని 23.శూలి 24.ధుండీశ్వరుడు 25.సహిష్ణువు 26.సోమశర్మ 27.నకులీశుడు అనే ఇరవై ఏడుమంది.

ఇక్కడ తెలిపిన వ్యాసావతారాలు ప్రతిద్వాపర యుగాంతంలో, శివయోగాచార్యావతారాలు ప్రతి కలియుగం ప్రారంభంలో ఆవిర్భవిస్తూ ఉంటాయి. ఈ శివయోగాచార్యుల్లో ఒక్కొక్క ఆచార్యుడికీ నలుగురు చొప్పున శిష్యులుంటారు.

శివయోగాచార్యుల్నే పాశుపతులని తపః సిద్ధులనీ పేర్కొంటారు. వారంతా భస్మ రుద్రాక్షల్ని ధరించి, 'పాశుపతం' అనే శివధ్యాన యోగాన్ని ఆశ్రయించి రుద్రలోకాన్ని చేరటం కోసం నిరంతరం ప్రయత్నిస్తూ ఉంటారు.

**పశుపతి అంటే ?**

దేవాదయః పిశాచాంతాః పశవః ప్రకీర్తితాః ।
తేషాం పతిత్వాత్సర్వేశో భవః పశుపతిః స్మృతః ॥

ఇంద్రాది దేవతల నుంచి పిశాచాది గణాలవరకూ సకల జీవులూ పశువులని పిలవబడతారు. అలాగే సంసారబంధం అనే పాశాలతో బంధించబడ్డ వారు కూడా పశువులే అనబడతారు. అలాంటి పశువులందర్నీ శాసించే ప్రభువు కనుకనే పరమేశ్వరుడు 'పశుపతి' అవుతున్నాడు.

## అష్టాంగయోగం ద్వారా శివోపాసన

శివుడు యోగీశ్వరుడు. ఆయన్ని పొందాలంటే యోగమార్గం ద్వారా మాత్రమే పొందగలం. ఈ యోగం కూడా ఆయన ప్రబోధించిందే. అష్టాంగ యోగం అనేది శివానుగ్రహాన్ని కలిగించే విశిష్టమైన ఉపాసనా మార్గం. దీని ప్రకారం యోగాన్ని ఆచరిస్తే శివానుగ్రహం సత్వరం పొందవచ్చు.

మానవశరీరంలో కంఠం క్రింద నుంచి నాభివరకూ ఉన్నస్థానం అత్యుత్తమమైంది. దీని మధ్యలోనే హృదయం ఉంటుంది. దీని తరువాత రెండు కనుబొమల మధ్యస్థానం మధ్యమమైంది. ఈ రెండు స్థానాలూ గొప్పవి. ఈ స్థానాల్ని ఆశ్రయించి యోగాభ్యాసాన్ని చేసిన వాడికి సర్వార్థజ్ఞానం కలుగుతుంది. మనస్సు ఏకాగ్రతతో నిశ్చలమవుతుంది. శివానుగ్రహ ప్రాప్తి తద్వారా లభించే ఆనందం స్వయంగా తెలుసుకోవాలేగానీ బ్రహ్మాదులు కూడా దాన్ని వివరించి చెప్పలేరు.

శివయోగం అంటే మహేశ్వరుడికి సంబంధించిన నిరతిశయ ఆనందం. అలాంటి ఆనందం లభించటానికి శివజ్ఞానం కావాలి. జ్ఞానంతో కూడిన శివోపాసన అనేది కేవలం ఆ శివుడి అనుగ్రహంతోనే లభిస్తుంది.

శివజ్ఞానం కలగటం వల్ల ఇంద్రియాలని విషయవాంఛల నుంచి పక్కకి మరల్చి నిరోధించగలిగేశక్తి ఉపాసకుడికి వస్తుంది. తద్వారా అతడు చేసిన పాపం మొత్తం నశిస్తుంది. అలా ఇంద్రియనిగ్రహం పొందిన వారికే యోగం సిద్ధిస్తుంది.

చిత్తాన్ని (మనసుని) నిరోధించటాన్నే యోగం అంటారు. ఈ యోగం మొత్తం ఎనిమిది విధాలుగా చెప్పబడింది. 1.యమం 2.నియమం 3.ఆసనం 4.ప్రాణాయామం 5.ప్రత్యాహారం 6.ధారణం 7.ధ్యానం 8.సమాధి

**1. యమం :** యమము అంటే వాదిక లౌకిక కర్మల్ని చాలించటం. అహింసా గుణం వల్ల యమము అనేది అలవడుతుంది. దీన్ని పొందటానికి సత్యం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం - ఇలాంటి నియమాలు పాటించాలి. యమాన్ని సాధించే గుణాలలో ప్రధానమైనది అహింస. అహింస అంటే తనలాగానే ఇతర ప్రాణులందరి మేలుకోసమే ప్రవర్తించటం, సత్యం అంటే చూసింది, విన్నది, ఊహించింది, అనుభవించింది అయిన విషయాల్ని యథాతథంగా ఇతరులకి బాధకలగకుండా చెప్పటం, అశ్లీల సంభాషణలు చేయకపోవటం, ఇతరుల దోషాలు తెలిసి ఎప్పటికీ వాటిని మరొకరికి చెప్పకుండా వుండటం సత్యమని చెప్పబడుతుంది.

ఆపత్కాలంలో కూడా ఇతరుల ద్రవ్యాల్ని మనసుచేత, మాటచేతా, క్రియచేత స్వీకరించకుండా ఉండటం-దీన్నే 'అస్తేయం' అంటారు. బ్రహ్మచారులు, సన్యాసులు, మనో వాక్కాయ కర్మల ద్వారా మైథునాన్ని ఆచరించకుండా ఉండటాన్నే బ్రహ్మచర్యమంటారు. అయితే భార్యతో ఉన్న గృహస్థులు ఇతరస్త్రీలని వాంఛించకుండా, కేవలం తమ భార్యలతోనే, అదీ విహితమైన సమయంలోనే మైథునం చేయవచ్చు. అలాచేసిన వారుకూడా బ్రహ్మచారులుగానే పరిగణించబడతారు. గృహస్థుడి భార్య పరమ పవిత్రురాలిగా చెప్పబడింది. కనుక ఆమెతో రతిసుఖం పొందిన వెంటనే పురుషుడు స్నానం చేయాలి.

స్త్రీలతో సహవాసం వినోద సంభాషణలు చేయకూడదు. స్త్రీల మీద వైరాగ్యభావాన్ని కలిగిఉండాలి. తమ భార్యలతో కూడా స్వేచ్ఛగా విహరించకూడదు.

స్త్రీతో అతిగా సంభోగం చేయకూడదు. ఇంద్రియాలు విషయభోగాల్ని అనుభవించటంతో తృప్తిపడవు. అందుకే త్రికరణ శుద్ధిగా విషయసుఖవాంఛని విడిచిపెట్టాలి. ఇలా కామసుఖాన్ని విడిచినవాడే మోక్షానికి అర్హుడు. ఇలా విషయవాంఛా విరక్తి వైరాగ్యంలేని మానవుడు మానవ మృగ, పశుపక్ష్యాది నానావిధ జన్మల్ని ఎత్తాల్సివుంటుంది. విషయత్యాగం అనగా, వివిధ రకాల కర్మల్ని కోరికలతో కాకుండా, ఎలాంటి ప్రతిఫలాన్నీ ఆశించకుండా ఈశ్వరార్పణ భావంతో ఆచరించిన వారు మాత్రమే మోక్షాన్ని పొందటానికి అర్హులు.

**2. నియమం :** శౌచం, దానం, యజ్ఞం, తపస్సు, స్వాధ్యాయం, ఇంద్రియ నిగ్రహం, వ్రతం, ఉపవాసం, మౌనం, స్నానం అనే పదీ నియమాలు. దేనిమీదా ప్రత్యేకంగా అభిమానాన్ని పెంచుకోకపోవటం కూడా నియమమే అవుతుంది. వీటితోపాటు శౌచం, తృప్తి అనేవి కూడా ముఖ్యమైనవే. శివమంత్రాన్ని జపించటం తపస్సు అవుతుంది. పద్మకం మొదలైనవి ఆసనాలు.

శౌచం అనేది బాహ్యశౌచం, అంతర శౌచం అని రెండు విధాలుగా ఉంటుంది. బాహ్యశౌచాన్ని ఆచరించినప్పటికీ అంతర శౌచాన్ని కూడా తప్పకుండా కలిగిఉండాలి. బాహ్య శౌచం 1.ఆగ్నేయం 2.వారుణం 3.బ్రహ్మం అని మూడు రకాలుగా ఉంటుంది. కనుక శివోపాసకులైనవారు బాహ్యస్నానాలతో పాటు అంతఃశౌచాన్ని (స్నానాన్ని) కూడా ఆచరించాలి. పవిత్రమైన దివ్య తీర్థాలలో మునిగి అంతఃశౌచాన్ని ఆచరించకపోతే అతడు పరిశుద్ధుడు కాలేడు.

అభ్యంతరశౌచం అంటే ఆత్మజ్ఞానం అనే జలంతో, స్థిరమైన వైరాగ్యం అనే మట్టిని సూక్ష్మశరీరానికి రాసి కడుక్కోవటం. 'స్వాధ్యాయం' అంటే ప్రణవం (ఓంకారం) అనే సూక్ష్మ పంచాక్షరితో స్థూల పంచాక్షరిని జపించటం. 1.వాచికం 2.ఉపాంశువు 3.మానసికం అని జపాలు మూడువిధాలు. వీటిలో వాచికంకన్నా ఉపాంశువు. దానికన్నా మానసిక జపం శ్రేష్ఠమైనవి. వాచిక జపం అంటే ఇతరులకి వినిపించేలా జపించటం, ఉపాంశువు అనగా పెదవులు కదిలిస్తూ వినపడకుండా మంత్రజపం చేయటం, మానసికమంటే మంత్రాన్ని మనసులోనే జపించటం.

నిశ్చలమైన గురుభక్తిని పెంపొందించుకుని విషయసుఖాల మీద ఆకర్షితమయ్యే ఇంద్రియాలని నిగ్రహించటాన్నే ప్రత్యాహారమంటారు. శివానుగ్రహం కోరేవాడు దీన్ని కూడా అభ్యసించాలి. చిత్తాన్ని (మనసుని) ఏకాగ్రతతో ఉంచటమే ధారణ. ధారణ వల్ల ధ్యానం తద్వారా సమాధి సిద్ధిస్తాయి. అనన్యమైన ఏకాగ్రతతో పరమేశ్వరుడి దివ్యరూపాన్ని చింతించటాన్నే ధ్యానం అంటారు. స్థూల సూక్ష్మ కారణ శరీరాల్ని ఐక్యం చేయటమే సమాధిస్థితి. ఇక ప్రాణాయామం. ఇది అన్ని యోగాంగాలకీ– యమ, నియమ, ఆసన, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులన్నిటికీ ముఖ్యసాధనమని గ్రహించాలి.

**3. ప్రాణాయామం :** శరీరంలో వున్న ప్రాణవాయువుని నిరోధించటాన్నే ప్రాణాయామం అంటారు. ఇది మందం, మధ్యమం, ఉత్తమం అని మూడు విధాలుగా ఉంటుంది. ప్రాణవాయువుని, అపానవాయువుని నిరోధించటాన్ని కూడా ప్రాణాయామమనే అంటారు.

ఒక రెప్పపాటు కాలాన్ని మాత్ర అంటారు. ఇలాంటి పన్నెండు మాత్రల కాలంలో చేసే ప్రాణాయామాన్ని కనిష్ఠప్రాణాయామం అంటారు. దీనికే 'ఉద్వాతం' అనిపేరు. ఇక రెండో రకమైన ప్రాణాయామం మధ్యమం. ఇది ఇరవైనాలుగు మాత్రల కాలంతో చేయబడేది. మూడోది ఉత్తమం. ఇది ముప్ఫైఆరు మాత్రల కాలం ప్రాణవాయువుని నిలిపిచేసేది. వీటిలో కనిష్ఠ ప్రాణాయామం చేస్తే చెమటపడుతుంది. మధ్యమప్రాణాయామం చేస్తే శరీరం వణుకుతుంది. మూడో ప్రాణాయామం చేస్తే శరీరం పైకి లేస్తుంది.

నిద్రతో తూగేలా కళ్ళు వాలిపోవటం, శరీరం పులకరించినట్లవటం, చిన్న ధ్వనితో శరీరం చలించటం, శరీరం కొంచెం వణికి తిరిగినట్లవటం, చెమట పట్టి మూర్ఛ వచ్చినట్లవటం – ఇలాంటి అనుభవాలతో కూడిన ప్రాణాయామం ఉత్తమమైనదిగా గ్రహించాలి.

ప్రాణాయామం మనోవాక్కాయ కర్మల దోషాల్ని పోగొట్టి శరీరాన్ని రక్షిస్తుంది. అంతేకాదు ఆనందాన్ని, శాంతిని, సుఖాన్ని మనసుకి, శరీరానికి కలిగిస్తుంది. శాంతి, ప్రశాంతి, దీప్తి, ప్రసాదం అనేవి యోగం ద్వారా సంభవిస్తాయి.

**1. శాంతి :** సహజంగా, ఆగంతుకంగా వచ్చే కష్టాలు శమించటం.

**2. ప్రశాంతి :** వాక్కుని అదుపులో ఉంచుకోవటం.

**3. దీప్తి :** అన్నికాలాల్లో శరీరం, మనసు వికాసంచెంది ఉండటం.

**4. ప్రసాదం :** ఇంద్రియాలు, బుద్ధి, పదిప్రాణాలూ స్వస్థతతో ఉండటం.

**5. పంచప్రాణాలు :** ప్రాణం, అపానం, సమానం, ఉదానం, వ్యానం.

**1) ప్రాణం :** శరీరంలోపైకి క్రిందకి ప్రయాణించే వాయువు.

**2) అపానం :** తిన్న ఆహారాన్ని శుభ్రంగా జీర్ణంచేసేది.

**3) వ్యానం :** శరీరాన్ని వంచేది, వ్యాధుల్ని పెంచేది, తగ్గించేది.

**4) ఉదానం :** శరీరంలో ఉన్న మర్మస్థానాల్ని ఉద్రేకపరిచేది.

**5) సమానం :** శరీరంలో ఉన్న అన్ని అంగాలనీ సమానంగా ఉంచేది.

**6. ఉపవాయువులు :** నాగం, కూర్మం, కృకలం, దేవదత్తం, ధనుంజయం.

**1) నాగం :** ఈ ఉపవాయువు ఉద్గారాన్ని అనగా వాంతిని కలుగచేస్తుంది.

**2) కూర్మ :** ఈ ఉపవాయువు కళ్ళు తెరుచుకునేందుకు సహకరిస్తుంది.

**3) కృకలం :** ఈ ఉపవాయువు తుమ్ము రావటానికి దోహదపడుతుంది.

**4) దేవదత్తం :** ఈ ఉపవాయువు ఆవలింతల్ని కలిగిస్తుంది.

**5) ధనుంజయం :** ఇది శరీరమంతా సంచరిస్తూ ఉంటుంది. మనిషి మరణించినా శరీరాన్ని విడిచిపెట్టదు.

**బుద్ధిలక్షణాలు :** కంఠస్వరం తడబడటం, తెలివి పెరగటం, మనసు స్థిరంగా ఉండటం, స్మరణశక్తి, ఈశ్వరీయజ్ఞానాన్ని పొందటం– ఇవన్నీ బుద్ధి లక్షణాలు. ఇలాంటి బుద్ధి ప్రసన్నంగా ఉండాలంటే అష్టాంగ యోగమార్గాన్ని అనుసరించాలి.

**యోగాభ్యాసం చేయకూడని ప్రదేశాలు :–**

★ శరీరం బాధపడుతున్నప్పుడు ★అగ్నికి సమీపంలో ★నీళ్ళలో, నీటి సమీపంలో ★ఎండిన ఆకులున్న ప్రదేశం ★జంతువులు సంచరించేచోట

★శ్మశానం, పాడుబడ్డ గోశాల ★నాలుగు దారులూ కలిసేచోట ★దుష్టులు సంచరించే ప్రదేశం ★దోమలు, ఈగలు, నల్లులు, పురుగులు ఉన్నచోట ★మనసు స్థిరంగా లేనప్పుడు యోగాన్ని అభ్యసించకూడదు.

**యోగాభ్యాసానికి అనుకూల ప్రదేశాలు :-**

రహస్యమైన స్థలాలు ★పవిత్రమైన ప్రాంతాలు ★పర్వతశిఖరాలు ★గుహలు ★శివక్షేత్రాలు ★అరణ్యాలు ★ఉద్యానవనాలు ★స్వగృహం ★క్రూర జంతువులు సంచరించని ప్రదేశాలు ★ఆవుపేడతో అలకబడిన ప్రాంతాలు ఇవి యోగాభ్యాసం చేయటానికి అనుకూలమైనవి.

**యోగం చేయటం ఎలా :-**

శివయోగాన్ని అభ్యసించేవాడు మొదట తన గురువైన యోగాచార్యుణ్ణి తరువాత జగద్గురువైన శంకరుణ్ణి, జగన్మాత పార్వతీదేవిని, వినాయకుణ్ణి, ప్రాచీన యోగీశ్వరుల్ని, వారి శిష్యుల్ని స్మరించి భక్తిగా వారికి నమస్కరించాలి. తరువాత స్వస్తికాసనం లేక పద్మాసనాన్ని వేసుకుని, నోరు కొద్దిగా తెరిచి రెండు కళ్ళూ మూసుకుని, రొమ్ము ముందుకి వచ్చేలా చేసి, తలను కొద్దిగా పైకెత్తి, పైదంతాలతో క్రింది దంతాల్ని తాకకుండా తన ముక్కుకొనని చూస్తూ అటూ ఇటూ చూడకుండా, సత్త్వ గుణంతో కూడిన మనసుతో శివధ్యానం చేయాలి.

ఓంకార వాచ్యం పరమంశుద్ధం దీపశిఖాకృతిం ।
ధ్యాయే ద్ధ్యైపుండరీకస్య కర్ణికాయాం సమాహితః ॥

త హృదయం అనే కమలంలో పరమేశ్వరుణ్ణి ఓంకార స్వరూపుడుగా, శుద్ధసత్త్వ స్వభావుడిగా, దీపం అంచుని పోలిన తేజోమయ ఆకారం కలిగినవాడిగా ధ్యానించాలి. యోగీశ్వరుడైన శంకరుణ్ణి నాభి(బొడ్డు) ప్రదేశంలో కానీ, కంఠం మధ్యలో గానీ, కనుబొమల మధ్యగానీ లలాటం మీద గానీ, తలమీదకానీ ఉన్నట్టు భావించి ధ్యానించవచ్చు. యోగాభ్యాసపరులు హృదయంలో పరమేశ్వరుణ్ణి, నాభికమలంలో సదాశివుణ్ణి, లలాటంమీద చంద్రశేఖరుణ్ణి, కనుబొమల మధ్య శంకరుణ్ణి ధ్యానించాలి.

పన్నెండు సార్లు ప్రాణాయామం చేస్తే అది ఒక ధారణ అవుతుంది. అలాంటి ధారణలు పన్నెండు చేస్తే అది ఒక ధ్యానంగా పరిగణించబడుతుంది. ఈ ధ్యానం పన్నెండు సార్లు చేయటం వల్ల సాధకుడికి సమాధి సిద్ధిస్తుంది. ఈ సమాధి స్థితి అనేది శివయోగుల సహవాసంతో కూడా కలగవచ్చు. ఈ విధంగా యోగాభ్యాసం చేసేవాడికి ఎన్నో రకాల విఘ్నాలు కలుగుతాయి. అయితే ఏమీ భయపడకుండా, వాటిని అధిగమించి యోగాన్ని అభ్యసించాలి.

## శివుడి పంచబ్రహ్మ మూర్తులు

**1. సద్యోజాతుడు :** ఇరవై తొమ్మిదోదిగా పరిగణించబడే శ్వేతలోహిత కల్పంలో చతుర్ముఖ బ్రహ్మ ఒకనాడు పరమేశ్వరుణ్ణి ప్రార్థించాడు. అప్పుడు ఆయన ముఖం నుంచి శ్వేతలోహితుడనే పుత్రుడు ఉదయించాడు. యజ్ఞోపవీతం ఆ ఆవిర్భవించిన నీలలోహితుడు బ్రహ్మచారి. అలాంటి దివ్యపురుషుణ్ణి చూసి ఆనందించిన బ్రహ్మ ఆయన్ని తన హృదయంలో నిలుపుకుని ధ్యానించసాగాడు.

సద్యోజాతుడుగా ఆవిర్భవించిన ఆ శ్వేతనీల లోహితుడి పార్శ్వం నుంచి, తెల్లటి శరీర వర్ణంతో ప్రకాశించే 1.సునందుడు 2.నందనుడు 3.విశ్వనందనుడు 4.ఉపనందనుడు అనే నలుగురు శిష్యులు ఉద్భవించారు. వారంతా నిత్యం సద్యోజాతుణ్ణి సేవిస్తున్నారు.

తస్మాద్విశ్వేశ్వరం దేవం యే ప్రపద్యం తివైద్విజాః ।
తేసర్వే పాపనిర్ముక్తా విమలా బ్రహ్మవర్చసా ॥
విష్ణులోక మతిక్రమ్య రుద్రలోకం వ్రజంతి తే ॥

బ్రహ్మదేవుడు ముఖం నుంచి ఆవిర్భవించిన సద్యోజాతుడైన విశ్వేశ్వరుణ్ణి ఎవరైతే ఆశ్రయిస్తారో వారంతా సకల పాపాలనుంచీ విముక్తిని పొంది విష్ణులోకమైన వైకుంఠాన్ని దాటి రుద్రలోకాన్ని చేరుకుంటారు.

**2. వామదేవుడు :** కల్పాలలో ముప్ఫైయ్యో కల్పాన్ని 'రక్తకల్పం' అంటారు. ఆ కల్పంలో బ్రహ్మదేవుడు ఎర్రని శరీరంతో ప్రకాశిస్తుంటాడు. ఒకనాడు బ్రహ్మదేవుడు పుత్రసంతానం కోసం పరమేశ్వరుణ్ణి ప్రార్థించగా, ఆయన శరీరం నుంచి దివ్యతేజస్సుతో ఒక పుత్రుడు ఉదయించాడు.

బ్రహ్మ శరీరం నుంచి ఆవిర్భవించిన ఆ పుత్రుడు ఎర్రటి శరీరంతో, ఎర్రటి వస్త్రాలు ధరించి, ఎర్రటి కళ్ళతో ప్రకాశిస్తున్నాడు. అలాంటి రక్తవర్ణ శరీరుడైన పుత్రుణ్ణి వామదేవుడనే పేరుతో కీర్తించి ఆ పరబ్రహ్మని భక్తితో ధ్యానించసాగాడు. కొద్దికాలానికి పరమేశ్వరుడు ప్రత్యక్షమై బ్రహ్మదేవా! నీవు పుత్రుణ్ణి పొందటం కోసం, నన్ను ప్రార్థించావు. అందుకే నేను వామదేవుడి రూపంలో సాక్షాత్కరించాను. 'ఓం వామదేవాయనమః' అనే మంత్రంతో నన్ను జపించినందువల్ల ఈ విధంగానే ప్రతి కల్పంలో నన్ను దర్శించగలవు అని పలికాడు. ఆ తరువాత రక్తవర్ణశరీరుడైన ఆ వామదేవుడి శరీరం నుంచి 1. విజుడు 2. విబాహువు 3. విశోకుడు 4. విశ్వభావనుడు అనే నలుగురు శిష్యులు ఆవిర్భవించారు. వారంతా బ్రహ్మవర్చస్సుతో రక్తాంబరధారులై ప్రకాశించారు.

వామదేవుడి నుంచి ఆవిర్భవించిన ఆయన శిష్యులంతా నిరంతరం ఆయన్నే పూజ, జప, ధ్యానాలతో ఆరాధించసాగారు. అలా ఒక వెయ్యి దివ్య సంవత్సరాలు గడిచాక ఆ శిష్యులు నలుగురూ ముక్తిని పొంది శివలోకాన్ని చేరుకున్నారు. వామదేవుడి శిష్యులు తాము జీవించినంత కాలం శివధర్మాల్ని భక్తులకి ప్రబోధిస్తూ లోకకల్యాణానికి పాటుపడ్డారు. ఇలా ఎవరైనా సరే వామదేవుణ్ణి ఆరాధిస్తే పునరావృత్తి లేని కైలాసం చేరి శాశ్వతంగా శివసాయుజ్యాన్ని పొందుతారు.

**3. తత్పురుషుడు :** కల్పాలలో ముప్ఫై ఒకటో కల్పాన్ని పీతవాసకల్పం అంటారు. ఈ కల్పంలో బ్రహ్మదేవుడు పసుపురంగు వస్త్రాల్ని ధరించి ఉంటాడు. ఒకనాడు పీతవర్ణ శరీరుడైన బ్రహ్మపుత్రుడి కోసం ఈశ్వరుణ్ణి స్మరించగా ఆయనకొక కుమారుడు ఉదయించాడు. ఆ పురుషుడు పచ్చని శరీర వర్ణంతో సువర్ణ యజ్ఞోపవీతాన్ని పసుపురంగు వస్త్రాల్ని ధరించి, శ్రీగంధాన్ని వంటినిండా పూసుకుని ప్రకాశించాడు.

చతుర్ముఖ బ్రహ్మ ఆ తత్పురుషుణ్ణి ధ్యానం చేస్తుండగా ఆయన నోటి నుంచి నాలుగు పాదాలు, నాలుగు కొమ్ములు, నాలుగు కోరలు, నాలుగు స్తనాలు,

నాలుగు నేత్రాలు–వీటితోపాటు సాముద్రిక శాస్త్రంలో చెప్పిన 32 శుభలక్షణాలతో ఆవిర్భవించిన ఒక గోవుని చూసాడు.

తత్పురుషుడు ఆ గోవుని మతీ! స్మృతీ! బుద్ధీ! ఇటురా! అని పిలిచాడు. అనురాగంతో నిండిన ఆయన మాట విని గోవు నెమ్మదిగా ఆయన దగ్గరకొచ్చింది. అప్పుడు తత్పురుషుడు "ఓ గోమాతా! నీవు ఈ విశ్వాన్ని అధిష్ఠించి శివధ్యానయోగం ద్వారా సమస్తాన్నీ స్వాధీనం చేసుకో! నీవు రుద్రాణివి. అనగా శివుడికి భార్యవి కాగలవు. అలాగే పంచబ్రహ్మని ఉపాసించే భక్తులకి మోక్షాన్ని ప్రసాదిస్తావు" అని ఆశీర్వదించాడు.

తత్పురుషుడి ఆశీర్వాదాన్ని పొందిన గోదేవిని, పరమేశ్వరుడి శాసనాన్ని అనుసరించి గ్రహించాడు బ్రహ్మదేవుడు. వేదోక్తమైన రుద్రగాయత్రీ మంత్రాన్ని ఆయన ద్వారా ఉపదేశం పొంది భక్తిపూర్వకంగా జపించగా, మహేశ్వరుడు సంతోషించి బ్రహ్మదేవుడికి భవ్యమైన ధ్యానయోగ సిద్ధిని, ఐశ్వర్యాన్ని, వైరాగ్యాన్ని ప్రసాదించాడు.

తత్పురుషుడి శరీరం నుంచి నలుగురు పురుషులు ఆవిర్భవించారు. వారంతా ఆయనకు శిష్యులై పీత మాల్యాంబరాల్ని, పీత గంధాన్ని ధరించి, పసుపు రంగు శరీర వర్ణంతో ప్రకాశిస్తూ ఆయన్ని సేవించసాగారు. అంతేకాక ఆ నలుగురూ మునులకి శివయోగాన్ని ఉపదేశించి, వెయ్యి దివ్య సంవత్సరాలు కాగానే శివధ్యానయోగ సిద్ధిని పొంది శివుడిలో ఐక్యమయ్యారు. ఎవరైనా సరే తత్పురుష రూపుడైన పరమేశ్వరుణ్ణి భక్తి శ్రద్ధలతో ఉపాసించినట్లైతే వారంతా పాపాల్ని పోగొట్టుకుని పునర్జన్మ రహితులై శివసాయుజ్యాన్ని పొందుతారు.

**4. అఘోరుడు :** పీతవాస కల్పం ముగిసిన తరువాత 'అసితం' అనే కల్పం ప్రారంభమైంది. వెయ్యి దివ్య సంవత్సరాలు అవాంతర ప్రళయం ముగిసిన తరువాత బ్రహ్మదేవుడు సృష్టిని కొనసాగించే ముందు పుత్రుడి కోసం సర్వేశ్వరుణ్ణి ప్రార్థించాడు. అప్పుడు నల్లటి వర్ణంతో ప్రకాశించే ఒక దివ్య పురుషుడు ఆయనకి కుమారుడుగా జన్మించాడు.

బ్రహ్మకి పుట్టిన కుమారుడు నల్లనివస్త్రాలు, యజ్ఞోపవీతం, నల్లటి పూలహారం ధరించి అఘోరుడనే పేరుతో విరాజిల్లాడు. బ్రహ్మదేవుడు ఆ అఘోరరూపుణ్ణి ధ్యానించిన తరువాత, అఘోరుడి పార్శ్వం నుంచి నల్లని రంగుతో ప్రకాశిస్తూ 1.కృష్ణుడు 2.కృష్ణశిఖుడు 3.కృష్ణాస్యుడు 4.కృష్ణవస్త్రధృక్ అనే నలుగురు పుత్రులు ఉదయించారు. వారంతా వేయి సంవత్సరాలు శివధ్యానయోగాన్ని ఆచరించి, దాన్ని తమ శిష్యులకి ప్రబోధించి ఆ తరువాత అందరూ శివసాయుజ్యాన్ని పొందారు. ఇలాంటి మహిమాన్వితుడైన అఘోర మూర్తిని ఉపాసించిన వారు కూడా పునరావృత్తి రహితమైన శివసాయుజ్యాన్ని పొందుతారు.

## అఘోర మంత్రోపాసన

బ్రహ్మదేవుడి నుంచి ఆవిర్భవించిన అఘోర మూర్తి ఆయనతో బ్రహ్మదేవా! నా అఘోర మంత్రం చాలా గొప్పది. బ్రహ్మహత్యలాంటి ఘోరమైన పాపాల్ని, ఇంకా ఇతర పాపాల్ని సైతం ఇది రూపుమాపుతుంది. అలాగే మానసిక, కాయక, వాచిక పాపాల్ని, బుద్ధిపూర్వకంగా చేసిన పాపాల్ని ఈ మంత్ర జపం ద్వారా పోగొట్టుకోవచ్చు.

## అఘోర మంత్రం

అఘోరేభ్యోऽథ ఘోరేభ్యో ఘోర ఘోర తరేభ్యః ।
సర్వేభ్య స్సర్వ శర్వేభ్యో నమస్తే అస్తు విశ్వరూపేభ్యః ॥

ఈ మంత్రాన్ని ఒక లక్షసార్లు జపంచేస్తే బ్రహ్మ హత్యాదిపాపాలు నశిస్తాయి. 50 వేల సార్లు జపిస్తే వాక్కుతో(మాటలతో)చేసిన పాపాలు, 50వేలసార్లు జపిస్తే మనసుతో చేసిన పాపాలు నివారించబడతాయి. బుద్ధిపూర్వకంగా చేసిన పాపాలు పోవాలంటే నలభైవేల సార్లు జపించాలి. కోపంతో కావాలని చేసిన పాపాలు నశించటానికి 80 వేలు జపించాలి. వీరుణ్ణి చంపినవాడు 1 లక్షసార్లు, గర్భంలోని శిశువుని చంపినవాడు, మాతృహత్య చేసినవాడు ఒక కోటిసార్లు జపించాలి. అలాగే ఆవుల్ని చంపినవాడు, కృతఘ్నుడు, స్త్రీహత్య చేసిన వాడు అఘోరమంత్రాన్ని పదిలక్షల సార్లు జపిస్తే పాప విముక్తి పొందుతాడు.

మద్యపానాన్ని తనకి ఇష్టంలేక పోయినప్పటికీ ఇతరుల బలవంతంలో చేసినవాడు ఒక లక్షసార్లు ఈ మంత్రజపం చేయాలి. స్నానం చేయకుండా భోజనం చేసేవాడు, జపంచేయకుండా, హవనం చేయకుండా, దేవతలకి, అతిథులకి, భోజనం పెట్టకుండా భోజనంచేసేవాడు వెయ్యిసార్లు జపిస్తే ఆ పాపం పోతుంది. బ్రాహ్మణుల ద్రవ్యాన్ని అపహరించినవాడు, బంగారాన్ని దొంగతనం చేసినవాడు, ఒక లక్షసార్లు మంత్రజపం చేస్తే పరిశుద్ధుడవుతాడు.

నిత్యం అఘోరమంత్రాన్ని ఒక వెయ్యిసార్లు కనీసం 108 సార్లు జపిస్తూ ఉంటే ఎలాంటి ప్రాయశ్చిత్తం లేకుండానే మానవుడు పాపాల నుంచి విముక్తి పొందుతాడు.

**ఈశానుడు :** విశ్వరూపకల్పం ప్రారంభంలో చరాచర సృష్టిని ప్రారంభించే ముందు చతుర్ముఖ బ్రహ్మ పుత్రుడి కోసం పరమేశ్వరుణ్ణి ప్రార్థించాడు. ఆయన ప్రార్థన మన్నించిన పరమేశ్వరుడు ఈశానుడనే పేరుతో బ్రహ్మదేవుడికి పుత్రుడుగా ఆవిర్భవించాడు. ఆయనతోపాటు విశ్వరూప అనే దివ్యవాణి కూడా ఆవిర్భవించింది.

## బ్రహ్మ చేసిన పంచబ్రహ్మ స్తుతి

శ్లో॥ ఓమీశాన ! నమస్తేఽస్తు–మహాదేవ ! నమోఽస్తు తే ।
నమోఽస్తు సర్వ విద్యానా–మీశాన ! పరమేశ్వర ! 1

శ్లో॥ నమోఽస్తు సర్వభూతానా–మీశాన ! వృషవాహన ।
బ్రహ్మణోఽధిపతే తుభ్యం–బ్రహ్మణే బ్రహ్మరూపిణే ॥ 2

శ్లో॥ నమో బ్రహ్మాధిపతయే–శివం మేఽస్తు సదాశివ ।
ఓంకారమూర్తే దేవేశ–సద్యోజాత ! నమోనమః ॥ 3

శ్లో॥ ప్రపద్యే త్వాం ప్రపన్నోఽసి–సద్యోజాతాయ వై నమః ।
అభవేచ భవే తుభ్యం–తథా నాతిభవే నమః ॥ 4

శ్లో॥ భవోద్భవ ! భవేశాన !–మాం భజస్వ మహాద్యుతే ।
వామదేవ నమస్తుభ్యం–జ్యేష్ఠాయ వరదాయ చ ॥ 5

శ్లో॥ నమో రుద్రాయ కాలాయ–కలనాయ నమోనమః ।
నమో వికరణాయైవ–కాలవర్ణాయ వర్ణినే ॥ 6

శ్లో॥ బలాయ బలినాం నిత్యం–సదా వికరణాయ తే ।
బలప్రమథనాయైవ–బలినే బ్రహ్మరూపిణే ॥ 7

శ్లో॥ సర్వభూతేశ్వరేశాయ–భూతానాం దమనాయ చ ।
మనోన్మనాయ దేవాయ–నమస్తుభ్యం మహాద్యుతే ॥ 8

శ్లో॥ వామ దేవాయ వామాయ–నమస్తుభ్యం మహాత్మనే ।
జ్యేష్ఠాయ చైవ శ్రేష్ఠాయ–రుద్రాయ వరదాయ చ ॥
కాలహంత్రే నమస్తుభ్యం–నమస్తుభ్యం మహాత్మనే ॥ 9

*(శ్లో॥1–9,అధ్యా–16)*

ఈ విధంగా బ్రహ్మదేవుడు ఈశానుణ్ణి స్తుతించగా ఆయన సంతోషించి వరం కోరుకోమన్నాడు. అప్పుడు బ్రహ్మ "ప్రభూ! తమతోపాటు ఆవిర్భవించిన ఆ దివ్యవాణి (వాక్కు)ఎవరు? నాలుగు కాళ్ళు, నాలుగు ముఖాలు, నాలుగు కొమ్ములు, నాలుగు కోరలు, నాలుగు స్తనాలు, నాలుగు చేతులు, నాలుగు కళ్ళతో ప్రకాశిస్తున్న ఈ దివ్యవాణి విశ్వరూప అని ఎలా పేర్కొనబడుతోంది? ఈమె అసలు పేరు ఏమిటి? అని ప్రశ్నించాడు. బ్రహ్మ ప్రశ్నలకి సమాధానంగా ఈశానుడు ఇలా చెప్పటం ప్రారంభించాడు.

బ్రహ్మదేవా! నేను చెప్పేది చాలా రహస్యమైన విషయం. ప్రస్తుతం విశ్వరూపకల్పం నడుస్తోంది. నన్ను గురించి నీవు ఎక్కడ ప్రార్థించావో అది బ్రహ్మస్థానంగా చెప్పబడుతుంది. నీ కన్నా గొప్పవాడైన మహావిష్ణువు నా ఎడమభాగం నుంచి ఆవిర్భవించి, వైకుంఠం అనే గొప్ప స్థానంలో ఉంటాడు. ఇది ముప్పై మూడో కల్పం. ఇంకా ఇలాంటి కల్పాలు వందల కొద్దీ రాబోతున్నాయి. గోవు రూపంలో కనబడే మూర్తి ఆదిశక్తి అని, ఆనందమయి అని, విద్య అని, ప్రకృతి అని వ్యవహరించబడుతోంది. మాండవ్యగోత్రుడు ఈశానుడనైన నేను నీకు కుమారుడుగా జన్మించినందువల్ల నీవు చేసే సృష్టికి సహకరిస్తాను. ఈశానుడికి ప్రకృతి భేదం లేదు. ఈ విషయాన్ని నీవు గ్రహించాలి. ఓ బ్రహ్మా! నీకు ముప్పైరెండు గుణాలు నా వల్ల సంక్రమించాయి. అవి ఏమిటంటే?

**32 గుణాలు :** 1.చిత్తవృత్తినిరోధం 2.సాంఖ్యయోగం 3.తపస్సు 4.విద్య 5.విధి 6.క్రియ 7.ఋతం (ప్రియమైన సంభాషణ) 8.సత్యం 9.దయ 10.బ్రహ్మం 11.అహింస 12.సన్మతి(నిశ్చితబుద్ధి)13.క్షమ(ఓర్పు) 14.ధ్యానం 15.ధ్యేయం 16.దమం(ఇంద్రియ నిగ్రహం)17.శాంతి 18.విద్య 19.అవిద్య (అజ్ఞానం) 20.మతి 21.ధృతి(ధైర్యం) 22.కాంతి 23.నీతి 24.ప్రథ (ప్రసిద్ధి) 25.మేధ(ధారణాశక్తి) 26.లజ్జ (లోకాపవాదానికి భయపడటం) 27.దృష్టి (దివ్యజ్ఞానం) 28.సరస్వతి 29.తుష్టి (సంతోషం) 30.పుష్టి (ఇంద్రియ పాటవం) 31.క్రియ(వేదవిహితమైన కర్మ) 32. ప్రసాదం (మనసు ప్రసన్నంగా ఉండటం)

ఈ గుణాలన్నీ నావల్ల ఆదిశక్తి అనే మూలప్రకృతి ద్వారా నీకు సంక్రమించాయి. అలాగే శ్రీమహావిష్ణువుకి కూడా ఇవన్నీ సంక్రమించాయి. అందువల్ల నీకు, శ్రీహరికి, ఇంద్రాది దేవతలకీ నాతోపాటు ఆవిర్భవించిన దివ్యవాణి అనగా మూలప్రకృతి జననిగా కనిపిస్తుంది. ఈ మూల ప్రకృతినే పండితులు – గౌరి, మాయ, విద్య, కృష్ణ, హైమవతి, ప్రధానం, ప్రకృతి అనే పేర్లతో వ్యవహరిస్తారు.

అజామేకాంలోహితాం శుక్లకృష్ణాంచిశ్వ ప్రజాం ।
సృజమానాం సరూపాం అజోఽ హం మాం విద్ధితాం ।
విశ్వరూపం గాయత్రీం గాం విశ్వరూపాం హి బుద్ధ్వా ॥

జన్మ అనేదే లేనిది ఎరుపు, తెలుపు, నలుపు వర్ణాలు కలిగినది, సత్త్వ రజస్తమో గుణాల్ని అనుసరించి ప్రజల్ని సృష్టించేది అయిన ఆదిశక్తిని (మూలప్రకృతి) విశ్వరూపుడనైన నేను అధిష్ఠించి ఉంటానని తెలుసుకో. బ్రహ్మా! అలాంటి మూల ప్రకృతి గాయత్రి అని, దివ్యవాణి రూపంతో ఆవిర్భవించిన గోమాత అని, విశ్వరూప అని పిలవబడుతుంది" అని ఈశానుడు బ్రహ్మదేవుడికి తనతోపాటు ఆవిర్భవించిన దివ్యవాణి, విశ్వరూప అనే గోవురూపంలో ఉన్న మూలప్రకృతి అని తెలియచెప్పాడు.

ఈ విధంగా మూల ప్రకృతితో ఆవిర్భవించిన ఈశానుడి పార్శ్వ భాగం నుంచి జటి, ముండి, శిఖండి, అర్ధముండి అనే నలుగురు శిష్యులు ఆవిర్భవించారు. వీరంతా శివధ్యానయోగాన్ని అభ్యసించి దాన్ని తమ శిష్యులకి ఉపదేశించి, వెయ్యి దివ్య సంవత్సరాలు పరమేశ్వరుణ్ణి ఉపాసించారు. ఆ తరువాత ఆ నలుగురూ పునరావృత్తి రహితమైన కైలాసానికి చేరుకున్నారు.

## పంచబ్రహ్మ శివమంత్రాలు

### 1. సద్యోజాత మంత్రం

ఓం సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయవై నమోనమః
భవే భవే నాతి భవే భవస్వమాం – భవోద్భవాయ నమః

### 2. వామదేవ మంత్రం

వామదేవాయనమో జ్యేష్ఠాయ నమశ్ర్శేష్ఠాయ నమో
రుద్రాయ నమః కాలాయ నమః కలవికరణాయనమో
బలవికరణాయ నమో బలాయ నమో బలప్రమథనాయ నమః
సర్వభూతదమనాయ నమో మనోన్మనాయ నమః

### 3. అఘోర మంత్రం

అఘోరేభ్యోఽథఘోరేభ్యో ఘోర ఘోర తరేభ్యః ।
సర్వేభ్య స్సర్వశర్వేభ్యో నమస్తే అస్తు రుద్ర రూపేభ్యః ।

### 4. తత్పురుష మంత్రం

**తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి తన్నో రుద్రః ప్రచోదయాత్ ।**

### 5. ఈశాన మంత్రం

ఈశాన స్సర్వవిద్యానాం ఈశ్వరస్సర్వ భూతానాం బ్రహ్మాధిపతి
ర్బ్రహ్మణోఽధిపతి ర్బ్రహ్మ శివోమే అస్తుసదాశివోమ్ ।

ఈ సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష ఈశానులనే పంచబ్రహ్మల ఆవిర్భావ గాథని పఠించిన వాడికి విన్నవాడికి శివానుగ్రహం ప్రాప్తిస్తుంది. శరీరం విడిచాక వారు శివసాయుజ్యం చెందుతారు.

# పరమేశ్వర లింగావిర్భావం

పూర్వం చతుర్ముఖ బ్రహ్మ దగ్గరకి వెళ్ళి దేవతలంతా పితామహా! పరమేశ్వరుడికి లింగ స్వరూపం ఎలా ఏర్పడింది? లింగరూపంలోనే శంకరుణ్ణి ఎందుకు పూజించాలి? లింగం అంటే ఎలాంటిది? లింగాన్ని అధిష్ఠించి ఉండేది ఎవరు? అని ప్రశ్నించగా బ్రహ్మ వారికిలా సమాధానం చెప్పటం ప్రారంభించాడు.

దేవతలారా! చతుర్ముఖ బ్రహ్మనైన నన్ను, శ్రీహరిని రక్షించటం కోసం, ప్రళయ సముద్రంలో పరమేశ్వరుడు జ్యోతిర్లింగరూపంలో ఆవిర్భవించాడు.

ప్రధానలింగమాఖ్యాతం లింగీ చ పరమేశ్వరః ।

ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులుగా పరిణమించే మూలప్రకృతి (ఆదిశక్తి) శివుడికి అధిష్ఠానం (ఆశ్రయం) గా వుంటుంది. ఆ అధిష్ఠానాన్ని ఆశ్రయించి లింగరూపంలో ఉండేవాడు పరమేశ్వరుడు.

శివుడు జ్యోతిర్లింగంగా దివ్యతేజస్సుతో ఆవిర్భవించగానే వృక్షాలు, లతలు వర్షాభావంతో శుష్కించిపోయాయి. చండప్రచండంగా ప్రజ్వరిల్లుతున్న సూర్యుడి తీక్ష్ణ కిరణాల వేడికి సమస్తం దహించబడింది. అదే సమయంలో ప్రళయ సముద్రంలో శేషశయనుడైన శ్రీహరి నాకు కనిపించాడు. నేనాయన దగ్గరకి వెళ్ళి మోహంతో ఆయన్ని గట్టిగా చేత్తో తట్టి లేవయ్యా! లే? ఎవరునీవు? ఎందుకిలా పడుకున్నావు? అని అడిగాను.

నిద్రనుంచి మేల్కొన్న శ్రీహరి చిరునవ్వుతో 'వత్సా! స్వాగతం' అని అన్నాడు. ఆ మాట వినగానే నాకు చాలా కోపం వచ్చి "ఎవరయ్యా నీవు పెద్దవాడిలా నన్ను వత్సా! అని సంబోధిస్తున్నావు! అసలు నేనెవరో తెలుసా! ఈ జగత్తుకు సృష్టికర్తను అది తెలుసుకో" అని గర్వంగా అన్నాను. అది విన్న శ్రీహరి నీవు కాదు నేనే సృష్టికర్తను. నారాయణుణ్ణి. అసలు నా వల్లే నీవు జన్మించావు. జగన్నాథుడనైన నేనే పరబ్రహ్మని సృష్టి స్థితి లయకారకుణ్ణి. నువ్వు ఈ విషయాలన్నీ మరిచిపోయావు. ఇందులో నీ తప్పేంలేదు. ప్రస్తుతం నిన్ను మాయ ఆవరించింది. అదే నీతో ఇలా పలికిస్తోంది.

ఇప్పటికైనా నన్ను పరబ్రహ్మగా గుర్తించు. నా నాభినుంచి ఎన్నో అండాలు ఉద్భవించగా వాటిలో ఒక అండం నుంచి నువ్వు పుట్టావు. ఈ విషయం ముందు తెలుసుకో, తెలుసుకుని మాట్లాడు" అని గట్టిగా అన్నాడు. దేవతలారా! ఇలా మా ఇద్దరి మధ్యా మాటా మాటా పెరిగి చివరికి ఇద్దరం పరస్పరం యుద్ధం చేయటానికి సంసిద్ధులయ్యాం. అదే సమయంలో మా వివాదాన్ని పరిష్కరించటానికి, మమ్మల్ని శాంత పరచటానికి శివుడు లింగం రూపంలో మాకు సాక్షాత్కరించాడు. ఆ లింగం ఎలా ఉందంటే.....

## శివలింగ స్వరూపం

శ్లో॥ ఏతస్మి న్నంతరే లింగ - మభవచ్చావయోః పురః ।
వివాదశమనార్థంహి - ప్రబోధార్థం చ భాస్వరమ్ ॥ 1

శ్లో॥ జ్వాలా మాలా సహస్రాఢ్యం - కాలానల శతోపమం ।
క్షయ వృద్ధి వినిర్ముక్త - మాది మధ్యాంతవర్జితమ్ ॥ 2

శ్లో॥ అనౌపమ్య మనిర్దేశ్య - మవ్యక్తం విశ్వసంభవం ।
తస్య జ్వాలా సహస్రేణ - మోహితో భగవాన్ హరిః ॥ 3

శ్లో॥ మోహితం ప్రాహ మామత్ర - పరీక్షావోఽగ్నిసంభవం ।
అధోగమిష్యామ్యనల - స్తంభ స్యానుపమస్య చ ॥ 4

శ్లో॥ భవానూర్ధ్వం ప్రయత్నేన - గంతు మర్హసి సత్వరం ।
ఏవం వ్యాహృత్య విశ్వాత్మా - నీలాంజన చయోపమమ్ ॥ 5

శ్లో॥ దశయోజన విస్తీర్ణం - శతయోజన మాయతం ।
మేరుపర్వత వర్ష్మాణం - గౌర తీక్ష్ణాగ్రదంష్ట్రిణమ్ ॥ 6

శ్లో॥ కాలాదిత్య సమాభాసం - దీర్ఘ ఘోణం మహాస్వనం ।
హ్రస్వపాదం విచిత్రాంగం - జైత్రం దృఢ మనౌపమమ్ ॥ 7

శ్లో॥ వారాహ మసితం రూప - మాస్థాయ గతవానధః ।
అహం హంసత్వ మాపన్నః - సుశ్వేతో హ్యనలాక్షకః ॥ 8

శ్లో॥ విశ్వతః పక్షసంయుక్తో-మనోఽనిలజవస్తథా ।
భూత్వాఽహం చోర్ధ్వతో గంతు-ముద్యుక్త స్సత్వరం ధృవమ్॥ 9
*(శ్లో॥33-49, అధ్యా-17)*

మా మధ్య ఆవిర్భవించిన దివ్యలింగం స్వయం ప్రకాశంతో వెలిగిపోతూ, మా ఇద్దరి మధ్యా ముదిరిన కలహాన్ని పూర్తిగా శాంత పరిచేలా ఉంది. వేలకొద్దీ మంటలతో ప్రళయాగ్ని వెలుగులా ప్రజ్వరిల్లుతోంది. క్షయం, అభివృద్ధి, ఆది మధ్యాంతాలు లేనిదై, తనతో సమానమైంది మరొకటేదీ లేనిదై ఇది అని చెప్పటానికి వీలులేని విధంగా, ప్రాకృత నేత్రాలతో ఏ మాత్రం చూడశక్యం కానివిధంగా, ప్రపంచోద్భవ కారణంగా ఆ లింగం ప్రకాశిస్తోంది.

దివ్యంగా వెలుగుతూ ఆద్యంతాలు తెలీని ఆ మహాలింగాన్ని చూసి మాయామోహితుడైన శ్రీహరి నాతో "బ్రహ్మా! మనిద్దరం ఈ లింగం ఆద్యంతాలు తెలుసుకుని వద్దాం" అన్నాడు. శివమాయలో చిక్కుకున్న నేను కూడా అందుకు అంగీకరించాను. వెంటనే శ్రీహరి "సరే నీవు ఈ లింగం అగ్రభాగాన్ని చూసిరా, నేను దీని మొదలు చూసి వస్తానని" చెప్పాడు. నేను సరేనన్నాను.

శ్రీహరి వందయోజనాల విస్తీర్ణంతో వందయోజనాల పొడవుతో మేరు పర్వతంలాంటి శరీరంతో తీక్షణమైన కోరలతో ప్రకాశిస్తూ వరాహరూపాన్ని ధరించి భూమిని త్రవ్వుకుంటూ ఆ శివలింగం మొదలు తెలుసుకోవటానికి వెళ్ళాడు. నేను హంసరూపాన్ని ధరించి, మనో వేగంతో ఆ జ్యోతిర్లింగం అగ్రం చూడటానికి పైకెగిరాను.

సురులారా! అలా వెయ్యి సంవత్సరాలు గడిచాయి. నేను ఎంత ఎగిరినా ఆ లింగం అగ్రభాగం చూడలేకపోయాను. అలాగే శ్రీహరి కూడా ఎంత ప్రయత్నించినా లింగం మూలభాగం చూడలేకపోయాడు. ఇక ఓపికలేక ఇద్దరం అలసిపోయి యథాస్థానానికి వచ్చి చేరాము. ఆ జ్యోతిర్లింగానికి నమస్కరించి ఏం చేయాలో పాలుపోక తాత్కాలికంగా మా ఇద్దరి మధ్యా వచ్చిన వైరాన్ని మరిచిపోయి అలాగే నిలబడ్డాం.

అంతలో ఆ జ్యోతిర్లింగం నుంచి 'ఓమ్' 'ఓమ్' అనే నాదం ప్లుతంతో ఆవిర్భవించింది. ఆ లింగం దక్షిణ భాగంలో 'అ'కారం, ఉత్తరభాగంలో 'ఉ' కారం, మధ్య భాగంలో 'మ' కారం కనిపించాయి. వాటిలో 'అ' కారం సూర్య మండలంలాగా ప్రకాశిస్తోంది. 'ఉ'కారం అగ్నిలాగా ప్రజ్వరిల్లుతోంది. 'మ' కారం చంద్రకాంతితో వెలుగొందుతోంది. ఆ 'అ'కార 'ఉ'కార 'మ'కారాత్మకమైన ఓంకారం మీద శుద్ధస్ఫటికంలా భాసించే పరమేశ్వరుడు మా ఇద్దరికీ కనిపించాడు.

అలాంటి సర్వోత్తమమైన శివరూపాన్ని దర్శించి శ్రీహరి ఇలా వైదిక ఛందస్సుతో ప్రార్థించాడు.

చింతయారహితో రుద్రో వాచోయన్మనసా సహ ।
అప్రాప్యతం నివర్తంతే వాచ్యస్త్వేకాక్షరేణ స ః ॥

ఓం అనే ఏకాక్షరాన్ని అనుసంధానించటం వల్లే శివుడు ప్రాప్తిస్తాడు. ఓంకారం వాచ్యం కాగా, రుద్రుడు వాచ్యుడవుతున్నాడు. అని స్తుతించిన తరువాత ఆ ఓంకారం నుంచి ఆవిర్భవించిన ఈశాన మంత్రాన్ని – అలాగే మిగిలిన పంచబ్రహ్మల మంత్రాల్ని శివలింగం మీద దర్శించి వాటిని శ్రద్ధగా జపించాడు. శ్రీహరి చేసిన జపానికి సంతోషించిన మహాదేవుడు ఈశాన మంత్రాన్ని కిరీటంగా, తర్పురుష మంత్రాన్ని ముఖంగా, అఘోర మంత్రాన్ని హృదయంగా, వామదేవ మంత్రాన్ని గుహ్యభాగంగా, సద్యోజాత మంత్రాన్ని పాదాలుగా చేసుకుని పంచబ్రహ్మ స్వరూపంతో తిరిగి దర్శనమిచ్చాడు.

ఆ విధంగా పరమేశ్వరుడు పంచబ్రహ్మ స్వరూపుడుగా దర్శనమివ్వటంతో పులకించి పోయిన శ్రీహరి, నేను దివ్యానందంతో పరమేశ్వరుణ్ణి ఇలా కీర్తించాడు.

## శ్రీహరి చేసిన రుద్రస్తవం

శ్లో॥ ఏకాక్షరాయ రుద్రాయ – అకారాయాత్మరూపిణే ।
ఉకారాయాదిదేవాయ – విద్యాదేహాయ వై నమః ॥ 1

శ్లో॥ తృతీయాయ మకారాయ - శివాయ పరమాత్మనే, ।
సూర్యాగ్ని సోమవర్ణాయ - యజమానాయ వై నమః ॥ 2

శ్లో॥ అగ్నయే రుద్రరూపాయ - రుద్రాణాం పతయే నమః ।
శివాయ శివమంత్రాయ - సద్యోజాతాయ వేధసే ॥ 3

శ్లో॥ వామాయ వామదేవాయ - వరదాయామృతాయ తే ।
అఘోరాయాతిఘోరాయ - సద్యోజాతాయ రంహసే ॥ 4

శ్లో॥ ఈశానాయ శ్మశానయ - అతివేగాయ వేగినే ।
నమోఽస్తు శృతిపాదాయ - ఊర్ధ్వలింగాయ లింగినే ॥ 5

శ్లో॥ హేమలింగాయ హేమాయ - వారిలింగాయ చాంభసే ।
శివాయ శివలింగాయ - వ్యాపినే వ్యోమవ్యాపినే ॥ 6

శ్లో॥ వాయవే వాయువేగాయ - నమస్తే వాయువ్యాపినే ।
తేజసే తేజసాంభర్త్రే - నమస్తేజోఽ ధివ్యాపినే ॥ 7

శ్లో॥ జలాయ జలభూతాయ - నమస్తే జలవ్యాపినే ।
పృథివ్యైచాంతరిక్షాయ - పృథివీవ్యాపినే నమః ॥ 8

శ్లో॥ శబ్ద స్పర్శస్వరూపాయ - రసగంధాయ గంధినే ।
గణాధిపతయే తుభ్యం - గుహ్యాత్ గుహ్యతమాయ తే ॥ 9

శ్లో॥ అనంతాయ విరూపాయ - అనంతానామయాయ చ ।
శాశ్వతాయ వరిష్ఠాయ - వారి గర్భాయ యోగినే ॥ 10

శ్లో॥ సంస్థితాయాంభసాం మధ్యే - హ్యావయోర్మధ్యవర్చసే ।
గోప్త్రే హర్త్రే సదాకర్త్రే - నిధనాయేశ్వరాయ చ ॥ 11

శ్లో॥ ఆచేతనాయ చింత్యాయ - చేతనాయాసహారిణే ।
ఆరుపాయ సురూపాయ - ఆనంగాయాంగహారిణే ॥ 12

శ్లో॥ భస్మ దిగ్ధశరీరాయ - భాను సోమాగ్నిహేత వే ।
శ్వేతాయ శ్వేతవర్ణాయ - తుహినాద్రిచరాయ చ ॥ 13

శ్లో॥ సుశ్వేతాయ సువక్త్రాయ - నమ శ్శ్వేత శిఖాయ చ ।
శ్వేతాస్యాయ మహాస్యాయ - నమస్తే శ్వేతలోహిత ॥ 14

శ్లో॥ సుతారాయ విశిష్టాయ - నమో దుందుభినే హర !
శత రూప ! విరూపాయ - నమః కేతుమతే సదా ॥ 15

శ్లో॥ బుద్ధి శోక విశోకాయ - పినాకాయ కపర్దినే ।
విపాశాయ సుపాశాయ - పశుపాశ వినాశినే ॥ 16

శ్లో॥ సుహోత్రాయ హవిష్యాయ - సుబ్రహ్మణ్యాయ సూరిణే ।
సుముఖాయ సువక్త్రాయ - దుర్దమాయ దమాయ చ ॥ 17

శ్లో॥ కంకాయ కంకరూపాయ - కంకణీకృతపన్నగ !
సనకాయ నమస్తుభ్యం - సనాతన ! సనందన ! 18

శ్లో॥ సన త్కుమార ! సారంగ - మారణాయ మహాత్మనే ।
లోకాక్షిణే త్రిధామాయ - నమో విరజసే సదా ॥ 19

శ్లో॥ శంఖపాలాయ శంఖాయ - రజసే తమసే నమః ।
సారస్వతాయ మేఘాయ - మేఘ వాహన తే నమః ॥ 20

శ్లో॥ సువాహాయ వివాహాయ - వివాద వరదాయ చ ।
నమశ్శివాయ రుద్రాయ - ప్రధానాయ నమో నమః ॥ 21

శ్లో॥ త్రిగుణాయ నమస్తుభ్యం - చతుర్వ్యూహాత్మనే నమః ।
సంసారాయ నమస్తుభ్యం - నమః స్సంసార హేతవే ॥ 22

శ్లో॥ మోక్షాయ మోక్షరూపాయ - మోక్షకర్త్రే నమో నమః ।
ఆత్మనే ఋషయే తుభ్యం - స్వామినే విష్ణవే నమః ॥ 23

శ్లో॥ నమో భగవతే తుభ్యం - నాగానాంపతయే నమః ।
ఓంకారాయ నమస్తుభ్యం - సర్వజ్ఞాయ నమో నమః ॥ 24

శ్లో॥ సర్వాయ చ నమస్తుభ్యం - నమో నారాయణాయ చ ।
నమో హిరణ్యగర్భాయ - ఆది దేవాయ తే నమః ॥ 25

శ్లో॥ నమోఽస్త్వజాయ పతయే - ప్రజానాం వ్యూహ హేతవే ।
మహాదేవాయ దేవానా - మీశ్వరాయ నమో నమః ॥ 26

శ్లో॥ శర్వాయ చ నమస్తుభ్యం - సత్యాయ శమనాయ చ ।
బ్రహ్మణే చైవ భూతానాం - సర్వజ్ఞాయ నమో నమః ॥ 27

శ్లో॥ మహాత్మనే నమస్తుభ్యం - ప్రజ్ఞారూపాయ వై నమః ।
చితయే చితిరూపాయ - స్మృతిరూపాయ వై నమః ॥ 28

శ్లో॥ జ్ఞానాయ జ్ఞానగమ్యాయ - నమస్తే సంవిదే సదా ।
శిఖరాయ నమస్తుభ్యం - నీలకంఠాయ వై నమః ॥ 29

శ్లో॥ అర్ధనారీశరీరాయ - అవ్యక్తాయ నమో నమః ।
ఏకాదశ విభేదాయ - స్థాణవే తే నమ స్సదా ॥ 30

శ్లో॥ నమస్సోమాయ సూర్యాయ - భవాయ భవహారిణే !
యశస్కరాయ దేవాయ - శంకరాయేశ్వరాయ చ ॥ 31

శ్లో॥ నమోఽంబికాధిపతయే - ఉమాయాః పతయే నమః ।
హిరణ్యబాహవే తుభ్యం - నమస్తే హేమ రేతసే ॥ 32

శ్లో॥ నీలకేశాయ విత్తాయ - శితికంఠాయ వై నమః ।
కపర్దినే నమ స్తుభ్యం - నాగాంగాభరణాయ చ ॥ 33

శ్లో॥ వృషారూఢాయ సర్వస్య - హర్త్రే కర్త్రే నమో నమః ।
వీరశైవాతిరామాయ - రామనాథాయ తే నమః ॥ 34

శ్లో॥ నమో రాజధిరాజాయ - రాజ్ఞా మధిగతాయ తే ।
నమః పాలాధిపతయే - పాలాశాంకృత తే నమః ॥ 35

శ్లో॥ నమః కేయూరభూషాయ - గోపతే తే నమో నమః ।
నమః శ్రీ కంఠనాథాయ - నమో లికుచపాణయే ॥ 36

శ్లో॥ భూవనేశాయ దేవాయ - వేదశాస్త్ర! నమోఽస్తుతే ।
సారంగాయ నమస్తుభ్యం రాజహంసాయ తే నమః ॥ 37

శ్లో॥ కనకాంగదహారాయ - నమ స్సర్పోపవీతినే ।
సర్పకుండల మాలాయ - కటిసూత్రీ కృతాహినే ॥
వేదగర్భాయ గర్భాయ విశ్వగర్భాయ తే నమః 38

*(శ్లో॥1-38, అధ్యా-18)*

దేవతలారా ఈ విధంగా శ్రీహరి నేనూ చేసిన స్తోత్రాన్ని ప్రతిరోజూ పఠించిన వారికి, వినిపించినవారికి పాపాలన్నీ పటాపంచలైపోతాయి. ఎన్నో పాపాలు చేసినవాడైనా ఈ స్తోత్రాన్ని పఠించి పరిశుద్ధుడై బ్రహ్మలోకాన్ని చేరతాడు.

## వర ప్రదానం

మేమిద్దరం చేసిన స్తోత్రం విని సంతోషించిన శంకరుడు ప్రత్యక్షమై "బ్రహ్మ విష్ణువులారా! నన్ను స్పష్టంగా చూడండి. భయం వీడండి. లోక పితామహుడైన బ్రహ్మ నా కుడిభాగం నుంచి స్థితికారకుడైన శ్రీహరి నా ఎడమభాగం నుంచి ఆవిర్భవించగా, లయకారకుడైన రుద్రుడు నా హృదయం నుంచి ఆవిర్భవించాడు. ఇక మీకేం కావాలో కోరుకోండి" అని పలికాడు.

జ్యోతిర్లింగం మధ్యలో సాక్షాత్కరించిన పరమేశ్వరుడికి నమస్కరించిన విష్ణువు ఆయనతో "శంకరా! మహాదేవా! నీ మీద మాకు స్థిరమైన భక్తి కలిగేలా వరాన్ని అనుగ్రహించు" అని కోరగా శివుడు "తథాస్తు. నీవు కోరినట్టే జరుగుతుంది" అని వరాన్ని అనుగ్రహించి విష్ణువుతో "వత్సా! నీకు అవాంతర సృష్టి, స్థితి, లయాల్ని చేయగలిగే సామర్థ్యాన్ని ప్రసాదిస్తున్నాను. పద్మకల్పంలో నీకు కుమారుడిగా జన్మించే బ్రహ్మని ఎల్లప్పుడూ కాపాడుతూ ఉండు. నేనే బ్రహ్మ విష్ణు మహేశ్వరుల రూపంలో సృష్టిస్థితి లయాల్ని చేస్తున్నానని గ్రహించండి. ప్రతికల్పంలో సృష్టిమొదట్లో మీకు దర్శనమిచ్చి అనుగ్రహిస్తాను" అని చెప్పి అదృశ్యమయ్యాడు.

ఆ విధంగా మొట్టమొదట హరి-బ్రహ్మల మధ్య శివలింగం ఆవిర్భవించింది. అప్పటినుంచి అన్నిలోకాల్లో లింగార్చన ఎంతో ప్రాముఖ్యత పొందింది.

లింగవేదీ మహావేదీ లింగం సాక్షాన్మహేశ్వరః ।
లయనాల్లింగ మిత్యుక్తం తత్రైవ నిఖిలం సురాః ॥

శివలింగం పానవట్టం (వేదిక) శక్తి స్వరూపం కాగా, వేదికమీదున్న పిండం శివుడిగా పరిగణించబడుతున్నాడు. ఈ సకల ప్రపంచం మహాప్రళయ కాలంలో దాక్కుని ఉండటానికి తగిన స్థానం శివలింగం.

ఈ విధంగా బ్రహ్మదేవుడు దేవతలకి శివలింగం ఆవిర్భవించిన కథనాన్ని వివరంగా బోధించాడు.

## బ్రహ్మదేవుడి జననం - హరి బ్రహ్మలకి శివదర్శనం

పూర్వం పాద్మక కల్పానికి ముందు ఈ చరాచర ప్రపంచమంతా భయంకరమైన జల సముద్రంలాగా మారిపోయింది. అంతా చీకటి. ఆ సమయంలో నారాయణుడు శేషశయనుడై శివధ్యానం చేస్తూ నిద్రపోతున్నాడు. ఆ సమయంలో ఒకనాడు శ్రీహరి తన నాభినుంచి విశాలమైన ఒక కమలాన్ని పుట్టించాడు. ఆ కమలంతో ఆయన ఆటలాడుతుండగా చతుర్ముఖబ్రహ్మ అక్కడికి వచ్చి శ్రీహరిని చూసి "అయ్యా! ఎవరునీవు? అని  ప్రశ్నించాడు. బ్రహ్మ మాటలు విని ఆశ్చర్యపోయిన శ్రీహరి శయ్యమీద నుంచి క్రిందకి దిగి 'నేనెవరో తెలీదా ప్రతి కల్పంలో బ్రహ్మాండానికి ఆశ్రయమిచ్చే వాడిని, భూమి, ఆకాశం, స్వర్గం, మర్త్య పాతాళాలు అనే పరమపదమార్గాల్ని ఏర్పరిచేవాడిని" అని బ్రహ్మకి సమాధానమిచ్చి అసలు నన్ను ప్రశ్నిస్తున్న నీవెవరు? ఎక్కణ్ణుంచి వచ్చావు? అని తిరిగి ప్రశ్నించాడు శ్రీహరి.

బ్రహ్మ శ్రీహరి మాటలు విని మాయామోహంతో అయ్యా! నీవెంతటి వాడివో నేనూ అంతటివాడినే, ఈ సృష్టికి ఆదికర్తని అని చెప్పగా విని శ్రీహరి ఒక్కసారిగా బ్రహ్మ నోటి ద్వారా ఆయన ఉదరంలోకి ప్రవేశించి లోపలున్న చాతుర్వర్ణాల వారిని అష్టాదశ ద్వీపాలని, సప్తమహాకుల పర్వతాలని, చతుస్సముద్రాలని, పద్నాలుగులోకలనీ చూసి ఇంకా ఎన్నో వింతలు విశేషాల్ని దర్శిస్తూ వెయ్యి సంవత్సరాలు అందులోనే సంచరించి తిరిగి బ్రహ్మ నోటి ద్వారా బైటికి వచ్చాడు.

బ్రహ్మతో "ఆహా! నీ తపశ్శక్తి చాలా గొప్పదయ్యా! బ్రహ్మయ్యా! వెయ్యి సంవత్సరాలైనా నీ ఉదరం చివర ఎక్కడుందో చూడలేక పోయాను. నీవుకూడా నా ఉదరంలోకి ప్రవేశించి నాలో ఏవున్నాయో చూడు" అని ఆహ్వానించాడు.

శ్రీహరి మాటలు బ్రహ్మకి ఆనందాన్ని కలిగించాయి. ఆయన మాట ప్రకారం శ్రీహరి నోటిద్వారా ఆయన ఉదరంలోకి ప్రవేశించి చతుర్దశభువనాలని ఇంకా ఎన్నో వింతలు విశేషాలు దర్శించాడు. ఇక చూసింది చాలని సంతృప్తిపడి బైటికి రాబోయాడు. అదే సమయంలో శ్రీహరి తన శరీర రంధ్రాలన్నిటినీ మూసేసాడు.

లోపల ఏం చేయాలో బ్రహ్మకి స్ఫురించలేదు. అంతలో ఒక ఆలోచన వచ్చిన బ్రహ్మదేవుడు తన శరీరాన్ని అత్యంత సూక్ష్మంగా చేసుకుని, శ్రీహరి నాభికమలం ద్వారా బైటికి వచ్చాడు. అలా వచ్చిన బ్రహ్మ ఆ కమలాన్నే తనకు ఆశ్రయంగా చేసుకున్నాడు. అదే సమయంలో త్రిశూలపాణి, త్రినేత్రుడు, త్రిపుర సంహారి అయిన శివుడు నీళ్ళల్లో పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ అక్కడికి వస్తున్నాడు. ఆయన పాదాల తాకిడికి కింద ఉన్న నీటి బిందువులు ఆకాశం మీదకి ఎగురుతున్నాయి. అప్పుడు గాలి చల్లగా వీస్తోంది.

ఆ సమయంలో బ్రహ్మదేవుడు శ్రీహరితో "హరీ! ఈ నీటి బిందువులు, శీతోష్ణవాయువులు నీ నాభికమలాన్ని బాగా కదిలిస్తున్నాయి. ఇప్పటికైనా నీవెవరో చెప్పు? అని తిరిగి ప్రశ్నించాడు.

బ్రహ్మ మాటలు విన్న శ్రీహరి కొంతసేపు ఆలోచించి చిరునవ్వుతో "ఓయీ! నీవు నా ఉదరంలోకి ప్రవేశించి బైటికి వచ్చే దారి తెలీక ఎంతో ఆందోళన చెందావు. చివరికి నీ తెలివి ఉపయోగించి నా నాభికమలం నాళం ద్వారా బైటపడ్డావు. నాకు చాలా ఆనందంగా ఉంది. "అని అనగా బ్రహ్మ ప్రభూ! నీ గొప్పతనాన్ని గుర్తించాను. ప్రస్తుతం నేనేం చేయాలో చెప్పండి" అని ప్రార్థించాడు.

శ్రీహరి బ్రహ్మతో “వత్సా! నీవు నా శరీరంలోకి ప్రవేశించగానే నిన్ను బంధించాను. అందుకు నీవేమీ బాధపడవద్దు. ఒక విధంగా ఆలోచిస్తే నీవు నాకు మాన్యుడివి. గొప్పవాడివి. నీవు నా నాభికమలాన్ని నివాసంగా చేసుకున్నావు. నిన్ను ఎక్కువకాలం మోయలేను. బైటికిరా! నాకు కుమారుడిగా ఉండు. నీకు ‘పద్మయోని’ అనే ఖ్యాతి లోకంలో కలుగుతుంది. ప్రణవాత్మకుడిగా నీవు లోకంలో అందరి చేతా స్తుతించబడతావు. నా కుమారుడిగా ఉన్న నీవు భూలోకం నుంచి సత్యలోకం వరకూ సప్త (ఏడు) లోకాలకీ అధిపతివవుతావు” అని వరాల్ని ప్రసాదించాడు.

ఇలా హరి, బ్రహ్మలు సంభాషిస్తుండగా పరమేశ్వరుడు వారి దగ్గరకొచ్చాడు. బాల సూర్యుడిలా దివ్యకాంతితో వెలిగిపోతున్న ఆ పురుషుణ్ణి చూసి బ్రహ్మదేవుడు ఎంతో ఆశ్చర్యపోయి శ్రీహరితో “ప్రభూ! పెద్దనోరు, జుట్టు విరబోసుకుని నాట్యం చేస్తూ వచ్చిన ఇతడెవరు? అని ప్రశ్నించాడు? వత్సా! ఆ పురుషుడి నిట్టూర్పుతో నా నాభికమలం వణుకుతోంది. ఇతడెవరో గొప్పవాడు. ఆద్యంత రహితుడిలా ఉన్నాడు. ప్రళయాన్ని సృష్టించేవాడిలా ఉన్నాడు. మనిద్దరం ఈ మహాపురుషుణ్ణి ప్రార్థిద్దాం’ అన్నాడు శ్రీహరి.

ఆ మాటలు వినగానే బ్రహ్మకి కోపం వచ్చింది. కేశవా! నన్ను నీవు సరిగ్గా గుర్తించటం లేదు. నేనే సనాతనుడని నీకు తెలీదా! ఇతడెవరో ఏమిటో? తెలుసుకోకుండా పొగుడుతున్నావు. ఇది సమంజసమేనా? అని అన్నాడు. అందుకు శ్రీహరి వత్సా! అనవసరంగా పరుషంగా మాట్లాడకు, ఈ మహాత్ముణ్ణి తిరస్కరించకు, మహాయోగసిద్ధుడైన ఇతడు ధర్మస్వరూపుడు.

అంతేకాదు ఈ ప్రపంచానికి కర్త. సూర్య చంద్రాదుల్ని ప్రకాశింపచేసే దివ్యజ్యోతి స్వరూపుడు. బ్రహ్మాండాలని బంతుల్లా ఆడుకునేవాడు. వత్సా! ఈ మహాపురుషుడు బీజికాగా, నీవు బీజం, నేను యోనిని అని అనగానే బ్రహ్మ! శ్రీహరీ! నేను బీజం నీవు యోని? ఎలా అవుతాం అని ప్రశ్నించాడు.

వత్సా! ఇతడికన్నా గొప్పవాడు లేడు. ఈ మహాపురుషుడి స్థానం శివలోకం. ఈ శివుడు సాకారం, నిరాకారం అని రెండు విధాలుగా తన రూపాన్ని

విభజించాడు. వీటిలో నిరాకారరూపం శివలింగంగా, సాకార రూపం పరమేశ్వరుడిగా చెప్పబడతాయి.

పూర్వం మహాలింగం నుంచి ఉద్భవించిన సృష్టికారణమైన బీజాన్ని యోని స్వరుపుడనైన నాలో పరమేశ్వరుడు నెలకొల్పగా, అది కాలక్రమంలో హిరణ్మయమైన అండంగా ఈ సముద్ర జలాల్లో పరిణమించింది. వెయ్యి సంవత్సరాలు గడిచాక వాయుదేవుడు ఆ అండాన్ని రెండుగా విభజించాడు. విభజించబడ్డ అండం పైభాగం అంతరిక్షం కాగా, క్రిందభాగం భూలోకమైంది. ఇక ఆ అండం మధ్యలో వున్న భాగం మేరు పర్వతంగా ఆవిర్భవించింది. ఆ తరువాత కపాల ద్వయం మధ్యలోంచి నీవు (బ్రహ్మదేవుడు) ఉదయించావు. పుట్టిన తరువాత సూర్యచంద్రులు నక్షత్రాలు లేని శూన్యమైన ప్రదేశాన్ని చూసి ఇదేమిటి? నేనెక్కడున్నాను? నేనేం చేయాలి? అని ఆలోచిస్తున్నావు. అలా వెయ్యి సంవత్సరాలు గడిచిపోయింది.

వెయ్యేళ్ళ తరువాత నీకు 1. సనత్కుమారుడు 2.ఋభువు 3.సనకుడు 4.సనాతనుడు 5.సనందనుడు అనే నలుగురు మానసపుత్రులు ఏక కాలంలో జన్మించారు. వారు అగ్నిసమానమైన దివ్య తేజస్సుతో ప్రకాశిస్తూ, జితేంద్రియులై లోక స్థితికోసం తపస్సు చేయటానికి వెళ్ళిపోయారు. వీరిలో ఋభువు, సనత్కుమారుడు నీ అధీనంలో ఉండగా మిగిలిన ముగ్గురూ మాయామోహంలో చిక్కుకోక నివృత్తి మార్గాన్ని అనుసరించారు. ఇలా నీ పుత్రులు ప్రవర్తించగా శివమాయామోహంలో చిక్కిన నీవు ఒక కల్పం గడిచేవరకూ తెలివి తప్పి అలా పడిఉన్నావు. పరమేశ్వర మాయ ప్రాణులందర్నీ ఆవరిస్తుంది. అలాంటి మాయలో చిక్కుకోకుండా స్వయంప్రకాశమానుడుగా ఉండేవాడు పరమేశ్వరుడొక్కడే అని తెలుసుకో. మనముందున్న ఈ పరమపురుషుడే ఆ పరమేశ్వరుడు. ఈ మహాదేవుడే జగత్తుకి ప్రభువు.

పరమేశ్వరుణ్ణి సంతోషపరిచే ఓంకారంతో సామవేదంతో ఆయనకి నమస్కరించి జాగ్రత్తపడు. లేకపోతే ఆయనవేడి నిట్టూర్పు నిన్ను సమూలంగా భస్మం చేస్తుంది. లే! మేలుకో! నీ అజ్ఞానాన్ని, అహంకారాన్ని విడిచిపెట్టు.

నాతో కలిసిరా! ఈ మహాయోగిని స్తుతిద్దాం" అని హితబోధ చేసాడు. శ్రీహరి హితబోధ విన్నాక బ్రహ్మకి అజ్ఞానం తొలగిపోయి శ్రీహరితో కలిసి పరమేశ్వరుణ్ణి ఎంతో భక్తితో ఇలా స్తుతించారు.

## శ్రీహరి, బ్రహ్మ చేసిన శివస్తోత్రం

శ్లో॥ నమస్తుభ్యం భగవతే - సువ్రతానంత తేజసే । 1

శ్లో॥ నమః క్షేత్రాధి పతయే బీజినే శూలినే నమః ।
సుమేఢ్రాయార్ధ్వ మేఢ్రాయ - దండినే రూక్ష తేజసే ॥ 2

శ్లో॥ నమో జ్యేష్ఠాయ శ్రేష్ఠాయ - పూర్వాయ ప్రథమాయ చ ।
నమో మాన్యాయ పూజ్యాయ - సద్యోజాతాయ వై నమః ॥ 3

శ్లో॥ నమః క్షేత్రాధిపతయే - బీజినే శూలినే నమః ।
గహ్వరాయ ఘటేశాయ - వ్యోమ చీరాంబరాయ చ ॥ 4

శ్లో॥ వేదానాం ప్రభవే చైవ - స్మృతీనాం ప్రభవే నమః ।
ప్రభవే కర్మదానానం - ద్రవ్యాణాం ప్రభవే నమః ॥ 5

శ్లో॥ నమో యోగస్య ప్రభవే - సాంఖ్యస్య ప్రభవే నమః ।
నమో ధ్రువనిబద్ధానా - మృషీణాం ప్రభవే నమః ॥ 6

శ్లో॥ ఋక్షాణాం ప్రభవే తుభ్యం - గ్రహాణాం ప్రభవే నమః ।
వైద్యుతాశని మేఘానాం - గర్జిత ప్రభవే నమః ॥ 7

శ్లో॥ మహోదధీనాం ప్రభవే - ద్వీపానాం ప్రభవే నమః ।
అద్రీణాం ప్రభవే చైవ - వర్షాణాం ప్రభవే నమః ॥ 8

శ్లో॥ నమో నదీనాం ప్రభవే నదానాం ప్రభవే నమః ।
మహౌషధీనాం ప్రభవే - వృక్షాణాం ప్రభవే నమః ॥ 9

శ్లో॥ ధర్మవృక్షాయ ధర్మాయ - స్థితీనాం ప్రభవే నమః ।
ప్రభవే చ పరార్ధస్య - పరస్య ప్రభవే నమః ॥ 10

శ్లో॥ నమో రసానాం ప్రభవే - రత్నానాం ప్రభవే నమః ।
క్షణానాం ప్రభవే చైవ - లవానాం ప్రభవే నమః ॥ 11

శ్లో॥ అహోరాత్రార్ధమాసానాం - మాసానాం ప్రభవే నమః ।
ఋతూనాం ప్రభవే తుభ్యం-సంఖ్యాయాః ప్రభవే నమః ॥ 12

శ్లో॥ ప్రభవే చాపరార్ధస్య - పరార్ధ ప్రభవే నమః ।
నమః పురాణప్రభవే - సర్గాణాం ప్రభవే నమః ॥ 13

శ్లో॥ మన్వంతరాణాం ప్రభవే - యోగస్య ప్రభవే నమః ।
చతుర్విధస్య సర్గస్య ప్రభవేఽ నంత చక్షుషే ॥ 14

శ్లో॥ కల్పోదయ నిబంధానాం - వార్తానాం ప్రభవే నమః ।
నమో విశ్వస్య ప్రభవే - బ్రహ్మాధిపతయే నమః ॥ 15

శ్లో॥ విద్యానాం ప్రభవే చైవ - విద్యాఽధిపతయే నమః ।
నమో వ్రతాధిపతయే - వ్రతానాం ప్రభవే నమః ॥ 16

శ్లో॥ మంత్రాణాం ప్రభవే తుభ్యం - మంత్రాధిపతయే నమః ।
పితౄణాంపతయే చైవ - పశూనాం పతయే నమః ॥ 17

శ్లో॥ వాగ్వృషాయ నమస్తుభ్యం - పురాణవృషభాయ చ ।
నమః పశూనాంపతయే - గోవృషేంద్రధ్వజాయ చ ॥ 18

శ్లో॥ ప్రజాపతీనాం పతయే - సిద్ధానాం పతయే నమః ।
దైత్యదానవ సంఘానాం - రాక్షసాం పతయే నమః ॥ 19

శ్లో॥ గంధర్వాణాం చ పతయే - యక్షాణాం పతయే నమః ।
గరుడోరగసర్పాణాం - పక్షిణాం పతయే నమః ॥ 20

శ్లో॥ సర్వగుహ్య పిశాచానాం - గుహ్యాధిపతయే నమః ।
గోకర్ణాయ చ గోప్త్రేచ - శంకు కర్ణాయ వై నమః ॥ 21

శ్లో॥ వరాహాయప్రమేయాయ - ఋక్షాయ విరజాయ చ ।
నమః సురాణాంపతయే - గణానాం పతయే నమః ॥ 22

శ్లో॥ అంభసాం పతయే చైవ - ఓజసాంపతయే నమః ।
నమోఽస్తు లక్ష్మీపతయే - శ్రీపాయ క్షితిపాయ చ ॥ 23

శ్లో॥ బలాబలసమూహాయ - అక్షోభ్య క్షోభణాయ చ ।
దీప్తశృంగైకశృంగాయ - వృషభాయ కకుద్మినే ॥ 24

శ్లో॥ నమః స్థైర్యాయ వపుషే - తేజసాః సువ్రతాయ చ ।
అతీతాయ భవిష్యాయ - వర్తమానాయ వై నమః ॥ 25

శ్లో॥ సువర్చసే చ వీర్యాయ - శూరాయ హ్యజితాయ చ ।
వరదాయ వరేణ్యాయ - పురుషాయ మహాత్మనే ॥ 26

శ్లో॥ నమో భూతాయ భవ్యాయ - మహతే ప్రభవాయ చ ।
జనాయ చ నమ స్తుభ్యం - తపసే వరదాయ చ ॥ 27

శ్లో॥ అణవే మహతే చైవ - నవ స్సర్వగతాయ చ ।
నమో బంధాయ మోక్షాయ - స్వర్గాయ నరకాయ చ ॥ 28

శ్లో॥ నమో భవాయ దేవాయ - ఇజ్యాయ యాజకాయ చ ।
ప్రత్యుదీర్ణాయ దీప్తాయ - తత్త్వాయాతిగుణాయ చ ॥ 29

శ్లో॥ నమః పాశాయ శస్త్రాయ - నమ స్త్వాభరణాయ చ ।
హుతాయ ఉపహూతాయ ప్రహుత ప్రాశితాయ చ ॥ 30

శ్లో॥ నమోఽస్త్విష్టాయ పూర్తాయ - అగ్నిష్టోమద్విజాయ చ ।
సదస్యాయ నమశ్చైవ - దక్షిణాఽవభృధాయ చ ॥ 31

శ్లో॥ అహింసాయాప్రలోభాయ - పశు మంత్రౌషధాయ చ ।
నమః పుష్టిప్రదానాయ - సుశీలాయ సుశీలినే ॥ 32

శ్లో॥ అతీతాయ భవిష్యాయ - వర్తమానాయ తే నమః ।
సువర్చసే చ వీర్యాయ - శూరాయ హ్యజితాయ చ ॥ 33

శ్లో॥ వరదాయ వరేణ్యాయ - పురుషాయ మహాత్మనే ।
నమో భూతాయ భవ్యాయ - మహతే చాభయాయ చ ॥ 34

శ్లో॥ జరాఽసిద్ధ నమ స్తుభ్య - మయసే వరదాయ చ ।
అధరే మహితే చైవ - నమః సస్తుపతాయ చ ॥ 35

శ్లో॥ నమ శ్చేంద్రియ పత్రాణాం - లే లిహానాయ స్రగ్విణే ।
విశ్వాయ విశ్వరూపాయ - విశ్వతః శిరసే నమః ॥ 36

శ్లో॥ సర్వతః పాణిపాదాయ - రుద్రాయాప్రతిమాయ చ ।
నమో హవ్యాయ కవ్యాయ-హవ్యావాహాయ వై నమః ॥ 37

శ్లో॥ నమః సిద్ధాయ మేధ్యాయ - ఇష్టాయేజ్యా పరాయ చ ।
సువీరాయ సుఘోరాయ - అక్షోభ్య క్షోభణాయ చ ॥ 38

శ్లో॥ సుప్రజాయ సుమేధాయ - దీప్తాయ భాస్కరాయ చ ।
నమో బుద్ధాయ శుద్ధాయ-విస్తృతాయ మతాయ చ ॥ 39

శ్లో॥ నమః స్థూలాయ సూక్ష్మాయ - దృశ్యాదృశ్యాయ సర్వశః ।
వర్షతే జ్వలతే చైవ - వాయవే శిశిరాయ చ ॥ 40

శ్లో॥ నమస్తే వక్రకేశాయ ఉపవక్షః శిఖాయ చ ।
నమోనమ స్సువర్ణాయ తపనీ యనిభాయ చ ॥ 41

శ్లో॥ విరూపాక్షాయ లింగాయ - పింగలాయ మహౌజసే ।
వృష్టిఘ్నాయ నమశ్చైవ - నమః సౌమ్యేక్షణాయ చ ॥ 42

శ్లో॥ నమో ధూమ్రాయ శ్వేతాయ - కృష్ణాయ లోహితాయ చ ।
పిశితాయ పిశంగాయ - పీతాయ చ నిషంగిణే ॥ 43

శ్లో॥ నమస్తే సవిశేషాయ - నిర్విశేషాయ వై నమః ।
నమ ఈజ్యాయ పూజ్యాయ - ఉపజీవ్యాయవై నమః ॥ 44

శ్లో॥ నమః క్షేమ్యాయ వృద్ధాయ - వత్సలాయ నమో నమః ।
నమో భూతాయ సత్యాయ - సత్యాసత్యాయ వై నమః ॥ 45

శ్లో॥ నమో వై పద్మవర్ణాయ - మృత్యుఘ్నాయ చ మృత్యవే ।
నమో గౌరాయ శ్యామాయ - కద్రవే లోహితాయ చ ॥ 46

శ్లో॥ మహా సంధ్యాభ్రవర్ణాయ - చారు దీప్తాయ దీక్షిణే ।
నమః కమలహస్తాయ - దిగ్వాసాయ కపర్దినే ॥ 47

శ్లో॥ అప్రమాణాయ సర్వాయ-అవ్యయాయామరాయ చ ।
నమో రూపాయ గంధాయ-శాశ్వతాయాక్షతాయ చ ॥ 48

శ్లో॥ పురస్తాత్ బృంహతే చైవ - విభ్రాంతాయ కృతాయ చ ।
దుర్గమాయ మహేశాయ - క్రోధాయ కపిలాయ చ ॥ 49

శ్లో॥ తర్క్యాతర్క్య శరీరాయ - బలినే రంహసాయ చ ।
సికత్యాయ ప్రవాహ్యాయ - స్థితాయ ప్రసృతాయ చ ॥ 50

శ్లో॥ సుమేధసే కులాలాయ - నమస్తే శశిఖండినే ।
చిత్రాయ చిత్రవేషాయ - చిత్రవర్ణాయ మేధసే ॥ 51

శ్లో॥ చేకితానాయ తుష్టాయ - నమస్తే నిహితాయ చ ।
నమశ్శాంతాయ దాంతాయ-వజ్ర సంహననాయ చ ॥ 52

శ్లో॥ రక్షోఘ్నాయ విషఘ్నాయ - శితికంఠోర్ధ్వ మధ్యవే ।
లేలిహాయ కృతాంతాయ - తిగ్మాయుధ వరాయ చ ॥ 53

శ్లో॥ ప్రమోదాయ సమోదాయ - యతివేద్యాయ తే నమః ।
అనామయాయ సర్వాయ - మహాకాలాయ వై నమః ॥ 54

శ్లో॥ ప్రణవప్రణవేశాయ - భగనేత్రాంతకాయ చ ।
మృగ వ్యాధాయ దక్షాయ-దక్షయజ్ఞాంతకాయ చ ॥ 55

శ్లో॥ సర్వభూతాత్మభూతాయ - సర్వేశాతిశయాయ చ ।
పురఘ్నాయ సుశస్త్రాయ - ధన్వినేఽథ పరశ్వధే ॥ 56

శ్లో॥ పూషదంత వినాశాయ - భగనేత్రాంతకాయ చ ।
కామదాయ వరిష్ఠాయ - కామాంగ దహనాయ చ ॥ 57

శ్లో॥ రంగే కరాళ వక్త్రాయ - నాగేంద్ర వదనాయ చ ।
దైత్యానా ముంతకేశాయ - దైత్యాక్రందకరాయ చ ॥ 58

శ్లో॥ హిమఘ్నాయ చ తీక్ష్ణాయ - ఆర్ద్రచర్మధరాయ చ ।
శ్మశానరతి నిత్యాయ - నమోఽస్తూల్ముక ధారిణే ॥ 59

శ్లో॥ నమస్తే ప్రాణపాలాయ - ముండమాలా ధరాయ చ ।
ప్రహీణశోకై ర్వివిధై - ర్భూతైః పరివృతాయ చ ॥ 60

శ్లో॥ నరనారీ శరీరాయ - దేవ్యాః ప్రియకరాయ చ ।
జటినే ముండినే చైవ - వ్యాళ యజ్ఞోపవీతినే ॥ 61

శ్లో॥ నమోఽస్తు నృత్యశీలాయ - ఉపనృత్య ప్రియాయ చ ।
మన్యవే గీతశీలాయ - ముని భర్గాయతే నమః ॥ 62

శ్లో॥ కటంకటాయ తిగ్మాయ - అప్రియాయ ప్రియాయ చ ।
విభీషణాయ భీష్మాయ - భగప్రమథనాయ చ ॥ 63

శ్లో॥ సిద్ధసంఘా నుగీతాయ - మహాభాగాయ వై నమః ।
నమో ముక్తాట్టహాసాయ - క్ష్వేడితాస్ఫోటితాయ చ ॥ 64

శ్లో॥ నర్తతే కూర్తతే చైవ - నమః ప్రముదితాత్మనే ।
నమో మృడాయ శ్వసతే - ధావతే ఽ ధిష్ఠితే నమః ॥ 65

శ్లో॥ ధ్యాయతే జృంభతే చైవ - రుదతే ద్రవతే నమః ।
వల్గతే క్రీడతే చైవ - లంబోదర శరీరిణే ॥ 66

శ్లో॥ నమోఽకృత్యాయ కృత్యాయ - ముండాయ కీకటాయ చ ।
నమ ఉన్మత్తదేహాయ - కింకిణీకాయ వై నమః ॥ 67

శ్లో॥ నమో వికృతవేషాయ - క్రూరాయామర్షణాయ చ ।
అప్రమేయాయ గోప్త్రే చ - దీప్తాయా నిర్గుణాయ చ ॥ 68

శ్లో॥ వాయుప్రియాయ వామాయ - చూడామణిధరాయ చ ।
నమ స్తోకాయ తనవే - గుణైరప్రమితాయ చ ॥ 69

శ్లో॥ నమో గుణ్యాయ గుహ్యాయ - అగమ్య గమనాయ చ ।
లోకధాత్రీ త్వియం భూమి - పాదౌ సజ్జన సేవితౌ ॥ 70

శ్లో॥ సర్వేషాం సిద్ధియోగానా - మధిష్ఠానం తవోదరం ।
మధ్యేంఽ_తరిక్షం విస్తీర్ణం - తారాగణ విభూషితమ్ ॥ 71

శ్లో॥ స్వాతేః పయ ఇవాభాతి - శ్రీమాన్ హార స్తవోరసి ।
దిశో దశ భుజా స్తుభ్యం - కేయూరాంగదభూషితాః ॥ 72

శ్లో॥ విస్తీర్ణ పరిణాహశ్చ - నీలాంజన చ యోవమః ।
కంఠస్తే శోభతే శ్రీమాన్ - హేమ సూత్రావిభూషితః ॥ 73

శ్లో॥ దంష్ట్రాకరాళం దుర్ధర్ష - మనౌ పమ్యం ముఖం తథా ।
పద్మమాలాకృతోష్ణీషం - శిరో ద్యౌఃశోభతేఽధికమ్ ॥ 74

శ్లో॥ దీప్తిః సూర్యే వపుశ్చంద్రే - స్థైర్యం శైలేఽ_నిలే బలం ।
ఔష్ణ్య మగ్నౌ తథా శైత్య - మప్సు శబ్దోంబరే తథా ॥ 75

శ్లో॥ అక్షరాం తర నిష్పందాత్ - గుణా నేతాన్ విదుర్బుధాః ।
జపో జప్యో మహాదేవో - మహాయోగోమహేశ్వరః ॥ 76

శ్లో॥ పురేశయో గుహావాసీ - ఖేచరో రజనీచరః ।
తపోనిధి ర్గుహగురు - ర్నందనో నందవర్ధనః ॥ 77

శ్లో॥ హయశీర్ష్ణా పయోధాతా - విధాతా భూతభావనః ।
బోద్ధవ్యో బోధితా నేతా - దుర్ధర్షో దుష్ప్రకంపనః ॥ 78

శ్లో॥ బృహద్రథో భీమకర్మా - బృహత్కీర్తి ర్ధనంజయః ।
ఘంటాప్రియో ధ్వజీ ఛత్రీ - పినాకీ ధ్వజనీపతిః ॥ 79

శ్లో॥ కవచీ పట్టిశీ ఖడ్గీ - దనుర్హస్తః పరశ్వధీ ।
అపస్మారోఽనఘ శ్శూరో - దేవరాజోఽరిమర్దనః ॥ 80

శ్లో॥ త్వాం ప్రసాద్య పురాస్మాభి - ర్ద్విషంతో నిహతా యుధి ।
అగ్నిః సదార్ణవాంభస్త్వం - పిబన్నపి న తృప్యసే ॥ 81

శ్లో॥ క్రోధాకారః ప్రసన్నాత్మా - కామదః కామగః ప్రియః ।
బ్రహ్మచారీ చా గాధశ్చ - బ్రహ్మణ్యః శిష్టపూజితః ॥ 82

శ్లో॥ దేవావా మక్షయః కోశ - స్త్వయా యజ్ఞః ప్రకల్పితః ।
హవ్యం తవేదం వహతి - వేదోక్తం హవ్యవాహనః ॥
ప్రీతే త్వయి మహాదేవ - వయం ప్రీతా భవామహే ॥ 83

శ్లో॥ భవానీశో నాదిమాంస్త్వం చ సర్వ-లోకానాం త్వం బ్రహ్మకర్తా।
దిసర్గః। సాంఖ్యాః ప్రకృతేఃపరమం త్వాం విదిత్వా క్షీణధ్యానా।
స్త్వామమృత్యుం విశంతి ॥ 84

శ్లో॥ యోగాశ్చ త్వాం ధ్యాయినో నిత్యసిద్ధం - జ్ఞాత్వా యోగాః ।
సంత్యజంతే పున స్త్వామ్ - యేచాప్య న్యే త్వాం ప్రసన్నా
విశుద్ధాః స్వకర్మభి స్తే దివ్యభోగా భవంతి ॥ 85

శ్లో॥ అప్ర సంఖ్యేయ తత్త్వస్య - యథా విద్మః స్వశక్తి తః ।
కీర్తితం తవ మహాత్మ్య - మపారస్య మహాత్మనః ॥ 86

**ఫలశ్రుతి :-**

శ్లో॥ శివో నో భవ సర్వత్ర యోఽసి సోఽసి నమోస్తుతే ।
య ఇదం కీర్తయే ద్భక్త్యా - బ్రహ్మనారాయణ స్తవం ॥ 87

శ్లో॥ శ్రావయేద్వా ద్విజాన్ విద్వాన్ - శృణుయాద్వా సమాహితః ।
అశ్వమేధాయుతం కృత్వా - యత్ఫలం తదవాప్నుయాత్ ॥ 88

శ్లో॥ పాపాచారోఽపి యో మర్త్యః - శృణుయా చ్ఛివసన్నిధౌ ।
జపేద్వాపి వినిర్ముక్తో - బ్రహ్మలోకం స గచ్ఛతి ॥ 89

శ్లో॥ శ్రాద్ధే వా దైవికే కార్యే - యజ్ఞేవావభృధాంతికే ।
కీర్తయేద్వా సతాంమధ్యే - స యాతి బ్రహ్మణో ఽంతికమ్ ॥ 90

*(శ్లో॥1-90,అధ్యా-21)*

శ్రీహరి బ్రహ్మదేవుడు చేసిన ఈ దివ్యస్తోత్రాన్ని ఎవడు భక్తితో పఠిస్తాడో, అర్థాన్ని గ్రహించి ద్విజులకి వినిపిస్తాడో లేక తానే వింటాడో, అలాంటివాడు పదివేల అశ్వమేధ యాగాలు చేసిన ఫలాన్ని పొందుతాడు.

శివసన్నిధిలో విన్నా పఠించినా అనంతమైన పుణ్యం కలుగుతుంది. శ్రాద్ధ సమయాలలో, దైవిక కార్యక్రమాలలో, యజ్ఞశాలల్లో, అవభృథ స్నానానంతరం ఈ శివస్తోత్రాన్ని కీర్తించినా భక్తుల సమావేశంలో ఉచ్చైఃస్వరంతో పఠించినా శివసన్నిధికి చేరుకుంటారు.

## లింగార్చనలో స్నానవిధి

పరమేశ్వరుడి నిరాకార స్వరూపమైన లింగాన్ని అర్చించటంలో భాగంగా అర్చనచేసేవాడికి స్నానవిధి ప్రత్యేకంగా చెప్పబడింది. స్నానం అనేది 1.వారుణం 2.ఆగ్నేయం 3.మాంత్రికం అని మూడు విధాలుగా వుంటుంది. మనస్సు స్థిరంగా లేకుండా దుష్టమైన ఆలోచనలతో నిండి ఉంటే, మహానదుల్లో, సరోవరాల్లో ఎవడూ పవిత్రుడు కాలేడు. భక్తి, శ్రద్ధ అనే జ్ఞాన సూర్యుడు వికసిస్తే అతడిలో ఉన్న మనోభావం పరిశుద్ధమవుతుంది.

**1. వారుణ స్నానం :** లింగార్చన చేసేవాడు స్నానంచేసే నీళ్ళలో దర్భలు వేసి ముందుగా ఆ నీళ్ళతో పాదాలు కడుక్కుని ఆచమించాలి. ఆ తరువాత కొద్దిగా నీళ్ళు వంటిమీద పోసుకుని మట్టి, ఆవుపేడ, నువ్వులు కలిపి వంటికి రాసుకుని తిరిగి నీళ్ళతో స్నానం చేయాలి.తరువాత పరిశుభ్రమైన వస్త్రాన్ని ధరించి రెండోసారి స్నానం చేయాలి. తిరిగి ఆ వస్త్రాన్ని విడిచిపెట్టి మూడోసారి మరో వస్త్రాన్ని ధరించి స్నానం చేయాలి. అలా మూడోసారి స్నానం చేసేడప్పుడు స్నానం చేసే నీళ్ళలో వరుణదేవుణ్ణి ఆవాహనచేసి, మానసికంగా ఆయన్ని పూజించి, మహేశ్వరుణ్ణి స్మరించి మూడోస్నానం ఆచరించాలి. స్నానం చేసేడప్పుడు నమక చమకాలని, పవమాన సూక్తాన్ని పఠిస్తూ జలధారతో తానే రుద్రుణ్ణనే భావంతో స్నానం చేయాలి.

స్నానం అయిన తరువాత తుడుచుకుని పొడి వస్త్రాలు ధరించి, పరిశుభ్రమైన స్థలంలో కూర్చుని దర్భోదకాన్ని మూడుసార్లు పుచ్చుకోవాలి. తాను చేసిన నీళ్ళలోని సూక్ష్మక్రిముల్ని (జీవుల్ని) హింసించిన పాపం శమించటం కోసం స్నానం చేసిన నీటిచుట్టూ మూడుసార్లు ప్రదక్షిణ చేయాలి. దీనితో స్నానవిధి ముగుస్తుంది. దీన్ని వారుణ స్నానం అంటారు.

**2. భస్మస్నానం :** నీటితో స్నానం చేసే అవకాశం లేనప్పుడు శరీరమంతా భస్మాన్ని లేపనం చేసుకుంటే దాన్ని భస్మస్నానం అంటారు. ఇది కూడా పవిత్రమైనదే. దీన్నే ఆగ్నేయస్నానం అనికూడా వ్యవహరిస్తారు.

**3. మాంత్రిక స్నానం :** సద్యోజాతుడి పంచబ్రహ్మ మంత్రాలు, శివషడక్షరీ (ఓం నమశ్శివాయ) మంత్రాన్ని పఠిస్తూ మానసికంగా స్నానం చేసినట్టు భావించాలి. దీన్ని మాంత్రిక స్నానం అంటారు.

## సంధ్యా విధి

శివార్చన చేసేవాడు స్నానం చేసిన తరువాత విభూతిని రుద్రాక్షమాలని ధరించి "ఆయాతు వరదాదేవి" అనే మంత్రం పఠించి గాయత్రీదేవికి పాద్యం, అర్ఘ్యం, ఆచమనీయం సమర్పించాలి. ఆ తరువాత దోసిలిలో జలం, గంధం, పుష్పాక్షతలు ఉంచుకుని సూర్యుడికి చూపిస్తూ గాయత్రీ మంత్రాన్ని పఠించి అర్ఘ్యాన్ని ఒక పళ్ళెంలో సమర్పించాలి. కాలాతిక్రమణ కాకపోతే మూడుసార్లు, కాలాతిక్రమణ జరిగితే నాలుగుసార్లు ఈ అర్ఘ్యం ఇవ్వాలి.

సూర్యుడికి అర్ఘ్యాన్ని సమర్పించాక గాయత్రీదేవిని ధ్యానించి, గాయత్రీ మహామంత్రాన్ని వెయ్యి, అయిదువందల కనీసం 108 సార్లు ఓంకారంతో సహా జపించాలి. జపం చేసిన తరువాత "ఉత్తమేశిఖరేజాతే" అనే మంత్రాన్ని పఠించి గాయత్రీ దేవిని స్వస్థానానికి పంపి తూర్పుదిశగా తిరిగి 'ఉద్యంతం' 'చిత్రం' జాతవేదసం అనే మంత్రాలతో సూర్యుడికి నమస్కరించాలి. తరువాత ఋగ్యజుస్సామవేదాల్లో చెప్పిన సౌరసూక్తాన్ని పఠించాలి.

**తర్పణవిధి :** సంధ్యావిధిలో భాగంగా తర్పణాలు సమర్పించాలి. ముందుగా దేవతర్పణం, తరువాత ఋషి, పితృ తర్పణాలు విడవాలి. తూర్పు లేక ఉత్తర దిశవైపు తిరిగి దేవతలకి కుడిచేతి వేళ్ళ కొసల మీదుగా, ఋషులకి చిటికెనవేలు మీదుగా, పితృదేవతలకి బొటనవేలు మీదుగా ఉదకాన్ని ఉద్ధరిణితో తీసుకుని పోస్తూ పాత్రలోకి విడవాలి. ఇదీ దేవ, ఋషి, పితృతర్పణ విధి. దేవతా తర్పణం చేసేడప్పుడు యజ్ఞోపవీతాన్ని సవ్యంగా, ఋషితర్పణం చేసేడప్పుడు మాలాకారంగా,

పితృతర్పణం ఇచ్చేడప్పుడు అపసవ్యంగా ధరించాలి. దేవతర్పణంలో ఒకసారి, ఋషి తర్పణంలో రెండుసార్లు, పితృతర్పణంలో మూడుసార్లు ఉదకాన్ని విడవాలి.

పితృదేవతలకి తర్పణాలు విడిచేడప్పుడు, దివ్య పితరులకి తర్పణాలిచ్చేడప్పుడు జంధ్యాన్ని సవ్యంగా, స్వంత పితరులకి తర్పణాలిచ్చేడప్పుడు అపసవ్యంగా వేసుకోవాలి.

**బ్రహ్మయజ్ఞం :** బ్రహ్మయజ్ఞం అంటే నాలుగువేదాల మంత్రాల్ని వేదాంగ సూక్తుల్ని, ఎడమ అరచేతిలో నీళ్ళు పోసి దానిమీద కుడిచేతిని ఉంచి – కుడిమోకాలుపై ఆ చేతిని పెట్టి చదవాలి. ఇలా బ్రహ్మయజ్ఞాన్ని ముందుగా చేసి ఆ తరువాతే తర్పణం చేయటం ఉత్తమం. దీని తరువాత వరుసగా, దేవయజ్ఞం, మనుష్యయజ్ఞం, భూతయజ్ఞం, పితృయజ్ఞం అనేవి ఆచరించాలి. బ్రహ్మయజ్ఞంతో కలిపి వీటన్నిటినీ పంచయజ్ఞాలని వ్యవహరిస్తారు.

1. **బ్రహ్మయజ్ఞం :** తన వేదశాఖకి సంబంధించిన మంత్రాన్ని శ్రద్ధగా పఠించటం.
2. **దేవయజ్ఞం :** అగ్నిలో అన్నాన్ని ఆహుతిగా సమర్పించటం. దీన్నే వైశ్వదేవం అని కూడా అంటారు.
3. **భూతయజ్ఞం :** ఇంటిముందుండే శునకాలకి, ఆవులకి, పక్షులకి ఆహారాన్ని సమర్పించటం.
4. **మనుష్యయజ్ఞం :** ఉత్తములైన గృహస్థులకి, అతిథులకి భోజనం పెట్టటం.
5. **పితృయజ్ఞం :** విధివిధానంగా ఆయాతిథుల్లో పితృదేవతలకి శ్రాద్ధ కర్మలు ఆచరించి పిండ ప్రదానం చేయటం.

ఈ అయిదురకాల యజ్ఞాలలో బ్రహ్మయజ్ఞం ప్రధానమైనది. బ్రహ్మయజ్ఞం చేయటం వల్ల బ్రహ్మాది దేవతలందరూ ఎంతో సంతోషిస్తారు. వారితోపాటు పితృదేవతలు కూడా ఆనందిస్తారు. అలాగే వేదవేదాంగాలు అష్టాదశ పురాణాలు, ఉపపురాణాలు, ఇతిహాసాలు, ఆగమాలు ప్రసన్నమవుతాయి.

**భస్మధారణ విధి :** ఈ విధంగా పంచయజ్ఞాలు ఆచరించిన తరువాత నది లేక చెరువు దగ్గర నుంచి ఇంటికి వెళ్ళి పాదప్రక్షాళన చేసుకుని భస్మస్నానం

చేయాలి. అనగా విభూతి రాసుకోవాలి. శుద్ధమైన అగ్ని ద్వారా ఏర్పడ్డ భస్మాన్ని ఓంకారంతో శోధించి తడపాలి. తడిపిన విభూతిని ఈశానమంత్రం పఠిస్తూ తలమీద, తత్పురుషమంత్రాన్ని పఠిస్తూ నొసటిమీద, అఘోరమంత్రం పఠిస్తూ రొమ్ముమీద, ఉదరంమీద, వామదేవ మంత్రం చదువుతూ నడుముపైన, సద్యోజాత మంత్రంతో పాదాల మీద, ఓంకారాన్ని పఠిస్తూ శరీరమంతా మూడురేఖల్ని అడ్డంగా ధరించాలి. ఈ భస్మస్నానం చేయటానికి ముందు ఉద్ధరిణితో నీళ్ళని తీసుకుని 'ఆపోహిష్ఠా' అనే మంత్రం పఠిస్తూ ఉదక ప్రోక్షణం (నీళ్ళు చల్లుకోవటం) అనే మంత్ర స్నానాన్ని చేయాలి.

ఈ విధంగా నియమపూరితంగా సంధ్యావిధిని ఆచరించినవాడు, శివానుగ్రహానికి పాత్రుడై, కైలాసాన్ని చేరి శివానందాన్ని అనుభవిస్తాడు.

## లింగార్చనా విధి

లింగార్చన చేయబోయే ఉపాసకుడు ముందు చెప్పిన విధంగా స్నానం, భస్మరుద్రాక్ష ధారణ, సంధ్యావందనం, బ్రహ్మయజ్ఞం చేసిన తరువాత స్వగృహంలో పూజమందిరంలోకి ప్రవేశించి, మూడుసార్లు ప్రాణాయామంచేసి "ఐదుముఖాలు, పదిచేతులు శుద్ధస్ఫటికవర్ణంతో ప్రకాశిస్తూ సర్వాభరణాలు, చిత్ర వస్త్రాలు ధరించినవాడిగా పరమేశ్వరుణ్ణి ధ్యానించాలి. తరువాత శివపంచాక్షరీ మంత్రాన్ని తన శరీరం మీద న్యాసం చేయాలి.

'ఓం' అంగుష్ఠాభ్యాం నమః 'నం' తర్జనీభ్యాం నమః, 'మం' మధ్యమాభ్యాం నమః 'శిం' అనామికాభ్యాం నమః 'వం' కనిష్ఠికాభ్యాం నమః 'యం' కరతలకర పృష్ఠాభ్యాం నమః అని కరన్యాసం చేయాలి. 'ఓం' హృదయాయ నమః, 'నం' శిరసేస్వాహా, 'యం' శిఖాయై వషట్, 'శిం' కవచాయహుం 'వం' నేత్రత్రయా యౌషట్ 'యం' అస్త్రాయ ఫట్ అని హృదయన్యాసం చేయాలి.

**ధ్యానం :** ఓంకార వదనాదేవీ వాయుకార భుజద్వయీ ।
శికార దేహ మధ్యా చ నమకార పదద్వయీ ॥
పంచాక్షరీ పరావిద్యా సతారా లింగరూపిణీ ।
శివమంత్రాభిదా శైవీ మమాంగే సుప్రతిష్ఠితా ॥

ఓంకారాన్ని ముఖంగా, 'వా' 'య' అనే అక్షరాల్ని రెండు చేతులుగా 'శి' అనే అక్షరాన్ని నడుముగా 'న' 'మః' అనే అక్షరాల్ని పాదాలుగా ధరించి పరావిద్యగా ప్రఖ్యాతి పొందిన పంచాక్షరీ మంత్రం ప్రణవంతో (ఓంకారంతో) కూడుకుని, శివలింగ స్వరూపంతో, శివమంత్రం అనే పేరుతో నా శరీరంలో నెలకొంది అని భావించాలి. ఈ విధంగా శివపంచాక్షరీ మంత్రాన్ని భావనచేసిన వాడు శివశరీరం కలిగినవాడవుతాడు.

సూత్రం (దారం)లో మణిలాగా, మఱ్ఱి విత్తనంలో వున్న మఱ్ఱి చెట్టులాగా ఓంకార పంచాక్షరీ మహామంత్రంలో ఛందస్సులు మంత్రాలూ పరబహ్మాం, సూక్ష్మరూపంలో కొలువై ఉన్నాయి. ఈ విధంగా శివపంచాక్షరీ మంత్రాన్ని యథాశక్తి (ఓం నమశ్శివాయ) జపించిన తరువాత పూజకి ఉపక్రమించాలి.

**శివ పూజావిధి :** పూజా మందిరంలో, పూజకి ఉపయోగించే సామాగ్రిపై శ్రీగంధం కలిపిన నీళ్ళని చల్లాలి. పాద్య, అర్ఘ్య, ఆచమనీయ పాత్రల్ని ఓంకారంతో శోధించి వాటిని నీళ్ళతో నింపాలి. ఆ నీళ్ళలో పచ్చకర్పూరం, వట్టివేళ్ళు లాంటి సుగంధ ద్రవ్యాల చూర్ణాన్ని వేయాలి. దానితోపాటు కొద్దిగా పూలు కూడా చేర్చాలి. ఓం నమశ్శివాయ అనే మంత్రంతో సద్యోజాతాది పంచమంత్రాలతో, పాద్య, అర్ఘ్య, ఆచమనీయ పాత్రల్లో ఉన్న నీళ్ళని అభిమంత్రించాలి.

శివుడి ముందున్న నందికేశ్వరుణ్ణి జ్వలిస్తున్న అగ్నిలాంటి కాంతి కలిగినవాడిగా, త్రినేత్రుడిగా అమరాధిపతిగా, భావిస్తూ ధ్యానించి, ఆ తరువాత అతడి భార్య సుయశను ధ్యానించి వారికి పూలు అక్షతలు సమర్పించాలి. అనంతరం శివసన్నిధిలో ఉన్న వినాయకుడు, కుమారస్వామిని, పార్వతీదేవిని పూజించాలి. ఆ తరువాత వివిధ రకాల పుష్పాలతో శివలింగాన్ని, శివాష్టోత్తర శతనామ, సహస్రనామాలని పఠిస్తూ పూజించాలి. పూజానంతరం ధూపదీప నైవేద్యాలు సమర్పించి, పూజకోసం సమర్పించిన పూలు పత్రి మొత్తం శివలింగం మీద నుంచి తీసివేసి నిర్మాల్యం చేయాలి. శివలింగాన్ని శుభ్రమైన నీళ్ళతో కడిగి పాద్యం, అర్ఘ్యం, ఆచమనీయం, పంచామృతాలతో, ఫలోదకాన్ని సమర్పించి

"ఓం నిధనపతయే నమః" అనే మంత్రం నుంచి 'పవిత్రం' వరకూ ఉన్న మంత్రాల్ని ఉచ్చరిస్తూ పరమేశ్వర లింగాన్ని అభిషేకించాలి. అభిషేకానంతరం విభూతి, చందనం, అక్షతలు, పుష్పం, బిల్వం, ధూపదీప నైవేద్యాలు నీరాజన మంత్రపుష్పాలు సమర్పించి శివలింగానికి భక్తితో నమస్కరించాలి.

వేదాల్లో శతరుద్రీయం, దేవతల్లో మహేశ్వరుడు, క్షేత్రాలలో కాశీక్షేత్రం, మంత్రాలలో శివపంచాక్షరీ మంత్రం సర్వశ్రేష్ఠమైనవి. పూజకన్నా హోమం గొప్పది. హోమం కన్నా తర్పణం గొప్పది. తర్పణం కన్నా జపం గొప్పది. జపం కన్నా అభిషేకం చాలా గొప్పది. శివుడి విషయంలో శివలింగానికి అభిషేకం చేసేడప్పుడు రుద్రాధ్యాయాన్ని చదువుతూ అభిషేకం చేయాలి. నమక-చమకాలు పఠిస్తూ ఒకటి లేక మూడు సార్లు శివలింగాన్ని అభిషేకించటం మంచిది. అది శివప్రీతికరం. అభిషేక పూర్వకంగా ఉపాసిస్తే శివుడు త్వరగా కరుణిస్తాడు. ఈ అభిషేకం ఎలా చేయాలంటే?

**శివాభిషేక విధి :** నమకంలోని మంత్రాల్ని పూర్తిగా ఒకసారి చదివి, తరువాత చమకంలోని ఒక అనువాకాన్ని చదవాలి. ఇలా పదకొండు సార్లు నమకాన్ని పఠించి చమకంలోని మొత్తం 11 అనువాకాల్ని ఒక్కొక్కసారి చొప్పున పఠిస్తూ ప్రతిరోజు 11 సార్లు అభిషేకం చేయాలి. ఇలా నలభైరోజుల పాటు, బ్రహ్మచర్యాది నియమాలు పాటిస్తూ శివలింగాన్ని అభిషేకించిన వాడు మహాపాతకాల్ని సైతం నశింపచేసుకుని రాజసూయ యాగం చేసిన ఫలితం పొందుతాడు.

పైవిధంగా రుద్రాభిషేకం పూర్తిచేసిన తరువాత మంచి నీళ్ళతో ఆచమనాన్ని సమర్పించి, కిరీటం ఛత్ర, చామర, ఆభరణాల్ని, తాంబూలాన్ని ప్రణవ పంచాక్షరీ మంత్రాన్ని ఉచ్చరిస్తూ సమర్పించాలి. లింగంలో కొలువై ఉన్న పరమేశ్వరుణ్ణి...

"స్ఫటికవర్ణంతో ప్రకాశించేవాడు, మహాదేవుడు, నిష్కళుడు, అక్షరుడు, దేవతలందర్నీ ఉద్భవింప చేసినవాడు, చతుర్దశ భువనాలలో వ్యాపించినవాడు,

బ్రహ్మాది దేవతలకీ, ఋషులకీ, మునులకీ సైతం గోచరించనివాడు, వేదవేదాంత వేత్తలకి కూడా దర్శనమివ్వనివాడు, ఆదిమధ్యాంత రహితుడు, భవరోగాల్ని నశింపచేసే వైద్యుడు అయిన పరమశివుడు శాశ్వతంగా శివలింగంలో నివసిస్తున్నాడు" అని భావించాలి.

ఇలా శివుణ్ణి భావించిన తరువాత శివలింగానికి సాష్టాంగ దండ ప్రణామం ఆచరించి, అపరాధ క్షమాపణలు చెప్పుకుని పూజించిన శివలింగాన్ని తన హృదయంలో నిలుపుకున్నట్టు భావించాలి. ఇది సంగ్రహంగా బాహ్యలింగార్చన విధి. (ఈ పూజావిధిని నందికేశ్వరుడు స్వయంగా చెప్పాడు)

## మానసిక శివలింగార్చన విధి

బాహ్య శివలింగార్చన ఎంతటి ఫలాన్నిస్తుందో మానసిక శివలింగార్చన కూడా అంతే ఫలాన్నందిస్తుంది. ఉపాసకుడు తన హృదయంలో అగ్నిమండలాన్ని దానిమీద సూర్యమండలాన్ని, దానిపైనచంద్రమండలాన్ని, ఈ మూడు మండలాలపైన సత్త్వరజస్తమోగుణాత్మకమైన ప్రకృతి పరమేశ్వరులు అర్ధనారీశ్వరులుగా, కొలువైవున్నట్టు భావిస్తూ ఆ ఆది దంపతుల్ని ధ్యానించాలి.

మహేశ్వరుడే వేదాలన్నిటికీ కర్త. ఆ శివుడే సృష్టి ప్రారంభంలో దేవతలందరికన్నా ముందుగా బ్రహ్మదేవుణ్ణి సృష్టించి, ఆయనకి వేద, శాస్త్ర విజ్ఞానాన్ని ప్రసాదించాడు. కనుక విశ్వాధికుడు సర్వజ్ఞుడు అయిన ఆ పరమేశ్వరుడు మమ్మల్ని శివధ్యానంలో ఏకాగ్రతను పొందేలా అనుగ్రహించు గాక! అని లోలోపల ప్రార్థించాలి.

పరమపురుషుడంటే రుద్రుడే అని తెలుసుకుని, సంసార బంధాన్ని తొలగించే శివధ్యానాన్ని, జపాన్ని, పూజల్ని ఆచరిస్తూ ఉండాలి. ధ్యానం అంటే? శివుడి దివ్యలక్షణాల్ని, ఆయన మహిమల్ని ఏకాగ్రతతో ధ్యానించటమే.

పరమేశ్వరుణ్ణి మానసికంగా అర్చించేవారు తమ మనసులోనే, ఆయన్ని ఆహ్వానించి, ధ్యానించి, ఆవాహన, ఆసన, పాద్య, అర్ఘ్య, ఆచమన, స్నాన, భస్మ, గంధాక్షత, పుష్ప, బిల్వ, ధూప, దీప, నైవేద్య తాంబూల ఫలాల్ని సమర్పించి,

మహానీరాజనం మంత్రపుష్పం అర్పించి స్వామికి మనసులోనే భక్తిగా నమస్కరించాలి. ఈ విధంగా శివుణ్ణి మనసులో పూజించిన వారిని శివభక్తులైన వారు ఎంతో గౌరవించాలి. అలాంటి శివభక్తులకి తగిన ఆశ్రమం భోజనవసతులు కల్పించాలి.

ఇలా అంతర్లింగార్చన చేసేవారు తప్పనిసరిగా భస్మాన్ని రుద్రాక్షల్ని శరీరం మీద ధరించాలి. శివధ్యానం చేసేవారు 'శివోఽహం' అనే అద్వైత భావన కలిగి ఉంటేనే మోక్షాన్ని పొందుతారు. శివాగమంలో చెప్పిన విధంగా అంతర్లింగ బహిర్లింగార్చన చేసేవారిని, శివలింగాన్ని మెడలో ధరించిన వారిని చూసి నిందించకూడదు. అలా చేసినవారు దుఃఖాలపాలవుతారు.

## దారువనంలో మునుల్ని పరీక్షించిన శివుడు

పూర్వం 'దారువనం' అనే తపోస్థలం ఉండేది. ఆ వనంలో ఎందరో మునులు తమ తమ భార్యలతో సహా 'అగ్ని' ని ఉపాసిస్తూ కఠోరమైన తపస్సుని కొనసాగిస్తున్నారు. ఒకనాడు వారందర్నీ పరీక్షించాలని భావించిన పరమేశ్వరుడు సుందరమైన రూపాన్ని ధరించి ఆ దారువనానికి వెళ్ళాడు. జగదేక సౌందర్య వంతుడుగా తమ కళ్ళకి కనిపించిన శివుణ్ణి చూసి మునిపత్నులందరూ పతివ్రతలైనప్పటికీ ఆయనమీద వ్యామోహాన్ని పెంచుకున్నారు. స్త్రీలకి మనోచాంచల్యం కలిగించేలా సుందరుడిగా మారిన శివుడు నాట్యం చేస్తూ ఆ వనంలో సంచరిస్తుండగా తాపం ఆపుకోలేని మునిపత్నులు యుక్తాయుక్తాలు మరిచి ఆయన వెంటబడ్డారు. తమ శరీరం మీదున్న వస్త్రా భరణాల స్థితిగతుల్ని కూడా మర్చిపోయి మదనపరవశంతో కొందరు సంగీతాల్ని ఆలపిస్తుండగా, మరికొందరు ఆయన్ని ఆకర్షించాలని అందంగా నాట్యాలు చేస్తున్నారు. మరి కొందరు ఆయన దారికి అడ్డంగా నిలబడి కౌగిలించుకోవాలని ప్రయత్నిస్తున్నారు. మన్మథవికారం మితిమీరిపోగా ఆ సుందర పురుషుణ్ణి ఆపి ఎవరునీవు? ఎక్కడనుంచి వచ్చావు! ఓ సుందరాంగా! దయచేసి మమ్మల్ని అనుగ్రహించు. మా శరీరాలకి ఆనందాన్ని చేకూర్చు. మదన తాపాన్ని మేము ఏమాత్రం తట్టుకోలేకపోతున్నాం' అని సిగ్గువిడిచి అడిగారు.

మునిపత్నులు తనని ఎంతగా రెచ్చగొట్టినా ఆ సుందర పురుషుడు ఏమాత్రం చలించలేదు. అలాగే ఏమీ మాట్లాడకుండా నిశ్చలంగా నుంచున్నాడు. ఆ దృశ్యాన్ని చూసి మునులంతా ఆగ్రహోదగ్రులయ్యారు. తమ భార్యలకి మదన వికారం కలిగించిన సుందర పురుషుణ్ణి ఎన్నో మాటలతో దూషించారు. ఎన్నో రకాల శాపాలిచ్చారు. అయితే అవేవీ ఆయన్ని ఏమీ చేయలేకపోయాయి. ఋషుల శాపాలన్నీ పూర్వం పరమేశ్వరుడి మీద తప్ప, సకల దేవతల మీదా ప్రభావాన్ని చూపించాయి.

దధీచిశాపం వల్ల దక్షుడు చేసే యాగం ధ్వంసమయ్యింది. భృగుమహర్షి శాపం వల్ల శ్రీహరి పది అవతారాలు ఎత్తవలసి వచ్చింది. గౌతముడి ఆగ్రహంతో దేవేంద్రుడి వృషణాలు జారిపడ్డాయి. పూర్వం మునులందరి శాపాల ప్రభావంతో శ్రీహరి శయనించే క్షీరసముద్రం, అమృత సముద్రం త్రాగటానికి ఏమాత్రం పనికి రాకపోగా, అప్పుడు నారాయణుడు కాశీక్షేత్రానికి వెళ్ళి క్షీరంతో విశ్వేశ్వరుణ్ణి అభిషేకించి, తిరిగి క్షీర సముద్రాన్ని త్రాగటానికి అనువుగా చేసుకున్నాడు.

మాండవ్యమహర్షి శాపంతో ధర్మదేవత కృతయుగం నుంచి కలియుగానికి వచ్చేసరికి క్రమంగా క్షీణించసాగింది. మహాత్ముడైన దుర్వాసుడు శాపఫలితంగా యాదవులంతా పరస్పరం కలహించుకుని అంతమైపోయారు. భృగుమహర్షి శ్రీహరి వక్షఃస్థలాన్ని తన్నటంతో అక్కడే నివాసమున్న లక్ష్మీదేవి ఆ స్థానాన్ని వదిలి భూలోకంలో నివాసం ఏర్పర్చుకుంది. అష్టవసువులు కూడా మునుల శాపాలకి గురై భూలోకంలో మానవులుగా జన్మించారు.

ఈ విధంగా ఎంతోమంది మునుల, మహర్షుల శాపాలకి గురైనప్పటికీ మహాదేవుడు మాత్రం ముని శాపఫలాన్ని ఏమాత్రం పొందలేదని దారువన వృత్తాంతం తెలియచేస్తుంది. ఇలా శంకరుడు సుందరుడైన పురుషుడుగా, దిగంబరంగా సంచరించటాన్ని చూసి భరించలేని మునులు ఆయన్ని సామాన్య మానవుడిగా భావించి చూసి తిరిగి పరుషంగా నిందించటం ప్రారంభించగా వెంటనే శివుడు అక్కణ్ణుంచి అంతర్థానమయ్యాడు.

దానితో ఏంచేయాలో తోచక అందరూ సత్యలోకానికి వెళ్ళి బ్రహ్మదేవుడితో జరిగిన విషయాన్నంతా ఏకరువుపెట్టారు. వారి మాటలన్నీ విన్న బ్రహ్మ ఇదంతా పరమేశ్వరుడి లీలేనని గ్రహించి, మనసులోనే ఆయనకి భక్తిగా నమస్కరించాడు. "మునులారా! మీరెంత అవివేకులు. ఇహపర శ్రేయస్సుని కలిగించే పరమేశ్వరుణ్ణి గుర్తించలేని మీరు వ్యర్థంగా జన్మించారు. దారువనంలో మీకు కనిపించిన పురుషుడు సాక్షాత్తు శంకరుడే. మిమ్మల్ని పరీక్షించాలనే ఆయనక్కడికి వచ్చాడు.

గృహస్థుడైన తమ ఇంటికి వచ్చిన అతిథి ఎలాంటివాడైనా! ఏ రూపంలో ఉన్నా! అతన్ని గౌరవించాలి. అది అతిథిసేవా ధర్మం. ఆ ధర్మాన్ని మీరు విస్మరించారు. సుదర్శనుడనే ముని అతిథి సత్కారాన్ని నియమంగా ఆచరించి మృత్యువునే జయించాడు. ఆ విషయం చెబుతా వినండి.

పూర్వం సుదర్శనుడు అతిథి దేవుడితో సమానం అతడు ఏదికోరితే దాన్ని ఇచ్చేస్తాను నా సర్వస్వాన్నీ సమర్పిస్తాను అని ప్రతిజ్ఞ చేసాడు. ఒకనాడు తన భార్యతో 'వచ్చిన అతిథి ఎవరైనా సరే పరమేశ్వరుడుగా భావించి, అతడు కోరితే నీ దేహాన్నైనా సమర్పించాలి' అని ఆదేశించాడు. అది విన్న ఆ పతివ్రత "నాథా! మీరు చెప్పింది ధర్మ బద్ధం కాదని నాకనిపిస్తోంది. మరోసారి ఆలోచించండి" అని విన్నవించింది. అందుకు కోపం వచ్చిన సుదర్శనుడు భార్యతో "దేవీ! నేను చెప్పిందే శాసనం. అతిథి పరమేశ్వరుడే. అతడేదడిగితే అది నీవు ఇవ్వాల్సిందే అని గద్దించి చెప్పాడు.

అలా కొన్నాళ్ళు గడిచాక ఒకనాడు ధర్మదేవత బ్రాహ్మణుడి రూపంలో వారింటికి అతిథిగా వచ్చాడు. ఆ సమయంలో సుదర్శనముని గృహంలో లేడు. అతడి భార్య ఆయనకు స్వాగత సత్కారాలు చేసింది. ఆమె సేవలకి సంతోషించిన విప్రుడు "దేవీ! నీ భర్త ఇంట్లో లేనట్టున్నాడు" నీతో సంయోగం చెందాలని నా మనసు కోరుకుంటోంది" అన్నాడు. భర్త ఆజ్ఞని గుర్తు తెచ్చుకున్న ఆ పతివ్రత స్వామీ! మీ ఇష్టం ఈ శరీరాన్ని మీకు సమర్పిస్తున్నానని ముందుకు

వచ్చింది. అంతలో సుదర్శనుడు ఇంట్లోకి వచ్చాడు. లోపల అతిథిగా బ్రాహ్మణుడు కనిపించాడు. ఆయనకి భక్తితో నమస్కరించగా ఆ విప్రుడు సుదర్శనా! నాకు నీ భార్యతో రమించాలనుంది ఏమంటావు అన్నాడు. స్వామీ! అతిథి కోరిందేదీ నేను కాదనను తమరి ఇష్టం" అని చెప్పి బైటికి వెళ్ళబోయాడు.

సుదర్శనుడి ధర్మబుద్ధికి, అతిథిసేవాతత్పరతకి చలించిపోయిన ధర్మదేవత నిజరూపాన్ని ధరించి "సుదర్శనా! నేను నీ అతిథి ధర్మాన్ని పరీక్షించాలని ఇలా వచ్చాను. అతిథి మర్యాదా వ్రతాన్ని త్రికరణ శుద్ధిగా ఆచరించిన నీవు మృత్యువుని సైతం జయించగలవు. నీ గృహస్థధర్మం అమోఘం" అని అతన్ని, అతని భార్యని ఆశీర్వదించి ధర్మదేవత వెళ్ళిపోయాడు.

దారువనంలోని మునులారా! అతిథి ధర్మం అంతగొప్పది. అలాంటి గొప్ప ధర్మాన్ని విస్మరించి, అతిథిని అవమానించినందువల్లే మీమీ తపశ్శక్తి మొత్తం నశించింది. కనుక మీరు వెళ్ళి ఆ శంకరుణ్ణే శరణు వేడుకోండి" అని ప్రబోధించాడు. బ్రహ్మ మాటలు విన్న మునులంతా పశ్చాత్తాపపడి ప్రభో! నీకు నమస్కారం! ఓ ప్రజాపతీ! మా భార్యలందరూ కామవికారం చెందటంతో ఆవేశంగా మేము శంకరుణ్ణి పరుషంగా దూషించాం. ఎన్నో శాపాలు పెట్టాం. అయినా అవేవీ శంకరుడి ముందు ఏమాత్రం ప్రభావాన్ని చూపలేదు. ఇక మాకు జీవితాల మీద ఆశపోయింది. కర్మఫలాన్ని త్యాగం చేసి, ఆ మహేశ్వరుణ్ణి దర్శించే మార్గాన్ని తెలియచేయి" అని ప్రార్థించారు.

మునుల ప్రార్థన విన్న ప్రజాపతి వారితో మునులారా! నేను చెప్పేది శ్రద్ధగా వినండి. బ్రాహ్మణుడు ఉపనయనం అయ్యింది మొదలు వేదాల్ని, వేదాంగాల్ని, వేదార్థాన్ని ఆచార్యుడి దగ్గర సంపూర్ణంగా అభ్యసించి, స్నాతకుడై తరువాత వివాహం చేసుకుని భార్య ద్వారా సంతానాన్ని కని, వారందరికీ తన ఆస్థిని సమానంగా పంచేసి, అగ్నిష్టోమాది యాగాలతో యజ్ఞేశ్వరుడైన పరమేశ్వరుణ్ణి పది పన్నెండు సంవత్సరాలు ఆరాధించాలి. శక్తి లేనివాడు కనీసం ఒక సంవత్సరం గానీ లేక ఆరుమాసాలు గానీ, పన్నెండు రోజులుగానీ

పాలు మాత్రమే ఆహారంగా స్వీకరించి దేవతలందర్నీ పూజించాలి. ఆ తరువాత తన కోసం ఉంచుకున్న ధనాన్ని మొత్తం విప్రులకి ఇచ్చేసి, వైరాగ్య భావంతో గురువు దగ్గర సన్న్యాస దీక్షని స్వీకరించాలి.

**సన్న్యాసవిధి :** సన్న్యాసదీక్ష స్వీకరించేవాడు, శిఖతో సహా వెంట్రుకల్ని తీయించుకుని బోడిగుండుతో ఉండాలి. జంధ్యాన్ని విడిచిపెట్టి భూఃస్వాహా అనే పంచ సూక్తాలతో హోమం చేసి యతిగా మారి పుణ్యక్షేత్రాలలో సంచారం చేయాలి. ఇలా జీవించే యతి మరణం సమీపించకపోతే మహాప్రస్థానాన్ని ఆశ్రయించాలి. అనగా ఉపవాస దీక్షతో ఉత్తర దిశగా ప్రయాణించాలి. అలా ప్రయాణిస్తూ ఉంటే కొన్నాళ్ళకి అనాయాసంగా మరణం సంభవిస్తుంది. తద్వారా శివసాయుజ్యం కూడా కలుగుతుంది.

శివభక్తులు మాత్రం ఉపవాసదీక్ష, మహాప్రస్థానం లాంటివి ఆచరించక పోయినా ఈ శరీరం విడిచిపెట్టగానే మోక్షాన్ని పొందుతారు. నిజమైన శివభక్తులకి సన్న్యాసం, వ్రతాలు, యజ్ఞాలు, దానాలు, వేదశాస్త్ర పఠనాలు, ఇవేవీ అవసరంలేదు. పూర్వం శ్వేతుడనే ముని పరమేశ్వరుణ్ణి ఆరాధించి మృత్యువునే జయించాడు అని బ్రహ్మదేవుడు మునులకి ప్రబోధించాడు. వారంతా ఎంతో ఆసక్తిగా పితామహా! శ్వేతుడెవరు? అతడి వృత్తాంతం ఏమిటి? దయచేసి చెప్పు అని ప్రార్థించగా బ్రహ్మ వారికిలా శ్వేతుడి వృత్తాంతాన్ని చెప్పటం ప్రారంభించాడు.

## శ్వేతముని వృత్తాంతం

పూర్వం శ్వేతుడనే మహాముని ఉండేవాడు. ఆయన అల్పాయుష్కుడు. ఆ విషయం తెలుసుకున్న శ్వేతముని తనకి చిరంజీవిత్వం కలగాలని భావించి కొండగుహల్లో నివసిస్తూ అక్కడే ఒక శివలింగాన్ని ప్రతిష్ఠించుకున్నాడు. రుద్రాధ్యాయంతో నిత్యం ఆ లింగానికి పూజలు అభిషేకాలు చేస్తూ పరమేశ్వరుణ్ణి భక్తితో ఆరాధించసాగాడు. కొన్నాళ్ళు గడిచాక శ్వేతుడికి ఆయుష్షు తీరిపోగా యమధర్మరాజు అక్కడికొచ్చాడు. యముణ్ణి చూసి కూడా ఏమాత్రం భయపడకుండా శ్వేతముని త్ర్యంబక మంత్రాన్ని నిష్ఠగా జపిస్తూ మృత్యువు నన్నేం చేయలేదు" అని ధైర్యంగా ఉన్నాడు.

శ్వేతముని దగ్గరకొచ్చిన యముడు గంభీరంగా "శ్వేతమునీ! నీ ఆయుర్దాయం ముగిసింది. ఇక లేచిరా! నాకిప్పుడు శివారాధనతో పనేమిటి? త్రిమూర్తులు కూడా నేను తీసుకెళ్ళాలనుకున్నవాణ్ణి రక్షించలేరు. లే! లేచిరా!" అని గట్టిగా పిలిచాడు.

యముడి మాటలు వినగానే శ్వేతమునికి మనసులో భయం కలిగింది. దుఃఖంతో "శంకరా! శరణాగత వత్సలా! దీనబంధూ! నన్ను రక్షించు" అని ప్రార్థించి కొంత ధైర్యం తెచ్చుకున్నాడు. వెంటనే యముడితో "ధర్మరాజా! నన్ను తీసుకెళ్ళటం వల్ల నీకేం ప్రయోజనం? మహాదేవుడి లింగాన్నే నేను నిత్యం పూజిస్తున్నాను. ఆయన్నే నమ్ముకున్నాను. నాకేం భయంలేదు. నాలాంటి శివభక్తుల్ని ఆ శంకరుడే రక్షిస్తాడు. శివభక్తుడికి బ్రహ్మ రాసిన రాత కూడా నిరుపయోగమవుతుంది" అని అన్నాడు.

శ్వేతుడి సమాధానం యముడికి ఆగ్రహం కలిగించింది. తీక్షణమైన కోరలతో భయంకరమైన సింహనాదం చేస్తూ తనకి ఎదురు సమాధానం చెప్పిన శ్వేతమునిని తన పాశంతో బంధించాడు. "ఓయీ! శ్వేతా! ఇదిగో నిన్ను ఇలా బంధించి తీసుకెళుతున్నా ఇప్పుడు నీ శంకరుడు ఏం చేస్తాడు? అసలు ఆ మహాదేవుడు ఎక్కడున్నాడు? నేనెక్కడా! నీ శంకరుడెక్కడా! నేను మృత్యుదేవతని. నాకెదురే లేదు. నేనెవరికీ భయపడను. నీవు ఇన్నాళ్ళు పూజించిన శివలింగం నిన్ను ఏమాత్రం రక్షించలేదు. ఇక నీవు ఈ పూజలు అభిషేకాలు చేసి ఏం ప్రయోజనం?" అని దురహంకారంతో పలికి శ్వేతుణ్ణి బంధించి అతడి ప్రాణాలు తీయబోతున్నాడు. అంతలో....

త్వరన్ వినిర్గతః పరః శివస్స్వయం త్రిలోచనః ।
త్రియంబకోऽంబయాసమం సనందినా గణేశ్వరైః ॥

త్ర్యంబకుడైన పరమేశ్వరుడు పార్వతితో, నందితో, ప్రమథగణాలతో శ్వేతుడు పూజించిన శివలింగం నుంచి ఆవిర్భవించాడు. మహాభీకరంగా ఎంతో క్రోధంతో ఉన్న శివుడి ఉగ్రరూపాన్ని చూసి గుండె ఆగిపోయిన యముడు

ఒక్కసారిగా భయంతో క్రిందపడి మరణించాడు. శ్వేతుడు తన ఇష్టదైవాన్ని ప్రత్యక్షంగా దర్శించిన ఆనందంతో శంకరా! హరహర మహాదేవా! శరణు! శరణు! అని ప్రార్థించాడు.

సమవర్తి అయిన యముడు మరణించటంతో దేవతలంతా ఎంతో ఆందోళన చెందారు. ధర్మం అస్తవ్యస్తమవుతుందని భావించి అందరూ కలిసి యముణ్ణి బ్రతికించమని శివుణ్ణి కోరారు. దేవతల విన్నపాన్ని మన్నించి తన కంటిచూపుతో యముణ్ణి తిరిగి బ్రతికించాడు. తననే త్రికరణ శుద్ధిగా నమ్ముకున్న శ్వేతమునిని కరుణించి ఆయనకి చిరంజీవిత్వాన్ని అనుగ్రహించాడు. కనుక మునులారా! మీరంతా 'త్రయంబకం' మంత్రాన్ని త్రికరణ శుద్ధిగా ఏకాగ్రతతో జపించి, ఎలాంటి దుఃఖాలు లేక ఆనందాన్ని పొందండి" అని చెప్పి బ్రహ్మదేవుడు వారిని సముదాయించాడు. మునులందరూ బ్రహ్మ చెప్పిన శ్వేతముని వృత్తాంతాన్ని విని ఎంతో ఆనందించారు. తిరిగి ఆయనతో "విధాతా! మా మీద ఎంతో దయతో మా అవివేకాన్ని పోగొట్టావు. మాకొక సందేహం! శివుడి మీద భక్తి దేనివల్ల కలుగుతుంది? యజ్ఞం-తపస్సు-వ్రతం అనేవాటిలో దేనిద్వారా శివభక్తి మాలో పెంపొందుతుంది? అని ప్రశ్నించారు.

మహర్షులారా! మీకు దానం, తపస్సు, స్వాధ్యాయం, యజ్ఞయాగాలు, ప్రాణాయామాది యోగాలు వీటిని ఆచరించటం వల్ల శివభక్తి కలగదు. "ప్రసాదేనైవ సా భక్తిః శివే పరమకారణే". ఈ చరాచర ప్రపంచానికి మూలకారకుడైన శివుడి మీద ఏకాగ్రభక్తి అనేది కేవలం శివానుగ్రహంతోనే లభిస్తుంది. కనుక మీరంతా శివానుగ్రహం కోసం ప్రయత్నించండి" అని చెప్పాడు బ్రహ్మదేవుడు. ఆ మాటలు విని ఎంతో ఆనందించిన మునులు, ఋషులు, తమ తమ పత్నులతో సహా ఆయనకి భక్తిగా నమస్కరించారు.

## మునులు దారువనం చేరి శివుణ్ణి అర్చించటం

బ్రహ్మదేవుడి ద్వారా పరమేశ్వరుడి గొప్పతనాన్ని ఆయన్ని పూజించే విధానాన్ని, ఆయన అనుగ్రహం పొందేందుకు పాటించాల్సిన విధుల్ని తెలుసుకుని

అందరూ తిరిగి దారువనానికి వచ్చారు. అందరూ తమ తమ భార్యలతో కలిసి ఆ వనంలోని వివిధ ప్రదేశాలలో శివుణ్ణి ప్రతిష్ఠించుకుని పూజ, జప, ధ్యానాల తో ఆయన్ని ఆరాధించసాగారు. అలా సంవత్సరకాలం గడిచింది. వసంత ఋతువు ప్రారంభమైంది. అప్పుడు శివుడు వారి భర్తని పరీక్షించాలని ఒంటినిండా విభూతి పూసుకుని, నగ్నంగా వికారమైన రూపంతో వారి ముందుకొచ్చాడు. వారిని భయపెడుతూ వికృతంగా ఆడుతూ, పాడుతూ అరుస్తూ ఇలా చిత్ర విచిత్ర విన్యాసాలు చేయటం ప్రారంభించాడు. వారి ఆశ్రమాల చుట్టూ నగ్నంగా తిరుగుతూ యాచించ సాగాడు.

పరమేశ్వరుడు ఎన్ని రకాలుగా ప్రలోభపెట్టినా, ఎన్ని రకాలుగా భయాన్ని అసహ్యాన్ని కలుగచేసినా ఆ మునులంతా వివేకంతో ఆ వచ్చింది పరమేశ్వరుడేనని గ్రహించి, ఆ వికృతాకారంలో ఉన్న ఆ పురుషుణ్ణి పిలిచి ఆసనం మీద కూర్చోపెట్టి నీళ్ళతో ఆయన పాదాలు కడిగి భస్మాన్ని, గంధపుష్పాక్షతల్ని, పూలమాలల్ని బిల్వదళాల్ని, ధూపదీపనైవేద్యాల్ని సమర్పించారు. తమ భార్యా పుత్రులతో బంధుమిత్ర పరిజనాలతో కలిసి ఎంతో వినయంగా ఆయనకి నమస్కరించి ఎంతో ఘనంగా స్తుతించారు.

"పరమేశ్వరా! కరుణారస సింధూ! మేము అవివేకంతో, మా మనోవాక్కాయాల ద్వారా చేసిన పాపాల్ని క్షమించు. నీ దివ్య చరిత్ర విచిత్రం రహస్యం. బ్రహ్మాదులకి కూడా అది తెలీదు. నీ మార్గాన్ని ఎవరం తెలుసుకోలేము! విశ్వేశ్వరా! నీవెలాంటివాడివో ఎవరికీ తెలియదు. మహాత్ములు నిన్ను నిత్యం పొగడుతూ వుంటారు.

భవ్యుడు, భవుడు, భావనుడు, అనంత బలవీర్యం కలిగిన వాడు, భూతపతి, సంహారకుడు, పిశంగుడు (గోరోచనంలాంటి కళ్ళు కలిగినవాడు) అవ్యయుడు, జగత్తుకి ఆధారమైనవాడు, త్రిగుణాత్మకుడు, సత్త్వరజస్తమో గుణాలతో నిండిన త్ర్యంబకుడు, త్రినేత్రుడు, త్రిశూలాన్ని ధరించినవాడు, కందర్పుడు, హుతాశనుడు, పరమాత్మ శంకరుడు, వృషాంకుడు, గణాధిపతి, కాలుడు, దండహస్తుడు, శతజిహ్వుడు, పాశహస్తుడు వేదమంత్రాలు స్తుతించే

ప్రధానదైవం అనే విశేషణాలు నీకే సరిపోతాయి. ప్రభూ! భూత భవిష్యత్ వర్తమాన కాలాలలో ప్రవర్తించే ఈ సకల సృష్టి నీ దివ్య శరీరం నుంచే ఆవిర్భవిస్తోంది. మానవులందరూ తెలిసీ తెలియక చేసే పనులన్నిటినీ నీవే చేయిస్తున్నావు". ఈ విధంగా మునులందరూ స్తుతించగా పరమేశ్వరుడికి ఎంతో ఆనందం కలిగింది. వారందరూ తాము చేసిన పనికి పశ్చాత్తాపం చెందారని గ్రహించాడు. తన నిజరూపాన్ని దర్శించేందుకు వారికి దివ్యదృష్టిని ప్రసాదించగా, మహాదేవుడి ద్వారా దివ్యదృష్టిని పొందిన వారంతా ఆయన దివ్యమంగళ విగ్రహాన్ని దర్శించి తన్మయులై మంగళకరమైన వాక్యాలతో తిరిగి ఇలా కీర్తించారు.

నీలకంఠాయ దేవాయ చితాభస్మాంగధారిణే ।
త్వం బ్రహ్మ సర్వదేవానాం రుద్రాణాం నీలలోహితః ॥

పరమేశ్వరా! అమరుల్లో నీవు బ్రహ్మవి, రుద్రుల్లో నీలలోహితుడివి, ప్రాణులందరిలో జీవాత్మవి, సాంఖ్యయోగులందరూ నిన్ను పురుషుడంటారు. పర్వతాలలో నీవు మేరువువి. నక్షత్రాల్లో చంద్రుడివి, ఋషుల్లో వశిష్ఠుడివి, దేవతల్లో దేవేంద్రుడివి. సమస్తవేద వాఙ్మయంలో ఓంకారానివి, వేదసూక్తాలలో శ్రేష్ఠమైన సామసూక్తానివి. అరణ్యంలో సంచరించే మృగాలలో సింహానివి, గ్రామాల్లో సంచరించే పశువుల్లో వృషభానివి, లోకులందరూ పూజించే దేవుళ్ళలో అగ్రగణ్యుడివి, ప్రభూ! మేమంతా నీ దాసులం మేమంతా తరించటానికి ఏం చేయాలో ఆజ్ఞాపించు. నీ ఆద్యంతాలు మేము తెలుసుకోలేము. మమ్మల్ని అనుగ్రహించు" అని శివుడి పాదాల మీద పడ్డారు.

వారందరి ప్రార్థన విన్న శివుడు సంతోషించి పరమపవిత్రమైన పాశుపత వ్రతాన్ని అలాగే భస్మస్నాన విధిని వారికి వివరించాడు.

## దధీచి - క్షుపుల వృత్తాంతం

పూర్వం బ్రహ్మదేవుడి కుమారుడైన క్షుపుడు తన పరాక్రమంతో భూమండలాన్ని సుక్షత్రియుడుగా పాలిస్తున్నాడు. ఆయనకి మహాతపస్వి అయిన

దధీచి మునితో స్నేహం ఏర్పడింది. అది దినదిన ప్రవర్ధమానమైంది. ఒకనాడు వారిద్దరికీ మధ్య విప్రుడు గొప్పవాడా? లేక క్షత్రియుడు గొప్పవాడా? అన్న విషయం చర్చకు వచ్చింది. ఆ విషయం మీద వారిద్దరికీ వాగ్వాదం జరిగింది.

క్షుపుడు–నేను అష్టదిక్పాల అంశతో, శ్రీహరి అంశతో జన్మించిన క్షత్రియుణ్ణి కనుక నన్ను నీవు పూజించాలి. నీ కన్నా నేనే గొప్ప అని అహంకారంతో వాదించాడు. క్షుపుడి మాటలు విన్న దధీచి మహర్షికి ఆగ్రహం కలిగింది. వెంటనే తన పాదాలతో క్షపుణ్ణి ఒక్క తన్ను తన్నాడు. దాంతో క్షపుడికి కూడా ఆవేశం వచ్చింది. పూర్వం తనకు దేవేంద్రుడు ప్రసాదించిన వజ్రాయుధాన్ని తీసుకుని దాంతో క్షుపుణ్ణి గట్టిగా కొట్టాడు. దాని దెబ్బకి తాళలేక దధీచి క్రింద పడిపోయి శుక్రాచార్యుణ్ణి స్మరించాడు.

అలా ధదీచి రెండు భాగాలుగా ఖండించబడి మరణించగా చనిపోయే ముందు ఆయన చేసిన ప్రార్థన విని శుక్రాచార్యుడు రహస్యంగా అక్కడికొచ్చి రెండుగా చీలిన ఆయన శరీరభాగాల్ని ఒకటిగా కలిపి తన మృత సంజీవనీ విద్యతో పునర్జీవితుణ్ణి చేసాడు. ప్రాణాలు తిరిగి వచ్చి పైకి లేచిన దధీచితో....

మహర్షీ! బ్రహ్మాదివంద్యుడు, దేవదేవుడు అయిన పరమేశ్వరుణ్ణి ఆరాధించి ఎవరిచేతా వధించబడకుండా మృత్యువుని జయించు. ఈశ్వరోపాసన వల్ల అది నీకు సాధ్యమవుతుంది. పూర్వం మహేశ్వరుడు నాకీమృత సంజీవనీ విద్యని ఉపదేశించటం వల్లనే నేను నిన్ను బ్రతికించగలిగాను. నేను కూడా మృత్యువుని జయించాను. శివభక్తులైన వారికి ఎప్పటికీ మృత్యుభయం ఉండదు. నీకు మృత సంజీవని అయిన త్ర్యంబక మంత్రాన్ని ఉపదేశిస్తున్నాను అని ఆయనకి ఈ మంత్రాన్ని ఉపదేశించాడు.

**మృత్యుంజయ మహామంత్రం :**

**"త్ర్యంబకం యజమాహే సుగంధి పుష్టివర్ధనం**

**ఉర్వారుకమివ బంధనాత్ - మృత్యోర్ముక్షీయ మామృతాత్"**

**మంత్రార్థం :** త్ర్యంబకం – ముల్లోకాలకీ తండ్రి అయినవాడు. అలాగే సూర్య, చంద్ర, అగ్నులకి జనకుడు. సత్త్వరజస్తమో గుణాల్ని అధిష్ఠించేవాడు. మనో, బుద్ధి, అహంకారాలని ప్రచలింపచేసేవాడు. గార్హపత్య, ఆహవనీయ, దక్షిణాగ్నిస్వరూపుడు.బ్రహ్మ, విష్ణు, రుద్రులకి జనకుడు. ఋక్, యజుర్, సామవేదాలకి ప్రణేతగా ఉన్నవాడు అని అర్థం. (ఇక్కడ త్రి అనగా మూడు అని అంబక అనగా – తండ్రి అధిష్ఠాత, ప్రేరకుడు, స్వరూపం, ప్రణేత అనే అర్థాలు గ్రహించాలి)

**సుగంధిం :** అనగా సుగంధం కలిగినవాడు. ఇక్కడ సుగంధం అంటే ప్రాణులందరిలో, త్రిగుణాలలో, మూల ప్రకృతిలో, ఇంద్రియాలలో, దేవతలలో, ప్రమథగణాలలో పరమేశ్వరుడు పూలలో ఉన్న పరిమళంలాగా సూక్ష్మరూపంతో ఉంటాడు అని భావం. పరిమళాన్ని మనం ముక్కుతో గ్రహించినట్టు, శుద్ధమైన మనసుతోనే పరమేశ్వరుణ్ణి గ్రహించాలి.

**పుష్టి –** అనగా పురుషుడి ప్రకృతి – అలాంటి ప్రకృతిని బ్రహ్మాది దేవతలకు వారి శరీర వాఙ్మనో బలాలని

**వర్ధనం –** అనగా పెంపొందించే, **అమృతాత్ –** నాశనంలేని దేవుణ్ణి **యజామహే –** పూజిస్తున్నాము లేక ఉపాసిస్తున్నాము.

ఈ విధంగా ఉపాసించబడే నాశరహితుడైన భగవంతుడు (శివుడు) **మృత్యోః –** అనగా యమపాశాల నుంచి, **ముక్షీయాత్ –** విడిపించుగాక! ఏవిధంగా అంటే **'ఉర్వారుక మివ బంధనాత్' – బంధనాత్ –** తొడిమనుంచి, **ఉర్వారుకమివ –** దోసపండులాగా అనిభావం.

**మంత్రభావం –** ముల్లోకాలకీ తండ్రి అయినవాడు సుగంధం కలిగినవాడు, దేవతలందరికీ జీవులందరికీ పుష్టిని(బలాన్ని) పెంపొందించేవాడు, మృత్యువన్నదే లేనివాడు అయిన (పరమేశ్వరుణ్ణి) భగవంతుణ్ణి పూజిస్తున్నాను. ఆయన దోసతీగనుంచి పండిన దోసకాయ విడిపోయినట్టు, మృత్యుపాశం నుంచి నన్ను కూడా విడిపోయేట్టు చేయుగాక!

పరమేశ్వరుడి సన్నిధిలో ఈ మృత్యుంజయ మంత్రంతో అభిమంత్రించిన నీళ్ళని త్రాగుతూ, ఇదే మంత్రాన్ని జపిస్తూ హోమం చేస్తే అపమృత్యుభయం ఎప్పటికీ కలగదు" అని శుక్రాచార్యుడు దధీచికి బోధించాడు.

ఈవిధంగా శుక్రాచార్యుడి ద్వారా మంత్రోపదేశం పొందిన దధీచిమహర్షి, ఆయన చెప్పినట్టుగా మృత్యుంజయమంత్రాన్ని సాధనచేసి సిద్ధిపొందాడు. తద్వారా ఆయన శరీరం అవధ్యత్వాన్ని, వజ్రంలాంటి ఎముకల్ని పొంది ఎంతో దృఢంగా తయారయ్యింది. అలా సంపూర్ణంగా బలం చేకూరాక దధీచి క్షుపుడి దగ్గరకెళ్ళి మరోసారి ఆగ్రహంగా అతన్ని ఒక్క తన్ను తన్నాడు. క్షుపుడు కూడా తిరిగి వజ్రాయుధంతో దధీచిని ఖండించబోగా అది ఆయన శరీరానికి తగిలి వంకర పోయింది. దానితో దధీచి మహర్షికి శివానుగ్రహం లభించిందని గ్రహించి క్షుపుడు వెనుతిరిగి పోయాడు.

## క్షుపుడికి దధీచి వల్ల పరాభవం

క్షుపుడు దధీచి మహర్షి వల్ల అవమానించబడి ఎంతో ఏకాగ్రతతో నారాయణుడి గురించి తపస్సుచేసాడు. ఎన్నో సంవత్సరాలు గడిచిపోయాయి. ఒకనాడు శంఖ చక్ర గదాధరుడై, సర్వాలంకార సంశోభితంగా శ్రీహరి అతడికి దర్శనమిచ్చాడు. వెంటనే ఆయన పాదాల మీద పడి "నారాయణా! పరంధామా! పరాత్పరా! నీవు ప్రకృతితో కలిసిన పురుషుడివి. మహత్తత్త్వం, అహంకారం, పంచతన్మాత్రలు, జ్ఞానకర్మేంద్రియాలు అంతా నీవే. నన్ను రక్షించు" అని ప్రార్థించాడు. శ్రీహరి క్షుపా! నీకేం కావాలో కోరుకో. అనగా – ప్రభూ! దధీచి ముని అనే విప్రోత్తముడు పూర్వం నాకు మిత్రుడుగా ఉండేవాడు. నాకు అతడికి ఒకనాడు చిన్న వాగ్వివాదం జరిగింది. దానికి కోపించిన అతడు అహంకారంతో నన్ను కాలెత్తి తన్నాడు. నేను శివవరప్రసాదుణ్ణి ఎవరికీ భయపడను అని గర్వంగా చెప్పి వెళ్ళాడు. స్వామీ! నేనతన్ని ఎలాగైనా ఓడించాలి. అందుకు తగ్గ వరాన్ని ప్రసాదించు" అని కోరాడు. క్షుపుడి కోరిక విన్న శ్రీహరి మనసులో శంకరుణ్ణి స్మరించి అతడితో ఇలా అన్నాడు.

"రాజేంద్రా! శివభక్తులైన వారు ఎవరికీ దేనికీ భయపడరు. ఎంతటి అధముడైనా శివభక్తి తత్పరుడైతే చాలు. అతడికి ఎలాంటి భయం కలగలేదు. ఇక దధీచిలాంటి మహర్షుల గురించి చెప్పేదేముంది. కనుక దధీచిమీద నీవు విజయం పొందటం కష్టం. దధీచిమహర్షి సామాన్యుడు కాదు. పూర్వం దక్షయజ్ఞం జరిగిన సందర్భంలో ఆయన శాపం వల్లే నాకు మూర్ఛావస్థ కలిగింది. తిరిగి ఆయన వల్లే మేలుకో గలిగాను. అయినప్పటికీ నీ భక్తి ప్రపత్తులు నన్నానందింప చేసాయి. అందుకే నీ విజయం కోసం ప్రయత్నిస్తాను" అని చెప్పాడు.

క్షుపుడికిచ్చిన మాట ప్రకారం శ్రీహరి ఒక వృద్ధ బ్రాహ్మణుడి వేషాన్ని ధరించి దధీచి మహర్షి ఆశ్రమానికి వెళ్ళాడు. వచ్చిన అతిథికి దధీచి స్వాగత సత్కారాలు చేసి నమస్కరించగా అప్పుడు బ్రాహ్మణుడి రూపంలో ఉన్న శ్రీహరి దధీచీ! నాకొక వరాన్ని ప్రసాదించు" అని కోరాడు.

తపోసంపన్నుడు త్రికాలజ్ఞుడైన దధీచి వచ్చిన విప్రుడు శ్రీహరేనని గుర్తించి "ప్రభూ! నీవు శ్రీహరివేనని నాకు తెలుసు. క్షుపుడు నిన్నారాధించగా అతడి కోరిక తీర్చటం కోసం నా దగ్గరకొచ్చావు. నాకెవరివల్లా దేనివల్లా భయంలేదు. నీకేం కావాలో అడుగు స్వామీ!" అని అన్నాడు.

దధీచి తనని గుర్తు పట్టటంతో నిజరూపాన్ని ధరించిన శ్రీహరి! నీవు శివభక్తి ప్రభావంతో సర్వజ్ఞుజడి వయ్యావు. నీకెవరన్నా భయంలేదని నాకు తెలుసు. అయితే నేను నా భక్తుడైన క్షుపుడికి మాటిచ్చాను. ఒక్కసారి క్షుపుడిసభలోకి వచ్చి 'నీవల్ల నేను భయపడతాను' అని ఒక్కమాట అను చాలు అని ప్రాధేయపడ్డాయి. అయితే శివానుగ్రహం పొందిన దధీచి అందుకంగీకరించలేదు. అసత్యాన్ని పలకనన్నాడు. అలా దధీచి తిరస్కరించేసరికి శ్రీహరికి ఆగ్రహం కలిగి తన సుదర్శనచక్రాన్ని అతడి మీదకి ప్రయోగించాడు.

మహావేగంతో వచ్చిన సుదర్శన చక్రం దధీచి మహర్షి శరీరాన్ని తాకి వజ్రశరీరుడు కావటంతో అతన్ని ఏకొంచెం కూడా గాయపరచలేకపోయింది.

అప్పుడు దధీచి ప్రభూ! శ్రీహరీ! నీ సుదర్శన చక్రం కూడా శివుడు ప్రసాదించిందే కాబట్టి అది నన్నేం చేయలేదు. నీవు వ్యర్థ ప్రయత్నం దయచేసి చేయవద్దు అన్నాడు. దాంతో కోపం మరింత పెరిగిన శ్రీహరి ఎన్నో శస్త్రాస్త్రాల్ని దధీచి మీదకి ప్రయోగించాడు. అవన్నీ దధీచిని ఏమీ చేయలేకపోయాం. విష్ణువు పిలుపు విని దేవతలంతా ఆయనకి అండగా వచ్చారు. అంతా కలిసి మూకుమ్మడిగా దధీచిపై దాడి చేసారు. అప్పుడు దధీచి తన దర్భముడిని తీసి దేవతలమీదకి విసిరాడు. అది ప్రళయాగ్ని జ్వాలలు వెదజల్లుతూ త్రిశూలంలా మారి దేవతలందర్నీ కాల్చటం మొదలుపెట్టింది.

ఆ విధంగా నారాయణుడు దేవేంద్రాదులు ప్రయోగించిన అస్త్రాలన్నీ విఫలం కావటంతో అంతా ఆ త్రిశూలాన్ని శరణువేడి తలో దిక్కుకీ పారిపోయారు. అది చూసిన శ్రీహరి ఆగ్రహంతో తన శరీరం నుంచి లక్షలాది నారాయణ గణాల్ని సృష్టించి దధీచి మీదకి పంపించాడు. దధీచి వారందర్నీ దహింపచేసాడు. అప్పుడు శ్రీహరి తన విశ్వరూపాన్ని ధరించి కోట్లకొద్దీ బ్రహ్మాండాల్ని కోట్లకొద్దీ దేవతాగణాల్ని దధీచికి చూపించాడు. అంతా చూసిన దధీచి ఏమాత్రం భయపడకుండా నారాయణా! నీ మాయ చాలించి నిజరూపంతో వచ్చి నాతో పోరాడు అని కోరాడు.

నారాయణుడు నిజరూపాన్ని ధరించి దధీచి ముందుకి రాగా దధీచి తన శరీరంలో అనంతకోటి బ్రహ్మాండాలని, కోట్లాది దేవతా గణాల్ని ప్రదర్శించాడు. శ్రీహరి దధీచిలో వున్న విశ్వాన్ని దర్శించి ఆయన గొప్పతనాన్ని ప్రశంసించి వైకుంఠానికి వెళ్ళిపోయాడు.

ఈ విషయమంతా క్షుపుడికి తెలిసింది. తన కోరికని సఫలం చేయటం కోసం శ్రీహరి సైతం దధీచి ముందు అవమానం పాలయ్యాడని గ్రహించి, వెంటనే దధీచి దగ్గరకొచ్చాడు. క్షమించమని ఆయన పాదాల మీద పడ్డాడు. అప్పుడు దీనుడై నిలిచిన క్షుపుణ్ణి మాత్రం క్షమించి తన మీద అకారణంగా దాడిచేసిన విష్ణువుతో సహాదేవతలందర్నీ “మీరంతా రాబోయేకాలంలో

దక్షప్రజాపతి చేసే యాగంలో పాల్గొంటారు. అప్పుడు రుద్రుడి కోపాగ్ని జ్వాలల్లో దగ్ధమైపోతారు" అని శపించాడు. తిరిగి క్షుపుడితో రాజేంద్రా! ఎప్పటికైనా యోగ్యులైన విప్రులే దేవమానవ పూజ్యులు. ఈ విషయం గ్రహించు అని హితబోధ చేయగా క్షుపుడు అందుకంగీకరించి ఆయనకి నమస్కరించి తిరిగి తన రాజ్యానికి వెళ్ళిపోయాడు.

ఈ దధీచి–క్షుపుల సంవాదం, విష్ణుమూర్తికి పరాభవం జరిగిన ప్రదేశం, దేవతలకి దధీచి శాపమిచ్చిన ప్రాంతం స్థాణేశ్వరం. అక్కడే పరమేశ్వరుడు స్థాణేశ్వరలింగంగా వెలిశాడు. ఆ శివలింగాన్ని దర్శించి, పూజించినవాడు శివలోకాన్ని చేరుకుంటాడు.

క్షుప–దధీచి సంవాదాన్ని చదివినవారు, విన్నవారు, బోధించినవారు అపమృత్యు బాధల నుండి విముక్తులై శరీరం పతనం చెందాక కైలాసాన్ని చేరుకుంటారు. ఈ వృత్తాంతాన్ని పఠించి యుద్ధానికి వెళ్ళితే జయం తప్పక వర్తిస్తుంది.

## యుగ ధర్మాలు

కృతయుగం, త్రేతాయుగం, ద్వాపర యుగం, కలియుగం అని యుగాలు నాలుగు. వీటిలో కృతయుగంలో ధర్మం నాలుగు పాదాలతో ఉంటే త్రేతాయుగంలో మూడు పాదాలతోనే నడుస్తుంది. ద్వాపరంలో రెండు పాదాలతో ఉంటే అదే ధర్మం కలియుగం వచ్చే సరికి ఒక పాదంతో కుంటిదైపోతుంది.

**కృతయుగం :** కృతయుగంలో స్త్రీలు, పురుషులు మధురాది రసాలు ఆస్వాదించటంతోనే జన్మిస్తారు. ప్రజలంతా సంతృప్తి చెంది ఎంతో ఆనందంగా జీవితాన్ని అనుభవిస్తారు. అందరూ దీర్ఘాయుష్మంతులే. ఎవరికీ అకాల మృత్యువు సంభవించదు. రాగద్వేషాలు అసలే ఉండవు. ప్రజలంతా పర్వతాల మీద నివసిస్తూ ఎలాంటి దుఃఖాలు లేకుండా, సత్త్వగుణ ప్రధానులై ఉంటారు. పుణ్యపాపరహితులై జీవిస్తారు. ఆ యుగంలో వర్ణ సంకరం అనేదే ఉండదు.

**త్రేతాయుగం :** ఈ యుగంలో రసోల్లాసం నశిస్తుంది. మేఘాలద్వారానే నీళ్ళు లభిస్తాయి. వర్షం ద్వారా భూమిమీద ఆవిర్భవించే చెట్లని ఆధారం చేసుకుని మానవులు జీవిస్తారు. ప్రజలు అన్ని రకాల వృత్తుల్నీ అనుభవిస్తారు. వృక్షాల ద్వారా లభించే పూలతేనెని ఆస్వాదిస్తారు. వాటితో పాటు ఈగల ద్వారా (తేనెటీగలు) వచ్చిన తేనెని కూడా త్రాగి రాగద్వేషాలకు లోనై తపస్సు ఆచరించటానికి కష్టపడుతుంటారు. కాలక్రమంలో భూమిమీద వృక్షసంతతి తగ్గిపోవటంతో ప్రజలు కొండల మీద గృహాలు నిర్మించుకుని నివసిస్తారు.

ఆ యుగంలో వర్షజలాల వల్ల చిన్న చిన్న నదులు ఏర్పడతాయి. భూమి మీద నీరు ఉండటం వల్ల భూమినుంచి ఓషధులు పుడతాయి. స్వల్పంగా కృషిచేస్తే చాలు పంటలు అధికంగా పండుతాయి. ఓషధులు ధాన్యాలతోనే ప్రజల జీవనం కొనసాగుతుంది. మానవులందర్నీ రక్షించటం కోసం బ్రహ్మదేవుడు క్షత్రియ జాతిని సృష్టిస్తాడు. క్షత్రియులు బ్రాహ్మణులతో యజ్ఞయాగాది క్రతువులు చేయిస్తుంటారు.

**ద్వాపరయుగం :** ఈ యుగంలో మానవులందరికీ బుద్ధిభేదం కలుగుతుంది. దానితోపాటు శరీర పరిశ్రమకూడా అధికమవుతుంది. ప్రజల్లో లోభగుణం, మాత్సర్యం అధికంగా ఉంటాయి. ఒకటిగా వున్న వేదరాశిని వ్యాసుడు విభజిస్తాడు. ఋషిపుత్రులు వేదాల్ని ఎన్నో రకాలుగా వ్యాఖ్యానిస్తారు. ఉపనిషత్తులు, బ్రాహ్మణాలు, కల్పసూత్రాలు, గృహ్యసూత్రాలు, పూర్వ-ఉత్తర మీమాంసలు అని వేద వాఙ్మయంలో విభాగాలేర్పడతాయి.

ఇతిహాసాలు-పురాణాలు వేరుగా విభజించబడతాయి. వీటిలో పురాణాలు 1.బ్రహ్మం 2.పాద్మం 3.వైష్ణవం 4.శైవం 5.భాగవతం 6.భవిష్యం 7.నారదీయం 8.మార్కండేయం 9.ఆగ్నేయం 10.బ్రహ్మవైవర్తం 11.లైంగం 12.వరాహం 13.వామనం 14.కూర్మం 15.మాత్స్యం 16.గారుడం 17.స్కాందం 18.బ్రహ్మాండం అని 18గా విభజించబడ్డాయి. వర్షాలు లేకపోతే ఈ యుగంలో ప్రజలు మరణిస్తారు. వ్యాధులు, ఉపద్రవాలు వీటివల్ల నిర్వేదం కలుగుతుంది. జ్ఞాన యోగాన్ని చాలామంది అవలంబిస్తారు.

**కలియుగం :** కలియుగం చాలా భయంకరమైనది. మానవులలో కపటం, ఓర్వలేనితనం, దైవభక్తుల్ని వధించటం, తమోగుణం పెరిగిపోవటం, పొరపాట్లవల్ల రోగాల బారిన పడటం,కరువు, యుద్ధభయాలు, ఆకలిచావులు, వేదాల మీద విశ్వాసం లేకపోవటం, నాస్తికత్వం, అనాచారం, వితండవాదం, క్రోధం, అసత్యాలాడటం, దుష్టసంతానం, బ్రాహ్మణులు వర్ణాశ్రమ ధర్మాల్ని పాటించక పోవటం, అలాగే క్షత్రియులు వైశ్యులు కూడా స్వధర్మ భ్రష్టులవటం, శూద్రులకి బ్రాహ్మణులు మంత్రాలు చెబుతూ వారి పక్కనే కూర్చోవటం, శూద్రులు రాజులై విప్రుల్ని బాధించటం, గర్భస్రావాలు, శిశుహత్యలు, వ్యభిచారాలు అధికం కావటం ఇవన్నీ కలియుగంలో జరిగే దారుణ సంఘటనలు.

## మేరు పర్వత వైభవం

భూలోకంలోని జంబూద్వీపం మధ్యలో మేరుపర్వతం నెలకొంది. రత్నమయమైన శిలలతో 84 లక్షల యోజనాల ఎత్తులో ఉన్న ఆ మేరు పర్వతం భూమిలో పదహారు యోజనాల లోతులో పాదుకొని ఉంటుంది. దాని క్రిందాపైనా వైశాల్యం 96 యోజనాలు కాగా దాని వెడల్పు లక్షయోజనాలు ఉంటుంది. ఆ పర్వతం పరమేశ్వరుడి దివ్యమైన శరీరాన్ని తాకటం వల్ల బంగారు వర్ణాన్ని పొందింది. అంతేకాదు సమస్త దేవతలకీ నివాసయోగ్యంగా, అమరులంతా విహరించే మనోహరమైన పర్వతంగా విరాజిల్లింది. ఇంతటి ఉన్నతమైన పర్వతాన్ని ఆదిశేషుడు మోస్తూ ఉంటాడు.

మేరు పర్వతం తూర్పుభాగంలో, పద్మరాగ కాంతి, దక్షిణ భాగంలో బంగారు రంగుకాంతి, పడమర భాగంలో నల్లటి కాంతి, ఉత్తరభాగాన పగడపు వర్ణం కాంతి వెలుగొందుతూ ఉంటుంది. ఆ పర్వతం మీద రకరకాల మేడలు, వివిధ రకాల దేవతానివాసాలు, బంగారం, నవరత్నాలతో పొదిగిన గోపురాలు, బంగారు తోరణాలు కట్టిన బంగారు ద్వారాలు ఇలా సర్వాలంకార సంశోభితంగా ప్రకాశించే అమరావతి అనే నగరం ఉంటుంది.

అమరావతి నగరంలో వినోదంగా సంభాషించే, దివ్యాభరణాలతో అందంగా ప్రకాశించే స్త్రీలు, స్తనభారంతో వంగిన అప్సరసలు, కామవికారంతో కళ్ళు తిప్పుతూ వయ్యారంగా సంచరించే వేలాది సుందరీమణులు నిండి ఉంటారు. అంతేకాదు వికసించిన కమలాలు, బంగారు మెట్లు బంగారు రజనుతో కూడిన ఇసుక తిన్నెలు, దివ్యసుగంధాలని వెదజల్లే కమలాలున్న చెఱువులతో, నదులతో ఆ అమరావతీపురం మేరుపర్వతం మీద అలరారుతోంది.

మేరు పర్వతం ఆగ్నేయ దిశలో అగ్నిదేవుడి నగరం 'తేజస్వి' అనే పేరుతో అమరావతితో సమానంగా వెలుగొందుతోంది. దాని దక్షిణ దిశలో బంగారు మయమైన భవనాలతో యముడి నగరం 'వైవస్వతి' అనే పేరుతో వెలుగొందుతోంది.

మేరు పర్వతం నైఋతీ దిశలో 'శుద్ధవతి' అనే పేరుతో నల్లని రంగుతో ఒక పట్టణం నెలకొంది. అలాగే వాయువ్య భాగంలో 'గంధవతీ' పురం, ఉత్తరదిశలో 'మహోదయం' అనే పట్టణం, ఈశాన్య దిశలో 'యశోవతీ' పురం అనేవి దిగంతాలలో విరాజిల్లుతున్నాయి.

సుందరమైన మేరుపర్వతం పైభాగంలో బ్రహ్మ విష్ణు మహేశ్వరులు నివసిస్తుంటారు. ఇక సిద్ధులు యక్షులు, గంధర్వులు, మునులు, భూతగణాలు మేరు పర్వతం మధ్యభాగంలో నివసిస్తారు. మేరు పర్వతం మీద వెయ్యి యోజనాల విస్తీర్ణంతో వున్న విమానంలో సూర్య చంద్రాగ్ని నేత్ర త్రయుడైన పరమేశ్వరుడు, పార్వతీ దేవి, గణపతి కుమారస్వామిలతో కలిసి సింహాసనం మీద ఆసీనుడై ఉంటాడు.

శ్రీమహావిష్ణువు మేరుపర్వతం వామభాగంలో అయిదువందల యోజనాల విస్తీర్ణంతో ఉండే విమానంలో అలాగే బ్రహ్మదేవుడు మేరుపర్వత దక్షిణ దిశలో పద్మరాగమయమైన దివ్యవిమానంలో నివసిస్తుంటాడు.

మేరుపర్వతం మీద ఉన్న అన్ని లోకాలలో శివాలయాలుంటాయి. వాటిలో నిత్యం శివుడు పూజించబడుతూ ఉంటాడు. బ్రహ్మమానస పుత్రులైన

సనక సనందనాదులు ఈ పర్వతం మీద సంచరిస్తుంటారు. నందికేశ్వరుడు, గణపతి, కుమారస్వామి ప్రమథగణాలు, బాలసూర్యకాంతితో విరాజిల్లే విమానాలలో ఆనందంగా సంచరిస్తుంటారు. వీరితో పాటు సనక సనందనాదులతో సమానులైన వేలకొద్దీ మహర్షులు పైలోకాల్లో నివసిస్తారు. ఇప్పుడు చెప్పిన లోకాలలో యోగభూమి-భోగభూమి అని రెండు రకాల ప్రదేశాలుంటాయి.

**జంబూవృక్షం :** సుయశాదేవి, సప్తమాత్రుకలు, మన్మథుడు నందికేశ్వరుడి విమానం దగ్గర వుంటారు. జంబూనది ఈ మేరుపర్వతాన్ని చుట్టి ప్రవహిస్తుంటుంది. ఆ జంబూనది దక్షిణ పార్శ్వంలో ఎంతో ఎత్తుగా జంబూవృక్షం (నేరేడు చెట్టు) వ్యాపించి ఉంది. అది ఎల్లకాలం ఫలాల్ని కాస్తూ ఉంటుంది. ఆ మేరు పర్వతాన్ని ఆనుకునే 'ఇలావృతం' అనే వర్షం నెలకొంది. ఆ ఇలావృతంలోని ప్రజలు అక్కడి జంబూఫలాల్ని తింటుంటారు. మరికొందరు ఆ జంబూఫలరసాన్ని త్రాగుతుంటారు. దానివల్ల వారంతా బంగారు రంగుతో ప్రకాశిస్తారు. ఈ జంబూద్వీపం అన్ని ద్వీపాలకీ మధ్యలో శోభాయమానానంగా ప్రకాశిస్తూ ఉంటుంది.

## జంబూ ద్వీప వైభవం

ద్వీపాలలో జంబూద్వీపం లక్షయోజనాల విస్తీర్ణంతో వ్యాపించగా, ప్లక్షద్వీపం రెండు లక్షల యోజనాలు ఉంటుంది. భూమి మొత్తం సప్త సముద్రాలతో కలిపి ఏభైకోట్ల యోజనాల విస్తీర్ణంతో సప్త ద్వీపాలతో విరాజిల్లుతూ లోకాలోక పర్వతంతో చుట్టబడి వుంటుంది.

మేరుపర్వతానికి ఉత్తరాన నీలపర్వతం, నీలపర్వతానికి ఉత్తర భాగంలో శ్వేత పర్వతం, ఆ శ్వేత పర్వతానికి ఉత్తర దిశలో శృంగిగిరి అనే మూడు పర్వతాలుంటాయి. వీటినే వర్షపర్వతాలంటారు. మేరుపర్వతానికి పూర్వదిశలో జఠరం-దేవకూటం అనే రెండు పర్వతాలున్నాయి. మేరువుకి దక్షిణ భాగంలో నిషధాద్రి, దానికి కుడివైపు హేమకూటం, దానికి దక్షిణభాగంలో హిమవత్పర్వతం,

మేరువుకి పడమర భాగంలో మరోరెండు పర్వతాలు ఉంటాయి. మేరు పర్వతం సమీపంలోనే మాల్యవంతం–గంధమాదనం అనే రెండు పర్వతాలు నెలకొన్నాయి.

ఇక్కడ తెలిపిన పన్నెండు పర్వతాలమీద సిద్ధులు, చారణులు విహరిస్తుంటారు. ఈ పన్నెండు పర్వతాలలో ఒకదానికి మరోదానికీ మధ్య తొమ్మిదివేల యోజనాల అంతరం ఉంది. హిమాలయాలకి చెందిన ఈ వర్షం భారత వర్షం అని ప్రసిద్ధి చెందింది. వర్షాలు మొత్తం తొమ్మిది. 1.భారత వర్షం 2. హేమకూటం 3.కింపురుష వర్షం 4.హరివర్షం 5.ఇలా వర్షం 6.రమ్యక వర్షం 7.శ్వేత వర్షం 8.శృంగి వర్షం 9.కురువర్షం అనేవి.

మేరు పర్వతానికి దక్షిణ ఉత్తర భాగాల్లో ఉండే వర్షాలు (భూభాగాలు) ధనుస్సు ఆకారంలో ఉంటాయి. మేరుపర్వతం తూర్పు పడమర దిశల్లో ఉన్న రెండు వర్షాలు అంత పెద్దవిగా ఉండవు. మాల్యవంత పర్వతం రెండువేల యోజనాల ఎత్తులో 34 వేల యోజనాల వెడల్పుతో ఉంటుంది. మందరగిరి, దేవకూటం అనే పర్వతాలు తూర్పు దిశలో కైలాసం, గంధమాదన పర్వతాలు దక్షిణ దిశలో, నిషధగిరి, పారియాత్ర పర్వతాలు పడమర దిశలో 'త్రిశృంగం' 'జారుచి' అనే పర్వతాలు ఉత్తర దిశలో విరాజిల్లుతున్నాయి.

ఈ విధంగా మహోన్నతమైన మేరు పర్వతానికి నాలుగువైపులా వ్యాపించిన మందర, గందమాదన, విపుల, సపార్శ్వ అనే పర్వతాల ద్వారా ఈ భూమి కదలకుండా స్థిరంగా ఉంది.

**నాలుగు పర్వతాలు :** మందర పర్వతం మీద కదంబవృక్షాలు గంధమాదన పర్వతం మీద జంబూ(నేరేడు) వృక్షం, విపుల శైలంమీద అశ్వత్థ(వారి) వృక్షం, సుపార్శ్వ పర్వతం మీద న్యగ్రోధ(మఱ్ఱి) చెట్టు శాఖోప శాఖలతో విస్తరించి ఉంటాయి. ఈ నాలుగు పర్వతాల మీదా నాలుగు మనోహరమైన వనాలున్నాయి. అవి 1.చైత్రరథవనం 2.గంధమాదన వనం 3.వైభ్రాజనవనం 4.సావిత్రీవనం. ఈ వనాలన్నిటిలో దేవతలు విహరిస్తుంటారు.

**శివక్షేత్రాలు :** ఈ నాలుగు పర్వతాలకీ 1.పూర్వభాగంలో మిత్రేశ్వరం 2.దక్షిణభాగంలో షష్ఠేశ్వరం 3.పశ్చిమ భాగంలో వర్యేశ్వరం 4.ఉత్తర దిశలో ఆమ్రకేశ్వరం అనే శివక్షేత్రాలున్నాయి. వీటితో పాటు 1.అరుణోదం 2.మానసం 3.సితోదం 4.మహాభద్రం అనే నాలుగు సరస్సులు, ఇంకా కుమారస్వామి క్షేత్రాలు నలువైపులా విస్తరించి ఉన్నాయి. ఈ దివ్య క్షేత్రాలలో కేవలం మునులు, మహర్షులు మాత్రమే ఉండగలరు. మానవులు ఇక్కడ జీవించలేరు.

ఈ అన్ని ప్రాంతాలలో దేవతలు శివాలయాల్ని నిర్మించి శివుణ్ణి నిత్యం ఆరాధిస్తూ ఉంటారు. ఇక్కడున్న బిల్వవనంలో మహాలక్ష్మి వంటి దేవతలు, అర్జున వృక్షవనంలో కశ్యపాది మహర్షులు, తాళవనంలో ఇంద్ర ఉపేంద్రులు, ఉదుంబర(మేడి) వనంలో కర్దమాది మహర్షులు, ఆమ్ర (మామిడి)వనంలో విద్యాధరులు, సిద్ధులు, నింబ(వేప) వనంలో నాగదేవతలు, సాధ్యులు కింశుక వనంలో సూర్యుడు, రుద్రగణాలు, బీజాపూర వనంలో బృహస్పతి, కౌముద వనంలో శ్రీహరి తదితరులున్నారు. న్యగ్రోధ (మర్రి) వనంలో ఆదిశేషుడు నివసిస్తుంటాడు. ఈ ఆదిశేషుడే పాతాళంలో కూడా నివసిస్తూ సమస్త భూమండలాన్ని తన పడగల మీద మోస్తుంటాడు. ఇలా సకల జగత్తుకీ ఆధారమైన వాడుగా ఆదిశేషుడుంటాడు. ఈ ఆదిశేషుడే ద్వాపర యుగంలో బలరాముడిగా జన్మించాడు.

పనస వృక్షవనంలో శుక్రాచార్యుడితో సహా కొందరు దానవులు, అసురులు, విశాఖవనంలో కిన్నెరులు, మహాసర్పాలు ఉంటాయి. వీటితో పాటు మనోహరవనంలో కోట్లాది మహావృక్షాలున్నాయి. ఇక్కడే ప్రమథగణాలతో నందీశ్వరుడు వీటితో పాటు 'సంతానక' ప్రదేశంలో సరస్వతీదేవి ఆనందంగా నివసిస్తుంటుంది.

## శివ లింగార్చన ప్రాముఖ్యం

ఈ లోకమంతా శివలింగమయం కాబట్టి ఈ సమస్తం శివలింగం మీదే ఆధారపడిందని తెలుస్తోంది. కనుక అభీష్టసిద్ధి కోరుకునేవాడు లింగార్చన చేయాలి.

దేవతలు, దైత్యులు, దానవులు, యక్షులు, విద్యాధరులు, సిద్ధులు, రాక్షసులు, పితృదేవతలు, మునులు, దివ్యులు, పిశాచాలు, కిన్నరాది గణాలు ఇలా అందరూ శివలింగాన్ని అర్చించినందువల్లే తమ తమ కోరికల్ని సిద్ధింప చేసుకున్నారు. సర్వేశ్వరుడైన శివుడి ముందు అందరూ పశువులుగా పడి ఉన్నారు. వీరంతా పాశుపత వ్రతాన్ని ఆచరిస్తే ఈ పశుత్వం తొలగిపోతుంది. అది ఎలాగంటే?

ముందుగా ఓంకారంతో ఐదుసార్లు ప్రాణాయామం చేసి పృధివ్యాది పంచమహాభూతాల్ని శోధించి, ఓంకారాన్ని ఉచ్చరిస్తూ ప్రాణవాయువుల్ని సంయమించి, జ్ఞానామృతమైన ఓంకారాన్ని శరీరంలోని అన్ని అంగాలలో వ్యాపింపచేయాలి. తరువాత కర్మేంద్రియాలని ఓంకారంతో శోధించి తన శరీరాన్ని చైతన్యవంతం చేసుకోవాలి.

1.అగ్నిరితి భస్మ 2.వాయురితి భస్మ 3.జలమితి భస్మ 4.స్థలమితి భస్మ 5.వ్యోమేతి భస్మ 6.సర్వగ్ం హవా ఇదగ్ం భస్మ అనే మంత్రాల్ని చదువుతూ భస్మాన్ని తాకాలి. తరువాత త్రియాయుషం, జమదగ్నేః ఇత్యాది మంత్రాలతో ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం పొడి భస్మాన్ని వళ్ళంతా రాసుకోవాలి. దీన్నే ఉద్ధూళనం అంటారు.

దీనినే పాశుపత వ్రతం అంటారు. దీన్ని ఆచరించిన వాడికి శివయోగం సిద్ధిస్తుంది. శివలింగాన్ని కనీసం ఒక సంవత్సరం పూజిస్తే జీవాత్మకి పశు భావం తొలగిపోతుంది.

- ❖ బ్రహ్మావిష్ణు రుద్రులు బాహ్యంలో అంతరంలో భక్తి శ్రద్ధలతో పరమేశ్వరుణ్ణి ఆరాధించి, సృష్టి, స్థితి లయాలనే కార్యాల్ని నిర్వహిస్తున్నారు.
- ❖ ప్రతిరోజూ ఒక్కక్షణకాలమైనా శివుణ్ణి పూజ, జప, ధ్యానాలలో స్మరించకపోతే, కీడు, ముప్పు తప్పదని గ్రహించాలి.
- ❖ శివభక్తిపరులు శివార్పితమైన మనస్సు కలిగినవారు శివస్మరణ చేసేవారు ఎప్పటికీ దుఃఖాన్ని పొందరు.

- ❖ అందమైన భవనాలు, బంగారు ఆభరణాలు, అందమైన స్త్రీలు, తృప్తి కలిగేంత ధనం ఇవన్నీ శివపూజచేసిన వారికి లభించే ఐహిక ఫలాలు.
- ❖ భూలోకంలో మహారాజ భోగాన్ని పరలోకంలో స్వర్గలోక సుఖాల్ని కోరుకునేవారు జీవితాంతం లింగస్వరూపుడైన శివుణ్ణి ఆరాధించాలి.
- ❖ శివుణ్ణి ఆరాధించిన వారికి హింసాదోషం అంటదు.

## దేవతలు స్వీకరించిన శివలింగాలు

పూర్వం దేవశిల్పి విశ్వకర్మ బ్రహ్మదేవుడి ఆజ్ఞని అనుసరించి, వివిధరకాల దేవతలకి వారివారి అధికారాలకి అనుగుణంగా రకరకాల శివలింగాల్ని నిర్మించి ఇచ్చాడు.

1.విష్ణుమూర్తికి – ఇంద్రనీలమణితో చేసిన లింగాన్ని 2.దేవేంద్రుడికి– పద్మరాగమణులతో చేసిన లింగాన్ని 3.కుబేరుడికి – బంగారు లింగాన్ని 4.విశ్వే దేవతలకి – వెండి లింగాన్ని 5.అష్టవసువులకి – చంద్రకాంతమణిలింగాన్ని 6.వాయుదేవుడికి – ఇత్తడి లింగాన్ని 7.అశ్వినీ దేవతలకి – మట్టితో చేసిన లింగాన్ని 8. వరుణదేవుడికి – స్ఫటిక లింగాన్ని 9.ఆదిత్యులకి – రాగి లింగాన్ని 10.చంద్రుడికి – ముత్యాలతో చేసిన లింగాన్ని 11.అనంతాది మహాసర్పాలకి– పగడలింగాన్ని 12.రాక్షసులకి – ఇనుపలింగాన్ని 13.యక్షులకి – బంగారం, వెండి, ఇత్తడి కలిపిన త్రిలోహలింగాన్ని 14.ప్రమథగణాలకి – బంగారం, వెండి, రాగి, ఇత్తడి కలిపి చేసిన లింగాన్ని 15.చాముండాది సప్తమాతృకలకి– ఇసుకతో చేసిన లింగాన్ని 16.నైరృతిదేవతకి – దేవదారు కర్రతో చేసిన లింగాన్ని 17.యమధర్మరాజుకి – మరకత లింగాన్ని 18.నీలలోహితాది ఏకాదశరుద్రులకి – భస్మలింగాన్ని 19.లక్ష్మీదేవికి–బిల్వవృక్షం కర్రతో చేసిన లింగాన్ని 20.కుమారస్వామికి – గోమయంతో చేసిన లింగాన్ని 21.మునులకి – దర్భకొనలతో చేసిన లింగాన్ని 22.వామాది శక్తులకి – పూలతో చేసిన లింగాన్ని 23.సరస్వతీ దేవికి – తెల్లటి వజ్రంతో చేసిన లింగాన్ని 24.దుర్గాదేవికి – బంగారు లింగాన్ని 25.మంత్రదేవతలకి – పేరిన నెయ్యితో చేసిన లింగాన్ని

26.మూర్తి వంతాలై ఆకారాలు ధరించిన వేదాలకి – గట్టి పెరుగుతో చేసిన లింగాన్ని 27.దివ్య పిశాచాలకి–సత్తుతో చేయబడ్డ లింగాన్ని ఇచ్చాడు. బ్రహ్మ చెప్పిన విధంగా ఆయా దేవతలందరూ విశ్వకర్మద్వారా లింగాల్ని స్వీకరించి, నిత్యం వాటిని పూజిస్తూ, అభిషేకిస్తూ తమ పదవుల్లో కొనసాగుతున్నారు.

**శివలింగ రకాలు :** ద్రవ్యభేదాల్ని అనుసరించి లింగాలలో కొన్ని భేదాలున్నాయి. 1.శైలజాలు (పర్వతాదిశిలల నుంచి తయారు చేయబడేవి) 2.రత్నజాలు (రకరకాల రత్నాలతో చేయబడేవి) 3.ధాతుజాలు (వివిధరకాల ధాతువులతో చేసే లింగాలు)4.దారుజాలు (వివిధరకాల వృక్షాల కలపతో చేయబడేవి) 5.మృణ్మయాలు (మట్టితో చేయబడే శివలింగాలు)6.క్షణికాలు (ముగ్గుపిండితో చేసే లింగాలు)

**శివలింగ ఫలం :**

శ్రీప్రదం రత్నజంలింగం శైలజం సర్వసిద్ధిదం ।
ధాతుజం ధనదం సాక్షాద్దారుజం భోగసిద్ధిదమ్ ।

మృణ్మయంచైవ విప్రేంద్రాః సర్వ సిద్ధికరం శుభం ।
మనశ్చింతాహరంచైవ క్షణికం ప్రోచ్యతే బుధైః ॥

ఆరురకాల లింగాలలో రత్నంతో చేసిన లింగం ఐశ్వర్యాన్నిస్తుంది. పర్వతశిలలతో చేసిన లింగం సిద్ధుల్ని ప్రసాదిస్తుంది. ధాతువులతో నిర్మించిన శివలింగం, ధనధాన్యాల్ని అందిస్తుంది. కొయ్యతో చేసిన లింగం సుఖభోగాల్ని అందిస్తుంది. మట్టితో చేసిన లింగం తాత్కాలిక కోరికల్ని సిద్ధించేలా చేస్తుంది. క్షణికలింగం మనసులోని బాధల్ని తొలగిస్తుంది.

శైలజం చోత్తమం ప్రోక్తం మధ్యమం రత్నజం తథా ।
ధాతుజాదిక లింగంతు కనిష్ఠం సంభవేద్ధ్రువమ్ ॥

శివలింగాలలో స్ఫటికాది శిలలతో నిర్మించిన లింగాలు ఉత్తమమైనవని, రత్నాలతో నిర్మించినవి మధ్యమమైనవని, ధాతువులతో నిర్మించే లింగాలు చివరివని చెబుతారు.

**శివలింగ స్వరూపం :**

మూలే బ్రహ్మ తథామధ్యేవిష్ణురగ్రే మహేశ్వరః ।
రుద్రోపరి మహాదేవః ప్రణవాఖ్యస్సదాశివః ॥

శివలింగానికి ఉండే క్రింది పీఠం మీద బ్రహ్మదేవుడు, పానవట్టం మీద శ్రీహరి, పానవట్టం పైన ఉండే పిండం మీద పరమేశ్వరుడు, పిండంపైనున్న శిఖరంమీద సదాశివుడు కొలువుంటారు.

లింగవేదీ మహాదేవీ త్రిగుణాత్రియమంబికా ।
తయా చ పూజయేద్యస్తు దేవీదేవశ్చ పూజతే ॥

శివలింగ స్వరూపాన్ని మరోవిధంగా కూడా చెబుతారు. శివలింగ వేదిక సత్త్వరజస్తమోగుణాలనే త్రిగుణాత్మిక మహాదేవి. ఆ వేదిక మీద విలసిల్లే పిండస్వరూపుడు పరమేశ్వరుడు. కనుక పానవట్టంతో ఉన్న శివలింగాన్ని అర్చించిన వాడు జగన్మాతాపితరులైన పార్వతీ పరమేశ్వరుల్ని ఆరాధించినట్టే.

**శివలింగ స్థాపన :** శిలతో నిర్మించినదికానీ, రత్నాలతో నిర్మించిన లింగాన్ని కానీ సలక్షణంగా ఆలయం లేక మందిరంలో స్థాపించిన పుణ్యాత్ముడు, మహావిష్ణువు చేత, బ్రహ్మది దేవతల చేత ఇంద్రాది అష్టదిక్పాలకులచేతా, సిద్ధ, విద్యాధర, గంధర్వ, నాగ, యక్ష, కిన్నెర, రాక్షసుల చేత స్తుతించబడతాడు. పవిత్రమైన దేవదుందుభుల నాదాల్ని వింటూ భూర్భువస్సువరాది లోకాలన్నిటినీ అతిక్రమించి అంతకన్నా గొప్పవైన ఊర్ధ్వలోకాలకి (శివలోకం) చేరుకుంటాడు.

**స్థాపన యోగ్యంకాని లింగాలు :** ధాతువులతో, కొయ్యతో, మట్టితో చేసిన లింగాలు స్థాపించటానికి యోగ్యమైనవి కావు. శివలింగాన్ని స్థాపించేవాడు దేవి, గణపతి, నంది, నాగ సహితంగా విధివిధానంగా, అందమైనది గోక్షీరంలాగా స్వచ్ఛమైనది అయిన శివలింగాన్ని స్థాపించాలి (ప్రతిష్ఠించాలి). అలా స్థాపన చేసినవాడి శరీరంలో పరమేశ్వరుడు సదా కొలువుంటాడు.

ఈ విధంగా విధివిధానంతో స్థాపించిన శివలింగాన్ని తాకినంత మాత్రానే మానవుడు పరమానందాన్ని, అంతులేని పుణ్యాన్ని పొందుతాడు.

లింగ ప్రతిష్ఠచేసిన వాడి పుణ్యం అనంతం. దాన్ని వర్ణించి చెప్పటానికి కోటి సంవత్సరాలైనా సరిపోవు. కనుక శివభక్తుడైనవాడు వ్యయప్రయాసలు పడైనా ఇతరుల్ని యాచించైనా శివలింగాన్ని స్థాపించాలి.

## పరమేశ్వరుడి నిరాకార స్వరూపం

జగత్పిత అయిన పరమేశ్వరుడు ఓంకార స్వరూపుడని కొందరు, అదికాదు ఆయన వేదాంతవిజ్ఞాన రూపుడని ఇంకొందరు, అలాగే శబ్ద స్పర్శరూప, రస గంధాత్మకమైన విషయాల్ని యథాతథంగా గుర్తించే జ్ఞానమే శివుడని మరికొందరు చెప్పారు. అయితే పరమేశ్వరుణ్ణి సాక్షాత్కరింపచేసే జప, పూజా, ధ్యాన స్తోత్రాదులతో కూడిన ఉపాసనా జ్ఞానమే పరమేశ్వరుడని వ్యాసమహర్షి ఉద్బోధిస్తాడు.

ఇలాంటి జ్ఞానాన్ని పొందటం వల్లే ముక్తి లభిస్తుంది. మరి జ్ఞానం కలగాలంటే! అందుకు శివానుగ్రహం కావాలి. అది ఎలా పొందాలంటే! నిష్కామకర్మాచరణతో త్రికరణ శుద్ధిగా శివుణ్ణి ఆరాధిస్తే శివజ్ఞానం పొందగలం.

**పరమేశ్వరుడి విరాట్‌రూపం :** విశ్వరూపుడైన విశ్వేశ్వరుడికి స్వర్గం-శిరస్సుగా, క్షేత్రరూపమైన భూమి నాభిగా, సూర్యచంద్ర, అగ్నులు మూడూ-త్రినేత్రాలుగా, దిక్కులన్నీ-చెవులుగా, పాతాళలోకం - పాదాలుగా, సముద్రాలు-వస్త్రాలుగా, దేవతలంతా-భుజాలుగా, నక్షత్రాలు-ఆభరణాలుగా, ప్రకృతి-భార్యగా, పురుషుడు - జననేంద్రియంగా ఆ సదాశివుడు విశ్వరూపాన్ని ధరించి ప్రకాశిస్తాడు.

అలాంటి విరాట్ శివుడి నోటినుంచి బ్రహ్మ దేవుడు- బ్రాహ్మణులు, భుజాల నుంచి ఇంద్ర ఉపేంద్రులు, క్షత్రియులు, తొడలు నుంచి - వైశ్యులు, పాదాలనుంచి శూద్రులు ఉదయించారు. ఆ విరాట్ శివుడికి పుష్కలా వర్తకం లాంటి నీలి మేఘాలు వెంట్రుకల్లా ఉన్నాయి. ఆ మహాశివుడి నాసికనుంచి వెలువడ్డ వాయువులు శ్రుతులు చెప్పిన కర్మల గమనంగా ఉన్నాయి.

**ఉపాసనాత్మక జ్ఞానం :** పరమేశ్వరుడు కామ్యకర్మలతోకానీ, ఇంద్రియ విజ్ఞానాలతోకానీ అనుగ్రహించాడు. కేవలం నిష్కామ ఉపాసనతోనే ఆయన సులభ సాధ్యుడవుతాడు. ఈ ఉపాసనాత్మకమైన జ్ఞానం 1.కర్మ 2.తపస్సు 3.జపం 4.ధ్యానం అని నాలుగు విధాలుగా ఉంటుంది.

వీటిలో నిష్కామంగా కర్మల్ని ఆచరించటం కన్నా తపోయజ్ఞం ఎంతో గొప్పది. ఆ తపోయజ్ఞం కన్నా వెయ్యిరెట్లు మించింది జపయజ్ఞం, జపయజ్ఞం కన్నా మరో వెయ్యి రెట్లు అధికమైన ఫలాన్నిచ్చేది ధ్యానయజ్ఞం. కనుక ధ్యానయజ్ఞం కన్నా మించింది లేదని అందరూ గ్రహించాలి. నిశ్చలమైన ధ్యానమే శివసాక్షాత్కారానికి మార్గం.

తపోయజ్ఞమంటే రుద్రాధ్యాయాన్ని (నమక చమక అనువాకాలు) పఠించటం. ధ్యానయజ్ఞం అంటే చిదానందరూపుడైన ఆ శివుడే నేను అని నిశ్చలమైన మనసులో ఒక్క క్షణకాలం చింతించటం లేక భావించటం. ఇలా ధ్యానయజ్ఞం చేసేవాడికి ఏదో ఒక శుభసందర్భంలో శివుడు మనసులో సాక్షాత్కరిస్తాడు. ధ్యాన సిద్ధిని పొంది ఈ విశ్వాన్నంతా శివమయంగా భావించేవాడికి ఎలాంటి ప్రాయశ్చిత్తాలూ ఉండవు. వారు ఎప్పుడూ పరిశుద్ధంగానే ఉంటారు.

**శివలింగ జ్ఞానం :** మానవులు పూజించే శివలింగాలు రెండు విధాలుగా ఉంటాయి. 1.బాహ్యలింగాలు 2.ఆభ్యంతర లింగాలు అని. శిలలు రత్నాలతో నిర్మించిన లింగాలు బాహ్యమైనవి, వీటిని స్థూలలింగాలు అంటారు. సదానందాత్మకమైన సూక్ష్మలింగాన్ని ఆభ్యంతర లింగం అంటారు. ఈ సూక్ష్మలింగం శివయోగుల హృదయాలలో ఇష్టలింగంగా ప్రకాశిస్తూ ఉంటుంది. స్థూల లింగం కర్మనిష్ఠ కలిగిన శివభక్తులతో బాహ్యంగా పూజలందుకుంటూ వుంటే, సూక్ష్మలింగం యోగుల హృదయాలలో కొలువుండి నిత్యం ధ్యానం ద్వారా పూజలందుకుంటుంది. ఈ సూక్ష్మలింగాన్నే ప్రాణలింగమని కూడా అంటారు.

సూక్ష్మలింగ రూపంలో ప్రతిఒక్కరి హృదయాలలో ఆ పరమేశ్వరుడు నివసిస్తూనే ఉంటాడు. అయితే దాన్ని అందరూ దర్శించలేరు. మరి సూక్ష్మలింగ దర్శనం కావాలంటే ముందుగా స్థూల లింగాన్ని బాహ్యంగా నియమనిష్ఠలతో త్రికరణ శుద్ధిగా పూజిస్తే క్రమ క్రమంగా సూక్ష్మలింగాన్ని ఎలా ధ్యానమార్గంలో ఆరాధించాలో అవగతమవుతుంది. చివరికి ధ్యానం సిద్ధించి ఆత్మలింగం దివ్యజ్యోతిగా దర్శనమిస్తుంది.

సూర్యభగవానుడు ఒక్కడే అయినప్పటికీ నీటిధారల్లో చూస్తే ఎన్నో సూర్యులుగా కనిపించినట్టు సచ్చిదానంద స్వరూపుడైన పరమేశ్వరుడు ఒక్కడే స్థూల సూక్ష్మలింగాలలో, చేతులు, కాళ్లు, ముఖాది అవయవాలతో నిర్మించిన శివుడి విగ్రహాలలో భిన్న భిన్నలక్షణాలతో గోచరిస్తూ ఉంటాడు.

శివోపాసకుడైన వాడు తనకి కనబడేది, వినబడేది అంతా శివమయమే నని తెలుసుకోవాలి. కలలో వివిధ రకాల సుఖభోగాలు అనుభవించటం, దాని ద్వారా ఎంతో తృప్తి పొందటం అదే కలలో మరోసారి ఎన్నో కష్టాలకి బాధలకి గురై వేదన పొందటం జరుగుతుంది. కానీ మెలకువలోకి వచ్చాక చూస్తే అవేవీ నిజంకావని మనకు తెలుస్తుంది. పరమేశ్వర సాక్షాత్కారం పొందిన వాడికి జాతి, కుల భేదాలు ఉండవు.

సంసారంలో ఉన్న భక్తుల హృదయాలలో పరమేశ్వరుడు సూక్ష్మ లింగంగా, ప్రాణ లింగంగా ప్రకాశిస్తూ ఉంటాడు. సంసార లంపటం లేని శివయోగులు తమ హృదయాంతరాళంలో ఉన్న ఆత్మలింగాన్ని దర్శిస్తూ శివానందాన్ని పొందుతారు. సర్వజ్ఞుడైన శివుణ్ణి తమ హృదయంలోనే కాక, బాహ్యంగా కనిపించే శివలింగంలో, సూర్యుడిలో కూడా భావిస్తారు.

**శక్తి-శివుల ఆరాధన :** పరమేశ్వరుడు ఎంతటివాడో శక్తికూడా అంతటిదే కనుక ఇద్దర్నీ సమభావంతో ఆరాధించాలి.

యథాశివ స్తథాదేవీ యథాదేవీ స్తథాశివః ।
తస్మాదభేద బుద్ధ్యైవ శివం దేవీం యజేన్నరః ॥

శివుడెంత సమర్థుడో దేవి కూడా అంతే సమర్థురాలు. ఈ విషయాన్ని గ్రహించి ఇద్దరిలో ఎలాంటి భేదం లేదని భావించి శివుణ్ణి, శక్తిని పూజించాలి. అయితే ముందుగా పరమేశ్వరుణ్ణి అర్చించి ఆ తరువాత శక్తిని ఆరాధించాలి.

పరమేశ్వరుణ్ణి కొందరు ప్రకృతి పురుషాత్మకుడని, మరికొందరు బ్రహ్మ విష్ణు రుద్రాత్మకుడని, కాదు సృష్టి, స్థితి, లయకారకుడైన నాలుగో మహాపురుషుడు (పరబ్రహ్మ) అని ఇంకొందరు భావిస్తారు. పరమేశ్వరుణ్ణి ఆరాధించే ధ్యానయోగులు తమ భ్రూ(కనుబొమల) మధ్యలో పార్వతీ పరమేశ్వరుల్ని దర్శిస్తూ యోగం చేస్తే, జన్మాంతంలో వారికి శివసాయుజ్యం లభిస్తుంది. ధర్మాత్ములైన విప్రులు తప్పని సరిగా శివారాధన చేయాలి.

## శివ ప్రతిమల ప్రతిష్ఠ - ఫలితం

పరమేశ్వరుడి సాకార ప్రతిమలు వివిధరకాలుగా శాస్త్రాల్లో, ఆగమాల్లో చెప్పబడ్డాయి. ఈ సాకార ప్రతిమల్ని ప్రతిష్ఠించినవారికి శివానుగ్రహం సంపూర్ణంగా లభిస్తుంది.

**1. పరివార సహిత శివమూర్తి :**

స్కందోమాసహితం దేవమాసీనం పరమాసనే ।
కృత్వా భక్త్యా ప్రతిష్ఠాస్య సర్వాన్ కామానవాప్నుయాత్ ॥

స్కందుడితో పార్వతీదేవితో కూడి గొప్ప సింహాసనం మీద కూర్చున్నవాడుగా శివుడి ప్రతిమని శిలతో తయారుచేయించి ప్రతిష్ఠించేవాడు. ఐహికాముష్మిక ఫలాలు పొందుతాడు. ఈ పరివార సహిత శివమూర్తిని విధి విధానంగా ఒక్కసారి పూజిస్తే చాలు. కోటిసూర్యుల కాంతితో ప్రకాశించే దివ్యవిమానంలో సంచరిస్తూ మహాప్రళయం దాకా ఎన్నో సుఖాలు అనుభవించి చివరికి శివసాయుజ్యం పొందుతాడు.

**2. త్రిమూర్తి ప్రతిమ :**

ఏకపాదం చతుర్బాహుం త్రినేత్రం శూలధారిణం ।
సృష్ట్వా స్థితం హరింవామే దక్షిణే చతురాననమ్ ।
ప్రతిష్ఠాప్య యథాన్యాయం శివసాయుజ్యమాప్నుయాత్ ।

ఒకపాదం, నాలుగుచేతులు, మూడుకళ్ళు, చేతిలో త్రిశూలం, ఎడమప్రక్కన శ్రీహరి, కుడివైపు బ్రహ్మలతో వున్న శివుడి ప్రతిమని చేయించి యథావిధిగా ప్రతిష్ఠించి పూజించిన వాడికి మోక్షం లభిస్తుంది.

**3. త్రిపాద శివ మూర్తి :**

త్రిపాదం సప్తహస్తం చ చతుశ్శృంగం ద్విశీర్షకం ।
కృత్వా యజ్ఞేశ మీశానం విష్ణులోకే మహీయతే ॥

మూడు పాదాలు, ఏడుచేతులు, నాలుగు కొమ్ములు రెండు తలలతో అగ్ని స్వరూపుడైన పరమేశ్వరుణ్ణి ప్రతిష్ఠించిన వాడు వైకుంఠంలో లక్షకల్పాలు దివ్య సుఖాలనుభవించి తిరిగి భూలోకంలో శ్రోత్రియకుటుంబంలో జన్మించి ఎన్నో క్రతువుల్ని ఆచరించి చివరికి శివసాయుజ్యాన్ని పొందుతాడు.

**4. వృషభవాహన మూర్తి :**

వృషారూఢంతు యః కుర్యాత్సోమం సోమార్థభూషణం ।
హయమేధాయుతం కృత్వా యత్పుణ్యం తదవాప్యసః ।
కాంచనేన విమానేన కింకిణీజాల మానినా ।
గత్వా శివపురం దివ్యం తత్రైన సవిముచ్యతే ॥

చంద్రరేఖను ధరించి నంది(వృషభం)వాహనాన్ని అధిరోహించిన శివుడి ప్రతిమని చక్కటి ఆలయంలో ప్రతిష్ఠించినవాడు, బంగారంతో తయారుచేయబడి చిరుగంటల దండలతో మనోహరంగా ఉండే దివ్య విమానంలో ప్రయాణిస్తాడు. పదివేల అశ్వమేధయాగాలు చేసిన ఫలితం పొంది చివరికి శివలోకాన్ని చేరుకుంటాడు.

**5. నందిసహిత సాంబమూర్తి :**

నందినీసహితం దేవం సాంబం సర్వగణైర్వృతం ।
గత్వాకైలాస శిఖరం గాణపత్యమవాప్నుయాత్ ॥

ప్రమథగణాలతో కూడి, నంది ఎదురుగా ఉన్న సాంబమూర్తిని ప్రతిష్ఠించే శివభక్తుడు కైలాస శిఖరాన్ని చేరి శివగణాలలో ఒకడిగా మారిపోతాడు.

**6. నృత్యమూర్తి :**

నృత్యంతం దేవదేవేశం శైలజా సహితం ప్రభుం ।
సహస్ర బాహుం సర్వజ్ఞం చతుర్బాహు మథాపివా ॥

వేయి లేక నాలుగు చేతులు కలిగిన శివమూర్తిని పార్వతీదేవి ముందు నర్తిస్తున్న భంగిమలో ప్రతిష్ఠించినట్లైతే తపోదాన, యజ్ఞ తీర్థాదులని సేవించిన ఫలితం కన్నా కోటిరెట్లు అధికమైన ఫలితం పొందుతాడు. మహాప్రళయం వరకూ సకల సుఖభోగాలూ అనుభవించి, మహాసృష్టి ప్రారంభంలో చతుర్దశ మనువుల్లో ఒకడిగా జన్మిస్తాడు.

**7. నగ్నమూర్తి :**

నగ్నం చతుర్భుజం శ్వేతం త్రినేత్రం సర్పమేఖలం ।
కపాలహస్తం దేవేశం కృష్ణకుంచిత మూర్ధజం ॥

నగ్నంగా ఉండేవాడు, నాలుగు చేతులు, మూడుకళ్ళు కలిగినవాడు, సర్పాలు మొలత్రాడుగా కలిగినవాడు, పుర్రె చేతిలో ఉన్నవాడు, నల్లని ముంగురులున్నవాడు అయిన, భైరవ మూర్తిని ప్రతిష్ఠించేవాడు, ఎన్నో కల్పాలు మహాకైలాసంలో నివసిస్తాడు.

## శివ మందిర నిర్మాణ ఫలితం

శివలింగాన్ని ప్రతిష్ఠిస్తే ఎంత పుణ్యఫలం లభిస్తుందో, శివమందిరాన్ని లేక శివాలయాన్ని నిర్మించినా అంతే పుణ్యం లభిస్తుంది. కనీసం ఇటుకలతో, మట్టిబెడ్డలతో శివాలయాన్ని నిర్మించినా శివుడి అనుగ్రహం లభిస్తుంది.

చిన్నతనంలో మట్టిబెడ్డలతో శివమందిరాన్ని నిర్మించిన వాడికి కైలాస నగర ప్రాప్తి కలుగుతుంది. కనుక ప్రయత్నించి ప్రయాస పడైనా సరే శివాలయ నిర్మాణానికి పూనుకోవాలి. అలా చేసినవాడికి ధర్మార్థకామమోక్షాలు సిద్ధిస్తాయి.

**శివమందిర భేదాలు :** 1.వేసరం 2.ద్రావిడం 3.నాగరం 4.కైలాసం 5.మందరం 6.మేరువు 7.నిషధం 8.హిమశైలం 9.నీలాద్రిశైలం 10.మహేంద్ర శైలం అనే మందిర భేదాలు శిల్పశాస్త్రంలో చెప్పబడ్డాయి.

వేసర లేక, నాగర, ద్రావిడ పద్ధతుల్లో ఏదో ఒక పద్ధతిననుసరించి శివాలయాన్ని నిర్మించిన వాడికి అఖండమైన పుణ్య సంపదలు చేకూరుతాయి. అలాగే కైలాసం, మందరం, మేరుగిరి, హిమశైలం, నీలాద్రి, నిషధగిరి, మహేంద్రశైలం లాంటి పద్ధతుల్లో శివమందిరాన్ని నిర్మించేవాడు శరీరం వదిలిన తరువాత దివ్య విమానాన్ని అధిరోహించి, కిన్నర కింపురుషులు కీర్తిస్తుండగా కైలాసాన్ని చేరి శివసాయుజ్యాన్ని పొందుతాడు.

**జీర్ణశివాలయ పునరుర్ధరణ :**

జీర్ణంవా పతితంవా ఽ పి ఖండితం స్ఫుటితం తథా ।
పూర్వవత్కారయేద్యస్తు ద్వారాద్యైః సుశుభం ద్విజా ॥
ప్రాసాదం మండపం వాఽ పి ప్రాకారం గోపురం తువా ।
కర్తురప్యధికం పుణ్యం లభతే నాత్ర సంశయః ॥

జీర్ణమైనది, విరిగి పడిపోయింది, పాతదైనది, వర్షాల వల్ల కూలిపోయింది అయిన శివాలయాన్ని తిరిగి నూతనంగా ఉద్ధరించి నిర్మించినవాడు అలాగే ఆలయానికి పూర్వం ఉన్న శిఖరాలు, గోపురాలు, ప్రాకారాలు, మండపాలు యథా ప్రకారం నిర్మించినవాడు నూతనంగా శివాలయం నిర్మించిన వాడికన్నా ఎక్కువ పుణ్యఫలాన్ని పొందుతాడు. ఇందుకేమాత్రం సందేహం లేదు.

శివానుగ్రహం కావాలనుకునేవాడు తన శక్తికొద్దీ కర్రలు, ఇటుకలతోనైనా ప్రయాసపడి శివాలయాన్ని నిర్మించాలి అది అతడి కర్తవ్యం. ఒకవేళ శివాలయాన్ని నిర్మించే శక్తి లేకపోతే శివాలయంలోని గర్భాలయ, మండపాలని ఒక నెలరోజుల పాటు, మెత్తని చీపురుతో తుడిచి, శ్రీగంధం గోమయం కలిపిన నీళ్ళతో శుభ్రపరిచినట్లైతే చాంద్రాయణవ్రతాన్ని ఒక సంవత్సరం పాటు ఆచరించిన ఫలితం పొందుతాడు.

**శివక్షేత్రాల పరిధి :** 1.స్వయంభూలింగాలకి – అర్ధక్రోశ వరకూ 2.ఋషులు ప్రతిష్ఠించిన లింగాలకి – పాదక్రోశం వరకు 3.మానవులు ప్రతిష్ఠించిన లింగాలకి – క్రోశలో పదహారోభాగం వరకు 4.సన్న్యాసులు

ప్రతిష్ఠించిన లింగాలకి ఒక క్రోశలో పదహారో భాగం వరకు, 5. శ్వేతాచార్యాది శివావతారపురుషులు ప్రతిష్ఠించబడ్డ ఆలయాలకి అర్ధక్రోశవరకూ ఉన్న ప్రాంతాన్ని శివక్షేత్రాలుగా పరిగణిస్తారు. ఈ పరిధిలో ఏ పుణ్యకార్యం చేసినా పాపకార్యం చేసినా అది ద్విగుణీకృత ఫలితాన్నిస్తుంది.

**ముక్తినిచ్చే శివక్షేత్రాలు :** కేదారం, ప్రయాగ, కురుక్షేత్రం, ప్రభాసతీర్థం, పుష్కరం, అవంతి, అమరేశ్వరం, త్రివిష్టపం, సంగమేశ్వరం, శాలకం, జంబుకేశ్వరం, శుక్రేశ్వరం, గోకర్ణం, భాస్కరేశ్వరం, గుహేశ్వరం, హిరణ్యగర్భం, నందీశ్వరం, శ్రీశైలం దాని పరిసర ప్రాంతాలు ఇవన్నీ ముక్తినిచ్చే శివక్షేత్రాలు. ఈ ప్రాంతాల్లో విధివశాత్తు మరణం సంభవిస్తే వారు సరాసరి కైలాసానికి చేరుకుంటారు. వీటితోపాటు దేవతలు ప్రతిష్ఠించిన, ఋషులు స్థాపించిన, స్వయంభూ లింగాలు కొలువై వున్న శివక్షేత్రాల సమీపంలో ప్రాణం పోయినా ముక్తి లభిస్తుంది.

**శివక్షేత్ర దర్శనఫలం :** పరమపవిత్రమైన శివక్షేత్రాల్ని దర్శించటం ఎంతో పుణ్యప్రదంకాగా, ఆ ఆలయాలలోకి ప్రవేశించి, అక్కడి శివలింగాన్ని తాకి, ఆ శివాలయంలో ప్రదక్షిణలు చేసి, అక్కడున్న శివతీర్థంలోని జలాలలో స్నానం చేసినట్లైతే ఒకదానికన్నా ఒకటి వందరెట్లు అధికమైన పుణ్యఫలం లభిస్తుంది. ఇక నీళ్ళతో, పాలతో, పెరుగుతో, నెయ్యి, పంచదారలతో శివలింగాన్ని అభిషేకించటం వల్ల శివానుగ్రహం సంపూర్ణంగా లభిస్తుంది.

**శివలింగదర్శన ఫలం :** పవిత్రమైన శివలింగాన్ని ఉదయంపూట దర్శించినవాడు ఊర్ధ్వలోకాలకి చేరి ఉన్నతమైన పదవి పొందుతాడు. మధ్యాహ్న కాలంలో శివలింగాన్ని దర్శించిన వాడు ఒక మహాయాగాన్ని చేసిన పుణ్యఫలాన్ని పొందుతాడు. అదే సాయంత్రం సమయంలో ఆలయంలోని పరమేశ్వరుణ్ణి దర్శించేవాడు సమస్తయజ్ఞాలు చేసిన ప్రతిఫలాన్ని పొందుతాడు. సంక్రాంతి లాంటి పర్వదినాలలో శివదర్శనం చేస్తే ఒక నెలరోజుల్లో చేసిన పాపాలు పరిహరించబడతాయి. ఉత్తరాయణ, దక్షిణాయన పర్వకాలాలలో శివదర్శనం చేసిన వాడికి అర్ధమాసం (15రోజులు) చేసిన పాపాలు నశిస్తాయి.

**శివాలయ ప్రదక్షిణావిధి :** శుచిగా శివాలయంలోకి ప్రవేశించిన వాడు ముందుగా సవ్యాపసవ్య మార్గంలో నెమ్మదిగా మూడు సార్లు ప్రదక్షిణ చేయాలి. అలాచేసిన వాడికి ప్రతి అడుగుకీ ఒక అశ్వమేధయాగం చేసిన ఫలితం లభిస్తుంది.

సవ్యాపసవ్యాలంటే! ధ్వజస్తంభం నుంచి ఎడమవైపుగా నడిచి తిరిగి ధ్వజస్తంభం నుంచి కుడి వైపుకి నడిచి, మొత్తం చుట్టూ తిరిగి ధ్వజస్తంభం దగ్గరికి వస్తే అది ఒక ప్రదక్షిణం అవుతుంది. అలా చేయటం సాధ్యంకానివారు ముందుగా ధ్వజస్తంభం దగ్గరకి వచ్చి ఒకసారి నమస్కరించి ఎడమవైపుగా నడుస్తూ గుడిచుట్టూ ప్రదక్షిణ చేసి తిరిగి ధ్వజస్తంభం దగ్గరకి రావాలి. ఇలా కనీసం మూడు లేదా 11 సార్లు ప్రదక్షిణ చేసి ఆలయంలోకి ప్రవేశించాలి. లోపలికి వెళ్ళాక ముందుగా నందీశ్వరుణ్ణి గణపతిని దర్శించి ఆ తరువాత శివుణ్ణి, దేవిని దర్శించాలి.

**ఈశ్వర ప్రార్థన :** వాచాయస్తు శివం నిత్యం సంస్తౌతి పరమేశ్వరం ।
సోஉపియాతి శివస్థానం ప్రాప్య కింపునరేవ చ ।

ప్రతిరోజూ పరమేశ్వరుణ్ణి, స్తోత్రాల, మంత్రాల రూపంలో (వాక్కు) ప్రార్థించేవాడు శివసాయుజ్యాన్ని పొందుతాడు. ఇక శివాలయాన్ని దర్శించిన వాడి ఫలితం గురించి చెప్పేదేముంది.

## సామాన్యుడికి శివానుగ్రహ ప్రాప్తి

పరమేశ్వరుడు మహాయోగులకీ తపస్వులకీ కూడా సులభంగా సాక్షాత్కరించేవాడు కాడు కదా! మరి సామాన్య భక్తులు ఆయన్ని పొందటం ఎలా అంటే? శ్రద్ధా భక్తులతో, ఆర్తితో, శంకరుణ్ణి పూజిస్తే చాలు. భక్తజన వత్సలుడైన ఆయన సామాన్యుడికి కూడా దర్శనమిస్తాడు. భక్తులు ఏభావంతో తనని సేవిస్తారో అందుకు తగ్గ ఫలితాల్నే వారికి ప్రసాదిస్తుంటాడు.

ఎంగిలి నోటితో శివుణ్ణి అర్చించేవాడు రుద్రపిశాచంగా మారతాడు. క్రోధంతో శివుణ్ణి అర్చించేవాడు రాక్షసుడిగా జన్మిస్తాడు. తినకూడని పదార్థాలు తిని శంకరుణ్ణి సేవించేవాడు యక్షుడిగా పుడతాడు.

పాటలు పాడుతూ నృత్యాలు చేస్తూ శంభుణ్ణి ఆరాధించిన వాడు గంధర్వుడుగా జన్మిస్తాడు. సుఖాలమీద కోరికతో శివుణ్ణి సేవించేవాడు బుధలోకంలో నివసిస్తాడు మదగర్వంతో త్రిశూలధారిని అర్చించేవాడు చంద్రలోకంలో నివసిస్తాడు. ఓంకారం పఠిస్తు పరమేశ్వరుణ్ణి పూజించినవాడు బ్రహ్మలోక లేక వైకుంఠానికి చేరుకుంటాడు. గాయత్రీ మంత్రాన్ని ఉచ్చరిస్తూ మహాదేవుణ్ణి అర్చిస్తే బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది.

**శివపూజావిధి :** పంచసూత్ర పద్ధతిలో నిర్మించిన శివలింగాన్ని ప్రాణపతిష్ఠాదులతో శోధించి, ముందుగా లింగ పీఠాన్ని పవిత్రమైన జలంతో ప్రోక్షించాలి. తరువాత పంచోపచార పూజలు చేసి ఆవుపాలు, పెరుగు, నేయి, తేనె, పంచదారలు కలిపిన పంచామృతంతో, కొబ్బరినీళ్ళతో శివలింగాన్ని అభిషేకించాలి. అభిషేకం చేసేడప్పుడు శివపంచాక్షరిని గానీ, రుద్రాధ్యాయాన్ని గానీ పఠించాలి. అభిషేకానంతరం-శ్రీగంధం, ఎర్రకలువలు లాంటి వికసించిన పుష్పాలతో, అఖండమైన బిల్వదళాలతో, కమలాలతో, నల్లకలువలతో, నందివర్ధనం, మల్లిక, సంపెంగ, జాజి, వకుళ, గన్నేరు, జమ్మి, వాకుడు, ఉమ్మెత్త, అగిసె, ఉత్తరేణి, కదంబ పుష్పాలతో అర్చించాలి.

ఈ విధంగా పూజచేసిన తరువాత వివిధ అలంకారాలు సమర్పించి అగరు, జివ్వాజి శ్రీగంధచూర్ణం కలిపిన మిశ్రమంతో ధూపాన్ని వేసి, నేతి దీపాన్ని వెలిగించాలి. తేనె, నెయ్యి కలిపిన పెరుగన్నాన్ని, వివిధ రకాల ఆహారపదార్థాలతో కూడిన శుద్ధాన్నాన్ని దానిపై నెయ్యి వేసి మహానైవేద్యంగా సమర్పించాలి. నైవేద్యానంతరం తాంబూలం, ఫలం మహానీరాజన, మంత్ర పుష్పాల్ని సమర్పించి, ప్రదక్షిణ నమస్కారాలు చేసి, శివస్తోత్రాలు పఠించి ఆ తరువాత చివరగా ఛత్రచామరాది రాజోపచారాలు పరమేశ్వరుడికి సమర్పించాలి.

ఒకవేళ ఈ విధంగా పూజని చేయలేనివారు సద్యోజాత-వామదేవ-అఘోర- తత్పురుష ఈశానాది పంచబ్రహ్మ మంత్రాల్ని పఠిస్తూ పరమేశ్వరుణ్ణి ఆరాధించవచ్చు.

**శివపూజా ఫలం :** శివారాధన కోసం ఉపయోగపడే పుష్పాలు, ఫలాలు, బిల్వాది పత్రాలు, పాలు పెరుగులందించే గోవులు అన్నీ మోక్షాన్ని పొందుతాయి. ఎందుకంటే అవి కూడా పరోక్షంగా శివారాధన చేసాయి కనుక. మానవుడు తన జీవితకాలంలో సోమవారం, మాసశివరాత్రి, మహాశివరాత్రి పర్వదినాలలో భక్తి శ్రద్ధలతో కనీసం ఒకసారైనా శివలింగాన్ని శాస్త్రోక్తంగా పూజిస్తే వాడు కర్మశేషాన్ని పోగొట్టుకుని పునరావృత్తిలేని శివసాయుజ్యాన్ని పొందుతాడు.

శివలింగాన్ని అర్చించేవాడే కాదు శివలింగాన్ని అర్చించేడప్పుడు దర్శించినవాడికి కూడా అమితమైన పుణ్యఫలం లభిస్తుంది. శివారాధన కోసం ప్రయత్నించేవాడికి సహకరించే వాడు, అందుకు ప్రోత్సహించేవాడు, అందరూ ముక్తిని పొందుతారు.

**దీపారాధన ఫలం :** సెమ్మెమీద, మట్టి ప్రమిదల్లో, కర్ర స్తంభం మీద, శివాలయాలలో దీపాన్ని వెలిగించిన వారు తమ వంశం వారితో సహా కైలాసాన్ని చేరి మహావైభవంతో నివసిస్తాడు. ఇనుము లేక రాగి ఇత్తడి, వెండి, బంగారం వీటిలో ఏదో ఒక ప్రమిదలో శివుడి సన్నిధిలో దీపం వెలిగించిన వారు కైలాసానికి చేరుకుంటారు. కార్తీక మాసంలో పరమేశ్వరుడి సన్నిధిలో ఆవునేతితో దీపారాధన చేస్తే శాశ్వత బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది.

## ద్వాదశ లింగ వ్రతం

పూర్వం సనత్కుమారుడు ప్రశ్నించగా నందికేశ్వరుడు ఈ దివ్య వ్రతాన్ని ఆయనకి ఉపదేశించాడు.

**వ్రతప్రాశస్త్యం :** శివానుగ్రహాన్ని సంపూర్ణంగా కలిగించే వ్రతాలలో ప్రధానమైనది ఈ ద్వాదశలింగ వ్రతం. ఇది శివభక్తుల భయాలన్నిటినీ తొలగిస్తుంది. ఆత్మీయులలో ఎప్పటికీ ఎడబాటు కలగనీయదు. భోగ మోక్షాలు రెండిటినీ ప్రసాదిస్తుంది. షడంగాలతో కూడిన వేదాల సారంగా కీర్తి పొందిన ఈ వ్రతం మహాదానాలు చేసిన ఫలాన్ని, అలాగే పదివేల అశ్వమేధయాగాలు చేసిన ఫలితాన్ని, మించిన పుణ్యఫలాన్ని ప్రసాదిస్తుంది. అంతేకాదు సమస్త

శుభాల్నీ చేకూర్చి, శత్రువులందర్నీ ఓడించి, మహాజ్వరాది వ్యాధులన్నిటినీ తగ్గిస్తుంది కూడా. పూర్వం బ్రహ్మాది దేవతలందరూ ఈ ద్వాదశలింగవ్రతాన్ని ఆచరించి తమ తమ పదవుల్ని స్థిరపరుచుకున్నారు.

**వ్రతవిధానం :** చైత్రమాసం నుంచి ఫాల్గుణ మాసం పూర్ణిమ దాకా ఈ వ్రతాన్ని ఆచరించాలి.

నవరత్న ఖచితమైన అష్టదళ బంగారు పద్మాన్ని తయారు చేయించాలి. దాని మధ్యలో ఉండే కర్ణిక పీఠం మీద కాస్త పెద్దదిగా ఉండే స్ఫటిక శివలింగాన్ని స్థాపించాలి. భస్మం, గంధపుష్పాక్షతలతో, తెల్లటి వెయ్యి కమలాలతో, నల్లని కలువలతో, తెల్లజిల్లేడు, కొండగోగు, గన్నేరు లాంటి పుష్పాలతో, బిల్వదళాలతో యథాశక్తి లభించిన వాటితో పరమేశ్వరుణ్ణి శ్రద్ధగా పూజించాలి. ధూపదీప నైవేద్యాలు నీరాజన మంత్రపుష్పాలు సమర్పించాలి.

ఈ షోడశోపచార పూజ చేసేడప్పుడు ప్రతి ఉపచారాన్ని సమర్పించే ముందు "ఓం తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి" తన్నో రుద్రః ప్రచోదయాత్" అనే రుద్రగాయత్రీ మంత్రాన్ని పఠించాలి. ఇలా ప్రతినెలా పూర్ణిమనాడు ఈ వ్రతాన్ని ఆచరించాలి. పన్నెండో నెలలో పూర్ణిమనాడు ఈ వ్రతాన్ని పూర్తిచేసాక యథాశక్తి భోజన పదార్థాలని మహా నైవేద్యంగా శివుడికి సమర్పించి, దాన్ని భక్తులకి సంతోషంతో వితరణ చేయాలి.

ఈ స్ఫటికలింగాన్ని ప్రతినెలా పౌర్ణమినాడు అర్చించేడప్పుడు సద్యోజాత – వామదేవ– అఘోర – తత్పురుష – ఈశానులనే పంచ బ్రహ్మల మంత్రాల్ని అర్చనలో ఉపయోగించవచ్చు. మరొక పద్ధతి ప్రకారం ప్రతినెలా ఒక్కొరకం లింగాన్ని అష్టదళ పద్మంలో ఉంచి పూజించవచ్చు.

1.వైశాఖమాసంలో – వజ్రలింగం 2.జ్యేష్ఠమాసం – మరకత (పచ్చ) లింగం 3.ఆషాఢ మాసంలో – ముత్యాల చూర్ణంతో చేసిన లింగాన్ని 4.శ్రావణ మాసంలో – నీలమణిలింగం 5.భాద్రపద మాసంలో – పద్మరాగంతో నిర్మించిన లింగం 6.ఆశ్వియుజ మాసంలో–గోమేధిక లింగ 7.కార్తీకమాసంలో–పగడాలతో

చేసిన లింగం 8.మార్గశీర్ష మాసంలో–వైఢూర్య లింగం 9.పుష్యమాసంలో – పుష్యరాగమణితో చేసిన లింగం 10.మాఘమాసంలో–సూర్యకాంతమణితో చేసిన లింగం 11.ఫాల్గుణ మాసంలో–స్ఫటిక లింగాన్ని 12.చైత్ర మాసంలో– నవరత్న లింగాన్ని స్థాపించి పూర్వం చెప్పిన విధంగానే అర్చించాలి.

ఈ ద్వాదశ (12) లింగవ్రతంలో శివలింగాన్ని ఉంచే వేదికగా అష్టదళ సువర్ణ పద్మమే ఉండాలి. శక్తిలేనివారు వెండి పద్మాన్ని కూడా చేయించి వేదికగా ఉపయోగించవచ్చు. అలాగే శివలింగాలు కూడా ఒక్కోనెలా ఒక్కో లింగాన్ని తెచ్చి అర్చించలేనివారు, పన్నెండు నెలలూ స్ఫటికలింగాన్ని లేదా పార్థివ (మట్టితో చేసిన) లింగాన్ని గానీ ప్రతిష్ఠించి అర్చించవచ్చు.

**పూజా ద్రవ్యాలు–ఫలితాలు :** పూజలో భాగంగా బిల్వదళాల్ని ఉపయోగించటం శ్రేష్ఠం. ఎందుకంటే వాటిలో లక్ష్మీదేవి కొలువైవుంటుంది. అలాగే నల్లకలువల్లో పార్వతీదేవి, ఎర్ర కలువల్లో కుమారస్వామి, కమలంలో మహాదేవుడు నివసిస్తారు. కనుక ఈ పూలు కూడా పూజకి శ్రేష్ఠమైనవే. ఈ నీలోత్పలాలు, ఉత్పలాలు, కమలాలతో శివపూజ చేస్తే సర్వజన వశీకరణ శక్తి సంప్రాప్తిస్తుంది. అదేవిధంగా గుగ్గులతో ధూపం వేసినా, దీపాన్ని వెలిగించినా సకల రోగాలూ క్షయమై పోతాయి. శ్రీ గంధాన్ని స్వామికి సమర్పిస్తే సర్వాభీష్టాలూ నెరవేరుతాయి.

తెల్లజిల్లేడు పూలలో బ్రహ్మదేవుడు, గన్నేరు పూవులో గణపతి, జపాపుష్పంలో నారాయణుడు, సువాసనభరితమైన అన్నిరకాల పూలలో పార్వతీదేవి నివసిస్తారు. ఈ తెలిపిన పుష్పాలలో ఏవి లభిస్తే వాటితో పరమేశ్వరుణ్ణి అర్చించాలి.

**నైవేద్యాలు :** శివపూజలో భాగంగా స్వామికి నివేదనలు సమర్పించాలి. పరమాన్నం మీద నెయ్యివేసి నివేదన చేయాలి. వంద లేక ఏభై కిలోలు బియ్యంతో ఉడికించిన అన్నంగానీ, పెసరపప్పుతో చేసిన పులగాన్ని గానీ నైవేద్యం పెట్టాలి. న్యాయంగా సంపాదించిన ద్రవ్యంతో వివిధరకాల భక్ష్యాల్ని, భోజ్యాల్ని శివుడికి నివేదన చేసి భక్తులకి వితరణ చేయాలి. వరి అన్నంలో త్రిమూర్తులు నివసిస్తారు. కనుక అన్నరాశిని శివలింగానికి నివేదించి భక్తులకి పంచితే త్రిమూర్తులు ఎంతో సంతోషిస్తారు.

శివలింగంలో ఉన్న పీఠాన్ని ప్రకృతి అని, లింగాన్ని పురుషుడని అంటారు. అలాగే శివలింగానికి ఇంకా కొన్ని రకాల నిర్వచనాలున్నాయి. అది 1.ప్రకృతి పురుషాత్మకమని 2.హరిహరాత్మకమని 3.శక్తిశివాత్మకమని 4.ప్రణవాత్మకమని. ఇలాంటి శివశక్త్యాత్మకమైన లింగాన్ని ప్రతి పౌర్ణమినాడు శ్రద్ధా భక్తులతో అర్చించిన వాడికి సకల కోరికలూ సిద్ధిస్తాయి.

**వ్రత ఉద్యాపన :** పన్నెండు నెలలపాటు వరుసగా ప్రతి పౌర్ణమికి క్రమం తప్పకుండా ద్వాదశలింగ వ్రతాన్ని ఆచరించాలి. చివరి పౌర్ణమినాడు లింగానికి యథాశక్తి నివేదనలు చేసి శివభక్తులకి ఆ ప్రసాదాన్ని వితరణ చేయాలి. ఈ వ్రతం చేసే అన్ని పౌర్ణమిలకిగానీ లేదా చివరి పౌర్ణమినాడు గానీ నక్తం ఉండాలి(ఉదయం ఉపవాసం రాత్రికి భోజనం). చివరి పౌర్ణమినాడు పూజానంతరం గోదానం చేయాలి. అలాగే ఒక వృషభాన్ని కొని దాన్ని పూజించి శివుడి ముందు స్వేచ్ఛగా విడిచిపెట్టాలి. శ్రోత్రియులైన బ్రాహ్మణులకి షడ్రసోపేతమైన భోజనాన్ని పెట్టి దక్షిణ తాంబూలాలతో యథాశక్తి సత్కరించాలి.

**వ్రతఫలితం :** ఈ విధంగా పన్నెండు నెలలు ఈ శివలింగ మహావ్రతాన్ని ఆచరించే పుణ్యాత్ముడు శివయోగులందరిలోకీ గొప్పవాడవుతాడు. శరీరం విడిచాక కోటి సూర్యుల కాంతితో ప్రకాశించే దివ్యవిమానంలో శివలోకానికి చేరి పునర్జన్మ లేకుండా అక్కడే శాశ్వతమైన ఆనందాన్ని అనుభవిస్తాడు. ఒకవేళ పన్నెండు నెలలు ఈ వ్రతాన్ని వరుసగా ఆచరించలేనివాళ్ళు కనీసం ఏదో ఒకనెలలోనైనా శ్రద్ధగా వ్రతాన్ని ఆచరించవచ్చు. అలాగే ప్రతి సంవత్సరం ఒక పూర్ణిమనాడు ఈ వ్రతాన్ని చేసుకోవచ్చు.

ఏఏ కోరికలతో ఈ వ్రతాన్ని ఆచరిస్తారో ఆయా కోరికలన్నీ తప్పకుండా తీరిపోతాయి. ఒక్క నెల ఈ వ్రతాన్ని ప్రారంభించిన వెంటనే అరిష్టాలన్నీ క్రమంగా తొలగిపోవటం ప్రారంభిస్తాయి. ఈ వ్రతం పవిత్రమైనది. వేద, పురాణ, ఇతిహాస సమమైనది. ఎంతో రహస్యమైనదని సాక్షాత్తు బ్రహ్మదేవుడే చెప్పాడు. ఈ వ్రతాన్ని ఆచరించినవారు వ్రతానంతరం సకల సిద్ధుల్నీ ప్రసాదించే 'వ్యపోహన' స్తోత్రాన్ని తప్పకుండా పఠించాలి.

# సకల పాపహర వ్యపోహన స్తోత్రమహిమ

సకల పాపాలనీ పఠించిన వెంటనే తొలగించే దివ్యస్తోత్రం ఈ వ్యపోహన స్తోత్రం. ఈ స్తోత్రాన్ని బ్రహ్మదేవుడే స్వయంగా రచించాడు. ద్వాదశలింగవ్రతాన్ని ఆచరించినవారే కాక ఎవరైనా ఎప్పుడైనా ఈ దివ్యస్తోత్రాన్ని పఠించి సకల పాపాలనుంచీ విముక్తులు కావచ్చు.

106 శ్లోకాలతో ఉన్న ఈ దివ్యస్తోత్రంలో 1.సదాశివప్రార్థన 2.శివావతార ప్రార్థన 3.దేవీప్రార్థన 4.చండీశ్వరస్తుతి 5.నందికేశ్వర స్తుతి 6.గణపతి స్తుతి 7.భృంగీశ్వర స్తుతి 8.కుమారస్వామి స్తుతి 9.అష్టమూర్తిస్తుతి 10.ఏకాదశ రుద్రస్తుతి 11.ద్వాదశాదిత్యస్తుతి 12.ఆకాశాది అష్టమూర్తి స్థానస్తుతి 13.దశదిక్పాలక స్తుతి 14.వాయవ్యాది స్తుతి 15.అష్టచారణుల స్తుతి 16.సిద్ధుల స్తుతి 17.యక్షేశస్తుతి 18.మహానాగస్తుతి 19.కిన్నరస్తుతి 20.విద్యాధరస్తుతి 21.అసురస్తుతి 22.గరుత్మంతుడి స్తుతి 23.ఋషి స్తుతి 24.పితృస్తుతి 25.మాతృస్తుతి 26.అప్సరస్తుతి 27.నవగ్రహస్తుతి 28.ద్వాదశరాశి స్తుతి 29.నక్షత్రస్తుతి 30.ప్రమథగణ స్తుతి 31.వృషేంద్రస్తుతి 32.గంగాగోప్రార్థన స్తుతి 33.కాలభైరవస్తుతి 34.మాతృకాస్తుతి 35.వీరభద్రస్తుతి 36.మహాలక్ష్మి స్తుతి 37.మహామాయా స్తుతి 38.లక్ష్మీస్తుతి 39.దుర్గాదేవి స్తుతి 40.అనేక రుద్రులస్తుతి 41.భూతప్రేత పిశాచ స్తుతి అనే దివ్య స్తుతులు కలిసి ఉన్నాయి. ఇంతటి అద్భుతమైన స్తోత్రం ఇంతవరకూ మరే పురాణంలో చెప్పబడలేదు.

సూతమహర్షి నైమిశారణ్యంలో ఉన్న శౌనకాది మహామునులలో "ఋషులారా! పూర్వం బ్రహ్మదేవుడి ద్వారా బోధించబడి, నందికేశ్వరుడు పఠిస్తుండగా కుమారస్వామి దాన్ని విన్నాడు. కుమారస్వామి ద్వారా ఈ దివ్య స్తోత్రాన్ని వ్యాసమహర్షి తెలుసుకోగా ఆయన్ని ప్రాధేయపడి నేనీ స్తోత్రాన్ని సంపాదించాను. ఇది సర్వసిద్ధిప్రదమైనది. సకల శుభాల్నీ కలిగించేది. సకల పాపహరమైన ఈ మహిమాన్విత స్తోత్రాన్ని చెబుతున్నాను, శ్రద్ధగా వినండి" అని వారికి ఈ స్తోత్రాన్ని ఉపదేశించాడు.

## సకలపాపహర వ్యపోహన స్తోత్రం :

శ్లో॥ వ్యపోహనస్తవం వక్ష్యే - సర్వసిద్ధిప్రదం శుభం ।
నందిన శ్చ ముఖా చ్ఛృత్వా కుమారేణ మహాత్మనా ! 1

శ్లో॥ వ్యాసాయ కథితం తస్మాత్ బహుమానేన వై మయా ।

శ్లో॥ నమః శివాయ శుద్ధాయ నిర్మలాయ యశస్వినే ।
దుష్టాంతకాయ సర్వాయ భవాయ పరమాత్మనే ॥ 2

**సదాశివ ప్రార్థన :**

శ్లో॥ పంచవక్త్రో దశభుజో - హ్యక్షపంచదశై ర్యుతః ।
శుద్ధస్ఫటిక సంకాశః సర్వాభరణభూషితః ॥ 3

శ్లో॥ సర్వజ్ఞః సర్వగః శాంతః సర్వోపరి సుసంస్థితః ।
పద్మాసనస్థః సోమేశః - పాప మాశు వ్యపోహతు ॥ 4

శ్లో॥ ఈశానః పురుషశ్చైవ అఘోర స్సద్య ఏవ చ ।
వామదేవ శ్చ భగవాన్ - పాప మాసు వ్యపోహతు ॥ 5

**శివావతార ప్రార్థన :**

శ్లో॥ అనంతః సర్వవిద్యేశః సర్వజ్ఞః సర్వదః ప్రభుః ॥
శివద్యానైకసంపన్నః - స మే పాపం వ్యపోహతు ॥ 6

శ్లో॥ సూక్ష్మః సురాసురేశానో విశ్వేశో గణపూజితః ।
శివధ్యానైక సంపన్నః స మే పాపం వ్యపోహతు ॥ 7

శ్లో॥ శివోత్తమో మహాపూజ్యః - శివధ్యానపరాయణః ।
సర్వగః సర్వదః శాంతః - స మే పాపం వ్యపోహతు ॥ 8

శ్లో॥ త్రిమూర్తి ర్భగవానీశః శివభక్తిప్రబోధకః ।
శివధ్యానైక సంపన్నః స మే పాపం వ్యపోహతు ॥ 9

శ్లో॥ శ్రీకంఠః శ్రీపతిః శ్రీమాన్ శివధ్యానరత స్సదా ।
శివార్చనరతః శ్రీమాన్ - స మే పాపం వ్యపోహతు ॥ 10

**దేవీ ప్రార్థన :**

శ్లో॥ త్రైలోక్యనమితా దేవీ - సోల్కాకారా పురాతనీ ।
దాక్షాయణీ మహాదేవీ - గౌరీ హైమవతీ శుభా ॥ 11

శ్లో॥ ఏక పర్ణాగ్రజా సౌమ్యా - తథావై చైకపాటలా ।
అపర్ణా వరదా దేవీ - భక్తత్రాణపరాయణా ॥ 12

శ్లో॥ ఉమాఽ సురహరా సాక్షాత్ - కౌశికీ వా కపర్దినీ ।
ఖట్వాంగధారిణీ దివ్యా - కరాగ్రతరుపల్లవా ॥ 13

శ్లో॥ నైగమేయాదిభి ర్దివ్యై - శ్చతుర్భిః పుత్రకై ర్వృతా ।
మేనాయా నందినీ దేవీ వారిజా వారిజేక్షణా ॥
అంబా యా వీతశోకస్య నందిన శ్చ మహాత్మనః ॥ 14

శ్లో॥ శుభావత్యాః సఖీ శాంతా పంచచూడా వరప్రదా ।
సృష్ట్యర్థం సర్వభూతానాం ప్రకృతిత్వం గతాఽవ్యయా ॥ 15

శ్లో॥ త్రయోవింశతిభి స్తత్త్వై - ర్మహదాద్యై ర్విజృంభితా ।
లక్ష్మ్యాది శక్తిభి ర్నిత్యం - నమితా నందనందినీ ॥ 16

శ్లో॥ మనోన్మనీ మహాదేవీ - మాయావీ మండన ప్రియా ।
మాయయా యా జగత్సర్వం-బ్రహ్మాద్యం సచరాచరమ్ ॥ 17

శ్లో॥ క్షోభిణీ మోహినీ నిత్యం-యోగినాం హృది సంస్థితా ।
ఏకానేకస్థితాలోకే ఇందీవరనిభేక్షణా ॥ 18

శ్లో॥ భక్త్యా పరమయా నిత్యం - సర్వదేవై రభిష్టుతా ।
గణేంద్రాంభోజ గర్భేంద్ర - యమ విత్తేశ పూర్వకైః ॥ 19

శ్లో॥ సంస్తుతా జననీ తేషాం - సర్వోపద్రవ నాశినీ ।
భక్తానా మార్తిహా భవ్యా - భవభావవినాశినీ ॥ 20

శ్లో॥ భుక్తిముక్తిప్రదా దివ్యా - భక్తానా మప్రయత్నతః ।
సా మే సాక్షాన్మహాదేవీ - పాపమాశు వ్యపోహతు ॥ 21

**చండీశ్వర ప్రార్థన :**

శ్లో॥ చండః సర్వగణేశానో - ముఖా చ్ఛంభో ర్వినిర్గతః ।
శివార్చన రతః శ్రీమాన్ - స మే పాపం వ్యపోహతు ॥ 22

**నందికేశ్వర ప్రార్థన :**

శ్లో॥ శాలంకాయనపుత్రస్తు - హలమార్గోత్థితః ప్రభుః ।
జామాతా మరుతాం దేవః - సర్వభూత మహేశ్వరః ॥ 23

శ్లో॥ సర్వగః సర్వదృక్ శర్వః సర్వేశసదృశః ప్రభుః ।
సనారాయణకై ర్దేవైః సేంద్రచంద్రదివాకైః ॥ 24

శ్లో॥ సిద్ధై శ్చ యక్షగంధర్వై - ర్భూతై ర్భూతవినాయకైః ।
ఉరగై ర్ఋషిభిశ్చైవ - బ్రహ్మణా చ మహాత్మనా ॥ 25

శ్లో॥ స్తుత స్త్రైలోక్యనాథస్య - మునే రంతఃపురే స్థితః ।
సర్వదా పూజితః సర్వై - ర్నందీ పాపం వ్యపోహతు ॥ 26

శ్లో॥ మహాకాయో మహాతేజా - మహాదేవ పరాయణః ।
శివార్చనరతః శ్రీమాన్ సుయశాప్రాణ నాయకః ॥ 27

**గణేశ ప్రార్థన :**

శ్లో॥ మేరు మందర కైలాస - తట కూటప్రభే దనః ।
ఐరావతాదిభిర్దివ్యై - ర్దిగ్గజై శ్చ సుపూజితః ॥ 28

శ్లో॥ సప్తపాతాలపాద శ్చ - సప్తద్వీపోరుజంఘకః ।
సప్తార్ణవాంకుశశ్చైవ - సర్వతీర్థోదరః శివః ॥ 29

శ్లో॥ ఆకాశదేహో దిగ్బాహుః - సోమసూర్యాగ్నిలోచనః ।
హతాసుర మహావృక్షో - బ్రహ్మవిద్యా మహోత్కటః ॥ 30

శ్లో॥ బ్రహ్మాద్యాధోరణై ర్దివ్యై - ర్యోగపాశసమన్వితైః ।
బద్ధోహృత్ పుండరీకాఖ్యే - స్తంభే వృత్తిం నిరుధ్య చ ॥ 31

శ్లో॥ నాగేంద్రవక్త్రో యః సాక్షాత్ - గణకోటిశతై ర్వృతః ।
శివధ్యానైకసంపన్నః - స మే పాపం వ్యపో హతు ॥ 32

**భృంగీశ్వర ప్రార్థన :**

శ్లో॥ భృంగీశః పింగళాక్షోఽసౌ - భసితాశస్తు దేహయుక్ ।
శివార్చనరతః శ్రీమాన్ - స మే పాపం వ్యపోహతు ॥ 33

**కుమారస్వామి ప్రార్థన :**

శ్లో॥ చతుర్భిస్తనుభి ర్నిత్యం సర్వాసురనిబర్హణః ।
స్కందః శక్తిధరః శాంతః - సేనానీః శిఖివాహనః ॥ 34

**అష్టమూర్తి ప్రార్థన :**

శ్లో॥ భవః శర్వ స్తథేశానో - రుద్రః పశుపతి స్తథా । 35
ఉగ్రో భీమో మహాదేవః శివార్చనరతా స్సదా ॥
ఏతాః పాపం వ్యపోహంతు - మూర్తయః పరమేష్ఠినః ॥ 36

**ఏకాదశరుద్ర ప్రార్థన :**

శ్లో॥ మహాదేవః శివో రుద్రః - శంకరో నీలలోహితః ।
ఈశానో విజయో భీమో - దేవదేవో భవోద్భవః ॥ 37

శ్లో॥ కపాలీశ శ్చ విజ్ఞేయో రుద్రా రుద్రాంశసంభవాః ।
శివప్రణామ సంపన్నా - వ్యపోహంతు మలం మమ ॥ 38

**ద్వాదశాదిత్య ప్రార్థన :**

శ్లో॥ వికర్తనో వివస్వాంశ్చ - మార్తండో భాస్కరో రవిః ।
లోకప్రకాశకశ్చైవ - లోకసాక్షీ త్రివిక్రమః ॥ 39

శ్లో॥ ఆదిత్య శ్చ తథా సూర్య - శ్చాంశుమాంశ్చ దివాకరః ।
ఏతేవై ద్వాదశాదిత్యా - వ్యపోహంతు మలం మమ ॥ 40

**ఆకాశాది అష్టమూర్తిస్థాన ప్రార్థన :**

శ్లో॥ గగనం స్పర్శనం తేజో రస శ్చ పృథివీ తథా ।
చంద్ర స్సూర్యస్తథాఽత్మా చ తనవః శివభావితాః ॥ 41
పాపం వ్యపోహంతు మమ భయం నిర్నాశయంతు మే ।

**దశదిక్పాలక ప్రార్థన :**

శ్లో॥ వాసవః పావకశ్చైవ - యమో నిఋుతి రేవ చ । 42
వరుణో వాయు సోమౌ చ - ఈశానో భగవాన్ హరిః ॥
పితా మహశ్చ భగవాన్ - శివధ్యానపరాయణాః ॥ 43
శ్లో॥ ఏతే పాపం వ్యపోహతు మనసా కర్మణా కృతం ।

**వాయ్వాది ప్రార్థన :**

శ్లో॥ నభస్వాన్ స్పర్శనో వాయు రనిలో మారుత స్తథా ॥ 44
ప్రాణః ప్రాణేశ జీవేశౌ - మారుతః శివభావితాః ॥
శివార్చనరతా స్సర్వే - వ్యపోహంతు మలం మమ । 45

**అష్టచారణ ప్రార్థన :**

శ్లో॥ ఖేచరో వసుచార శ్చ - బ్రహ్మేశో బ్రహ్మధీ స్తథా ।
సుషేణః శాశ్వతః పుష్టః సుపుష్టశ్చ మహాబలః ॥ 46
శ్లో॥ ఏతే వై చారణాః శంభోః పుజాయాఽ తీవ భావితాః ।
వ్యపోహంతు మలం సర్వం పాపం చైవ మయా కృతమ్ ॥47

**సిద్ధ ప్రార్థన :**

శ్లో॥ మంత్రజ్ఞో మంత్రవిత్ ప్రాజ్ఞో మంత్రరాట్ సిద్ధపూజితః ।
సిద్ధవత్పరమః సిద్ధః - సర్వసిద్ధిప్రదాయినః ॥ 48
వ్యపోహంతు మలం సర్వే - సిద్ధాః శివ పదార్చకాః ।

**యక్షేశ ప్రార్థన :**

శ్లో॥ యక్షో యక్షేశ ధనదో - జృంభకో మణిభద్రకః । 49
పూర్ణభద్రేశ్వరో మాలీ - శితికుండలి రేవ చ ॥
శ్లో॥ నరేంద్రశ్చైవ యక్షేశా - వ్యపోహంతు మలం మమ ॥ 50

**మహానాగ ప్రార్థన :**

శ్లో॥ అనంతః కులికశ్చైవ వాసుకి స్తక్షక స్తథా ।
కర్కోటకో మహాపద్మః శంఖపాలో మహాబలః ॥ 51

శ్లో॥ శివ ప్రణామసంపన్నాః శివదేహ ప్రభూషణాః ।
మమ పాపం వ్యపోహంతు విషం స్థావరజంగమమ్ ॥ 52

**కిన్నర ప్రార్థన :**

శ్లో॥ వీణజ్ఞః కిన్నర శ్చైవ – సురసేనః ప్రమర్దనః ।
అతీశయః స ప్రయోగీ – గీతజ్ఞశ్చై కిన్నరాః ॥ 53

శ్లో॥ శివప్రణామసంపన్నా వ్యపోహంతు మలం మమ ।

**విద్యాధర ప్రార్థన :**

శ్లో॥ విద్యాధర శ్చ విబుధో – విద్యారాశి ర్విదాంవరః ॥ 54
విబుద్ధో విబుధః శ్రీమాన్ – కృతజ్ఞ శ్చ మహాయశాః ।

శ్లో॥ ఏతే విద్యాధరాః సర్వే – శివధ్యాన పరాయణాః ॥ 55
వ్యపోహంతు మలం ఘోరం – మహాదేవప్రసాదతః ।

**అసుర ప్రార్థన :**

శ్లో॥ వామదేవో మహాజంభః – కాలనేమి ర్మహాబలః ॥ 56
సుగ్రీవో మర్దకశ్చైవ పింగలో దేవమర్దనః ।

శ్లో॥ ప్రహ్లాద శ్చాప్యనుహ్లాదః సంహ్లాదః కిల భాష్కలః ॥ 57
జంభః కుంభ శ్చ మాయావీ – కార్తవీర్యః కృతంజయః ।

శ్లో॥ ఏతేఽసురా మహాత్మానో – మహాదేవ పరాయణాః ॥ 58
వ్యపోహంతు భయం ఘోర – మాసురం భావ మేవ చ ।

**గరుత్మత్ ప్రార్థన :**

శ్లో॥ గరుత్మాన్ ఖగతి శ్చైవ – పక్షిరాట్ నాగమర్దనః ॥ 59

శ్లో॥ నాగశత్రు ర్హిరణ్యాంగో వైనతేయః ప్రభంజనః ।
నాగాశీ ర్విషనాశ శ్చ – విష్ణువాహన ఏవ చ ॥ 60

శ్లో॥ ఏతే హిరణ్యవర్ణాభా – గరుడా వాతరంహసః ।
నానాఽభరణ సంపన్నా వ్యపోహంతు మలం మమ ॥ 61

**ఋషి ప్రార్థన :**

శ్లో॥ అగస్త్య శ్చ వసిష్ఠ శ్చ అంగిరా భృగురేవ చ । 62
కాశ్యపో నారద శ్చైవ దధీచ శ్చ్యవన స్తథా ॥

శ్లో॥ ఉపమన్యు స్తథాఽన్యే చ ఋషయః శివభావితాః ।
శివార్చనరతాః సర్వే వ్యపోహంతు మలం మమ ॥ 63

**పితృ ప్రార్థన :**

శ్లో॥ పితరః పితామహా శ్చ తథైవ ప్రపితామహాః ।
అగ్ని ష్వాత్తా బర్హిషద స్తథా మాతామహాదయః ॥ 64
వ్యపోహంతు భయం పాపం శివధ్యాన పరాయణాః ।

**మాతృ ప్రార్థన :**

లక్ష్మీశ్చ ధరణీచైవ – గాయత్రీ చ సరస్వతీ ॥ 65

శ్లో॥ దుర్గా ఉషా శచీ జ్యేష్ఠా – మాతరః సురపూజితాః ।
దేవానం మాతరశ్చైవ గణానాం మాతర స్తథా ॥ 66

శ్లో॥ భూతానాం మాతరః సర్వా యత్ర యా గణమాతరః ।
ప్రసాదా ద్దేవదేవస్య వ్యపోహంతు మలం మమ ॥ 67

**అప్సరస ప్రార్థన :**

శ్లో॥ ఊర్వశీ మేనకా చైవ – రంభా రతి తిలోత్తమాః ।
సుముఖీ దుర్ముఖీ చైవ – కాముఖీ కామ వర్ధనీ ॥ 68

శ్లో॥ తథాఽన్యాః సర్వలోకేషు దివ్యాశ్చాప్సరస స్తథా ।
శివాయ తాండవం నిత్యం–కుర్వంత్యోఽ తీవ భావితాః ॥ 69

శ్లో॥ దేవ్యః శివార్చనరతా – వ్యపోహంతు మలం మమ ।

**నవగ్రహ ప్రార్థన :**

అర్కః సోమోఽంగారక శ్చ – బుధశ్చైవ బృహస్పతిః ॥ 70

శ్లో॥ శుక్రః శనైశ్చర శ్చైవ – రాహుః కేతు స్తథైవ చ ।
వ్యపోహంతు భయం ఘోరం – గ్రహపీడాం శివార్చకాః ॥ 71

**ద్వాదశరాశి ప్రార్థన :**

శ్లో॥ మేషో వృషోఽథ మిథున - స్తథా కర్కటకః శుభః ।
సింహ శ్చ కన్యా విపులా - తులా వై వృశ్చిక స్తథా ॥ 72

శ్లో॥ ధను శ్చ మకర శ్చైవ కుంభో మీన స్తథైవ చ ।
రాశయో ద్వాదశ హ్యేతే శివపూజాపరాయణాః ॥ 73

శ్లో॥ వ్యపోహంతు భయం పాపం ప్రసాదాత్ పరమేష్ఠినః ।

**నక్షత్ర ప్రార్థన :**

అశ్వినీ భరణీ చైవ కృత్తికా రోహిణీ తథా ॥ 74

శ్లో॥ శ్రీమన్మృగశిరా శ్చార్ద్ర పునర్వసు పుష్య సార్పకాః ।
మఘావై పూర్వఫల్గున్య ఉత్తరాఫల్గునీ తథా ॥ 75

శ్లో॥ హస్త శ్చిత్ర స్తథా స్వాతీ విశాఖా చానురాధికా ।
జేష్ఠా మూలం మహాభాగా పూర్వాషాఢా తథైవ చ ॥ 76

శ్లో॥ ఉత్తరాషాఢికా చైవ శ్రవణం చ శ్రవిష్ఠికా ।
శతభిషక్ పూర్వభద్రా చ తథా ప్రోష్ఠపదా చ వై ॥ 77

శ్లో॥ పౌష్ణం చ దేవ్యః సతతం వ్యపోహంతు మలం మమ ।

**ప్రమథ గణ ప్రార్థన :**

జ్వరః కుంభోదరశ్చైవ- శంకుకర్ణో మహాబలః ॥ 78

శ్లో॥ మహాకర్ణః ప్రభాత శ్చ మహాభూతప్రమర్దనః ।
శ్యేనజి చ్ఛివదూతశ్చ ప్రమథాః ప్రీతవర్ధనాః ॥ 79

శ్లో॥ కోటికోటి శతైశ్చైవ భూతానాం మాతరః సదా ।
వ్యపోహంతు భయం పాపం మాహాదేవప్రసాదతః ॥ 80

**వృషేంద్ర ప్రార్థన :**

శ్లో॥ శివధ్యానైవ సంపన్నో హిమరాడంబుసన్నిభః ।
కుందేందు సదృశాకారః కుంభ కుందేందు భూషణః ॥ 81

శ్లో॥ బడబానల శత్రుర్యో బడబాముఖ భేదనః ।
చతుష్పాద సమాయుక్తః క్షీరోద ఇవ పాండురః ॥ 82

శ్లో॥ రుద్రలోకే స్థితో నిత్యం రుద్రైః సార్థం గణేశ్వరైః ।
వృషేంద్రో విశ్వధృక్ దేవో విశ్వస్య జగతః పితా ॥ 83

శ్లో॥ వృతో నందాదిభి ర్నిత్యం మాతృభి ర్మఖమర్దనః ।
శివార్చనరతో నిత్యం స మే పాపం వ్యపోహతు ॥ 84

**గంగా ప్రార్థన పంచ గో ప్రార్థన :**

శ్లో॥ గంగా మాతా జగన్మాతా రుద్రలోకే వ్యవస్థితా ।
శివభక్తా తు యా నందా సా మే పాపం వ్యపోహతు ॥ 85

శ్లో॥ భద్రా భద్రపదా దేవీ శివలోకే వ్యవస్థితా ।
మాతా గవాం మహాభాగా సామే పాపం వ్యపోహతు ॥ 86

శ్లో॥ సురభిః సర్వతోభద్రా సర్వపాపప్రణాశినీ ।
రుద్రపూజారతా నిత్యం సా మే పాపం వ్యపోహతు ॥ 87

శ్లో॥ సుశీలా శీలసంపన్నా శ్రీప్రదా శివభావితా ।
శివలోకే స్థితా నిత్యం సా మే పాపం వ్యపోహతు ॥ 88

**కాలభైరవ ప్రార్థన :**

శ్లో॥ వేదశాస్త్రార్థ తత్త్వజ్ఞః సర్వకార్యాభి చింతకః ।
సమస్త గుణ సంపన్నః సర్వదేవేశ్వరాత్మజః ॥ 89

శ్లో॥ జ్యేష్ఠః సర్వేశ్వరః సౌమ్యో మహావిష్ణుతనుః స్వయం ।
ఆర్యః సేనాపతిః సాక్షాత్ గహనో మఖమర్దనః ॥ 90

శ్లో॥ ఐరావత గజారూఢః కృష్ణకుంచిత మూర్ధజః ।
కృష్ణాంగో రక్తనయనః శశిపన్నగభూషణః ॥ 91

శ్లో॥ భూతైః ప్రేతైః పిశాచై శ్చ కూష్మాండై శ్చ సమావృతః ।
శివార్చనరత స్సాక్షాత్ స మే పాపం వ్యపోహతు ॥ 92

**మాతృకా ప్రార్థన :**

శ్లో॥ బ్రహ్మాణీచైవ మాహేశీ కౌమారీ వైష్ణవీ తథా ।
వారాహీ చైవ మాహేంద్రీ చాముండాఽగ్నేయికీ తథా ॥ 93

శ్లో॥ ఏతా వై మాతర స్సర్వాః సర్వలోక ప్రపూజితాః ।
యోగినీభి ర్మహాపాపం వ్యపోహంతు సమాహితాః ॥ 94

**వీరభద్ర ప్రార్థన :**

శ్లో॥ వీరభద్రో మహాతేజా హిమ కుందేందు సన్నిభః ।
రుద్రస్య తనయో రౌద్రః శూలాసక్త మహాకరః ॥ 95

శ్లో॥ సహ స్రబాహుః సర్వజ్ఞః సర్వాయుధ ధరః స్వయం ।
త్రేతాఽగ్నినయనో దేవ స్త్రైలోక్యాభయదః ప్రభుః ॥ 96

శ్లో॥ మాతౄణాం రక్షకో నిత్యం మహావృషభవాహనః ।
త్రైలోక్యనమితః శ్రీమాన్ శివ పాదార్చనే రతః ॥ 97

శ్లో॥ యజ్ఞస్య చ శిరశ్ఛేత్తా పూష్ణో దంత నినాశనః ।
వహ్నేర్హస్త హరః సాక్షాత్ భగనేత్ర నిపాతనః ॥ 98

శ్లో॥ పాదాంగుష్ఠేన సోమాంగ పేషకః ప్రభుసంజ్ఞకః ।
ఉపేంద్రేంద్ర యమాదీనాం దేవానామంగ తక్షక ॥ 99

శ్లో॥ సరస్వత్యా మహాదేవ్యా నాసికోష్ఠావకర్తనః ।
గణేశ్వరో యః సేనానీః స మే పాపం వ్యపోహతు ॥ 100

**మహాలక్ష్మీ ప్రార్థన :**

శ్లో॥ జ్యేష్ఠా వరిష్ఠా వరదా వరాభరణ భూషితా ।
మహాలక్ష్మీర్జగన్మాతా సా మే పాపం వ్యపోహతు ॥ 101

**మహామాయ ప్రార్థన :**

శ్లో॥ మహామోహా మహాభాగా మహాభూతగణై ర్వృతా ।
శివార్చనరతా నిత్యం సా మే పాపం వ్యపోహతు ॥ 102

**లక్ష్మీ ప్రార్థన :**

శ్లో॥ లక్ష్మీః సర్వగుణోపేతా సర్వలక్షణ సంయుతా ।
సర్వదా సర్వగా దేవీ సా మే పాపం వ్యపోహతు ॥ 103

**దుర్గాదేవీ ప్రార్థన :**

శ్లో॥ సింహారూఢా మహాదేవీ పార్వత్యాస్తనయాఽవ్యయా ।
విష్ణో ర్నిద్రా మహామాయా వైష్ణవీ సురపూజితా ॥ 104

శ్లో॥ త్రినేత్రా వరదా దేవీ మహిషాసురమర్దినీ ।
శివార్చనరతా దుర్గా సా మే పాపం వ్యపోహతు ॥ 105

**అనేక రుద్ర ప్రార్థన :**

శ్లో॥ బ్రహ్మాండధారకా రుద్రాః సర్వలోక ప్రపూజితాః ।
సత్యా శ్చ మానసాః పుత్రా వ్యపోహంతు భయం మమ ॥ 106

**భూత ప్రేత పిశాచ ప్రార్థన :**

శ్లో॥ భూతః ప్రేతాః పిశాచా శ్చ కూష్మాండ గణనాయకాః ।
కూష్మాండకా శ్చ మే పాపం వ్యపోహంతు సమాహితాః ॥107

*(శ్లో॥1-107,అధ్యా-82)*

**ఫలశ్రుతి :** మహిమాన్వితమైన ఈ స్తోత్రాన్ని చదివినవాడు, విన్నవాడు, సకల పాపాలనుంచీ విముక్తుడై, శరీరం వదిలిన తరువాత కైలాసానికి చేరుకుంటాడు. ★కన్యార్థి అయినవాడు యోగ్యురాలైన కన్యని భార్యగా పొందుతాడు. ★విజయాన్ని కోరుకునేవాడు విజయాన్ని, ధనాన్ని కావాలనుకునేవాడు ధనాన్ని, పుత్ర సంతానం కావాలనుకునేవాడు పుత్ర సంతానాన్ని పొందుతాడు. ★విద్య కోరుకునేవాడికి సకల విద్యలూ కరతలామలకమవుతాయి. ★సుఖభోగాలు ఆశించేవాడికి సకల సుఖాలూ కలుగుతాయి.

ఈ దివ్యస్తోత్రాన్ని త్రికాలాలలో పఠించేవాడికి వాత, పిత్త, కఫదోషాలు తొలగిపోతాయి. ★అకాల మృత్యువు సంభవించదు. ★సర్పవ్యాఘ్రాది

జంతువుల బాధవుండదు. ★సకల పుణ్యతీర్థాలలో స్నానం చేసిన ఫలం లభిస్తుంది. ★ఎన్నో గొప్ప యజ్ఞాలు, యాగాలు చేసిన ఫలితం, అలాగే ఎన్నో దానాలు ధర్మాలు చేసిన ఫలితం, ఎన్నో వ్రతాలు నోములు ఆచరించిన ఫలితం ఈ వ్యపోహన స్తోత్ర పఠనం వల్ల మానవుడికి కలుగుతుంది. ★ఈ స్తోత్ర పఠనం వల్ల గోహత్య బ్రహ్మహత్యాది పాపాలు కూడా నశిస్తాయి. ★సంపూర్ణమైన శివానుగ్రహం ఉపాసకుడికి కలుగుతుంది.

ప్రతిరోజూ శుభ్రంగా స్నాన సంధ్యాది అనుష్ఠానాలు ముగించుకుని, భస్మ రుద్రాక్షల్ని ధరించి, కనీసం ఒక మండలం (40)రోజులు శతావర్తంగా రోజుకి వందసార్లు లేక 11 సార్లు చొప్పున దీక్షగా ఈ స్తోత్రాన్ని పారాయణ చేయాలి. అలా చేసినవాడికి శరీర బాధలు వ్యాధులూ తొలగిపోవటమే కాకుండా వాక్శుద్ధి కూడా లభిస్తుంది.

## నక్త వ్రతం

శుభప్రదమైన శివవ్రతాలలో విశేషమైనది ఈ నక్తవ్రతం. ప్రతిమాసం శుక్ల-కృష్ణపక్షాలలో వచ్చే అష్టమి చతుర్దశీ తిథుల్లో లేదా బహుళ అష్టమినుంచి బహుళ చతుర్దశి దాకా ఏడురోజులు. ఇలా వరుసగా ఒక సంవత్సరం పాటు నక్తవ్రతాన్ని ఆచరించిన వాడు సమస్త యజ్ఞ కర్మల ఫలితాన్ని పొందుతాడు.

నక్తవ్రతం అంటే ఉదయం నుంచి రాత్రి వరకు కేవలం పాలు మాత్రమే తాగి ఉపవాసం ఉండటం. రాత్రి శివపూజ జరిపి భోజనం చేయవచ్చు.

**నక్తవ్రత నియమాలు :** నేలమీద కూర్చుని విస్తరిలో మాత్రమే భోజనం చేయాలి. బ్రహ్మచర్యం, శాంతచిత్తం కలిగి ఉండటం, శివధ్యానం చేయటం అనేవి నక్త వ్రతానికి ముఖ్య నియమాలు. ప్రతిమాసం పౌర్ణమి, అమావాస్యల్లో నక్తవ్రతం చేయటం చాలా మంచిది. ఈ విధంగా నియమాలతో ఒక సంవత్సరం నక్తవ్రతాన్ని ఆచరించి సంవత్సరం కాగానే పరమేశ్వరుడికి షోడశోపచార పూజచేసి దక్షిణ తాంబూలాలని సమర్పించాలి.

ఈ నక్త వ్రతాన్ని పన్నెండు నెలల పాటు, ప్రతినెలలో వచ్చే, పౌర్ణమి లేక పాడ్యమి, పంచమి, అష్టమి లేక చతుర్దశి, అమావాస్యా తిథుల్లో ఆచరించాలి.

అసలు ఈ నక్త వ్రతం ఎందుకు గొప్పదంటే! ప్రతిరోజూ దేవతలంతా పూర్వాహ్ణంలో భోజనం చేస్తారు. అలాగే ఋషులు మధ్యాహ్నం, పితరులు అపరాహ్ణం, యక్షాదులు సాయం సంధ్యాసమయాల్లో భుజిస్తారు. ఇలా అందరూ భుజించిన తరువాత వ్రతాన్ని ఆచరించేవాడు రాత్రి భోజనం చేస్తాడు కాబట్టి నక్తవ్రతం శ్రేష్ఠమైనదిగా గుర్తింపు పొందింది.

నక్తవ్రతాన్ని ఆచరించేవారు ఉదయాన్నే స్నానం సంధ్యావందనాది నిత్యకర్మల్ని ఆచరించి, భస్మరుద్రాక్షల్ని ధరించి ప్రణవపంచాక్షరీ (ఓం నమఃశివాయ) మహామంత్రాన్ని యథాశక్తి జపించాలి. తిరిగి సాయంత్రం శు చిగా పరమేశ్వరుణ్ణి ఆరాధించి హవిష్యాన్నాన్ని స్వామికి నివేదించి దాన్ని మాత్రమే భుజించాలి. ఆ రోజు రాత్రి నేలమీదే చాపవేసుకుని నిద్రించాలి. ఇవి నక్త వ్రతం చేసేవారు పాటించాల్సిన నియమాలు.

**నక్తవ్రత ఫలితాలు :** ఎంతో గొప్పదైన ఈ నక్త వ్రతాన్ని ఒక్కోమాసంలో చేస్తే ఒక్కో రకమైన శుభఫలితాలు మానవులకి లభిస్తాయి.

1. **పుష్యమాసం :** ఈ మాసంలో నక్తవ్రతదీక్షని స్వీకరించి శివారాధన చేస్తే ధర్మార్థకామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాలు సిద్ధిస్తాయి. అలాగే ఈ మాసంలో వచ్చే కృష్ణ - శుక్ల పక్ష అష్టమీ తిథుల్లో నక్త దీక్ష పొందటం, పూర్ణిమనాడు నెయ్యితో శివుడికి అభిషేకం చేయటం అత్యంత శుభప్రదం. పాలు నెయ్యితో కలిపిన యవధాన్యాల పిండిని శివుడికి నివేదించటం, శివుడి శాంతి పాఠాన్ని చదవటం, కపిల గోవుని విప్రుడికి దానం చేయటం లాంటివి ఆచరిస్తే ఆగ్నేయాది దివ్యలోకాలలో చిరకాలం సుఖంగా నివసించే యోగం కలుగుతుంది.

2. **మాఘమాసం :** ఈ మాసంలో ప్రతిరోజు పరమేశ్వరుణ్ణి అర్చించాలి. రెండు పక్షాలలో ఉన్న చతుర్దశీ తిథుల్లో నక్త వ్రతాన్ని అవలంబిస్తూ, నక్తం ఉన్న రోజు రాత్రి పెసరపప్పు నెయ్యితో కూడిన అన్నాన్ని (పులగం) భుజించాలి. పౌర్ణమిరోజు పరమేశ్వర ప్రీత్యర్థం-నెయ్యి, నలుపురంగు ఎద్దుని దానం చేయాలి.

విప్రులకి యథాశక్తి భోజన దక్షిణతాంబూలాలు సమర్పించాలి. ఈ విధంగా మాఘమాసంలో నక్త వ్రతాన్ని చేసినవాడు యమలోకానికి వెళ్ళినప్పటికీ అక్కడ యమధర్మరాజుతో శిక్షించబడడు. ఆయనతో కలిసి సంచరిస్తాడు.

**3. ఫాల్గుణమాసం :** ఈ మాసంలో నక్తవ్రతాన్ని ఆచరించే వాడు నెయ్యి, పాలతో కూడిన అన్నాన్ని శివుడికి నివేదించి భుజించాలి. ఈ నెలలో కూడా చతుర్దశి, అష్టమి తిథుల్లో ఉపవాసముండి పౌర్ణమినాడు రుద్రాభిషేకం చేయాలి. నెల చివర్లో గోమిథునదానం, బ్రాహ్మణ భోజనం యథావిధిగా చేస్తే ఆ ఉపాసకుడికి చంద్రలోక నివాసం చంద్ర సాయుజ్యం కలుగుతాయి.

**4. చైత్రమాసం :** చైత్ర మాసంలో నక్తవ్రతాన్ని నియమంగా ఆచరించినవాడికి నిర్రుతి లోకంలో సుఖనివాసం లభిస్తుంది.

**5. వైశాఖమాసం :** ఎంతో గొప్పదైన ఈ మాసంలో నక్తవ్రతాన్ని అమావాస్య లేదా పౌర్ణమి తిథుల్లో అవలంబించి పరమేశ్వరుణ్ణి పూజించి తెల్లటి ఆవుల్ని దానం చేస్తే అశ్వమేధయాగం చేసిన ఫలితం లభిస్తుంది.

**6. జ్యేష్ఠమాసం :** ఈ మాసంలో నక్తవ్రతాన్ని చేసేవాడు నెయ్యితో కూడిన ఎర్రబియ్యంతో వండిన అన్నాన్ని పరమేశ్వరుడికి నివేదించి నక్తం ఉన్న రోజురాత్రి దాన్నే ఆహారంగా స్వీకరించాలి. ఈ మాసంలో పౌర్ణమినాడు శివపూజ చేసి బూడిదరంగులో ఉన్న ఆవుని యోగ్యుడైన విప్రుడికి దానం చేయాలి. అలా చేసినవాడికి వాయులోకంలో నివసించే యోగ్యత కలుగుతుంది.

**7. ఆషాఢమాసం :** పవిత్రమైన ఆషాఢమాసంలో నక్తవ్రతాన్ని ఆచరించేవాడు చెరుకు రసం, నెయ్యి, పేలపిండిని ఆహారంగా స్వీకరించాలి. ఉదయంపూట ఆవుపాలనే త్రాగాలి. ఇలా దీక్షగా వ్రతాన్ని ఆచరించి, శివపూజని యథావిధిగా చేసిన వాడు వరుణ లోకాన్ని చేరుకుంటాడు.

**8. శ్రావణ మాసం :** ఈ మాసంలో నక్తవ్రత దీక్ష చేసేవాడు ఆరు రోజుల్లో పండిన వరితో వండిన అన్నాన్ని శివుడికి నివేదించాలి. పౌర్ణమినాడు చిత్రకవర్ణంతో ఉన్న రెండు గోవుల్ని యోగ్యుడైన విప్రుడికి దానం చేయాలి.

అలాగే దానంతో పాటు ఆ రోజు పరమేశ్వర లింగానికి నెయ్యి, పాలు, తేనెలతో అభిషేకాన్ని చేసి, విప్రులకి భోజనం దక్షిణ తాంబూలాల్ని సమర్పించాలి. ఈ విధంగా చేసినవాడు వాయులోకాన్ని చేరుకుంటాడు.

**9. భాద్రపదమాసం :** ఈ నెలలో పగటిపూట నక్తవ్రతాన్ని ఆచరించేవాడు బిల్వ వృక్షం దగ్గర నివసించాలి. నక్త దీక్షని అష్టమి, పౌర్ణమి, అమావాస్య ఏదో ఒక తిథిలో ఆచరించాలి. వ్రతానంతరం నలుపురంగుతో ఉన్న ఆవుల్ని విప్రుడికి దానం ఇచ్చి అతడికి షడ్రసోపేతమైన భోజనాన్ని పెట్టాలి. ఆ తరువాత ఆ విప్రుడికి పెట్టగా మిగిలిన ఆహార పదార్థాలని తాను భుజించాలి. ఈ విధంగా చేసినవాడు యక్షలోకాన్ని చేరి సుఖభోగాలు అనుభవిస్తాడు.

**10.ఆశ్వయుజమాసం :** ఈ మాసంలో నక్తవ్రతాన్ని ఆచరించే వాడు శివభక్తులకి భోజనాలు పెట్టాలి. రెండు గోవుల్ని దానంచేసి, పౌర్ణమినాడు రుద్రాధ్యాయాన్ని పఠించి శివలింగానికి అభిషేకం చేయాలి. ఈ విధంగా నియమపూరితంగా వ్రతాన్ని ఆచరించినవాడు ఈశానలోకంలో ఎంతో వైభవమైన జీవితాన్ని అనుభవిస్తాడు.

**11.కార్తీకమాసం :** ఈ మాసంలో నెయ్యి కలిపిన క్షీరాన్నాన్ని పరమేశ్వరుడికి నివేదించాలి. నక్తవ్రతం ఆచరించేరోజు రెండు కపిల గోవుల్ని దానంచేసి విప్రులకి భోజన దక్షిణ తాంబూలాల్ని సమర్పిస్తే సూర్యలోకంలో నివసించే యోగం కలుగుతుంది.

**12.మార్గశీర్షమాసం :** ఈ మాసంలో నక్తవ్రతాన్ని అవలంబించేవాడు నెయ్యి పాలతో కలిపిన యవల అన్నాన్ని పరమేశ్వరుడికి నివేదించాలి. పౌర్ణమినాడు శివుడికి అభిషేకం చేసి, వేద పండితులకి, దరిద్రులకి సదాచార పరులైన బ్రాహ్మణులకి భోజనాన్ని పెట్టాలి. ఆ రోజు తెల్లటి రెండు గోవుల్ని యోగ్యుడైన విప్రుడికి దానం చేయాలి. ఆ విధంగా చేసినవాడు సోమలోకాన్ని చేరుకుని సకల సౌఖ్యాలూ అనుభవిస్తాడు.

అహింస, సత్యాన్నే పలకటం, దొంగతనం చేయకపోవటం, బ్రహ్మ చర్యదీక్షని వహించటం, ఓర్పు, దయ, త్రికాల స్నానాన్ని ఆచరించటం, కృష్ణపక్ష, శుక్లపక్ష చతుర్దశి తిథుల్లో ఉపవాసముండటం అనేవి నక్తవ్రత దీక్షా ధారులకి ముఖ్యాంశాలు.

## ఉమామహేశ్వర వ్రతం

పరమేశ్వర పార్వతీదేవి అనుగ్రహాన్ని కలిగించే వ్రతాలలో విశిష్ఠమైనది ఉమామహేశ్వర వ్రతం.

**వ్రతవిధానం :** అమావాస్య లేక పూర్ణిమ, చతుర్దశి, అష్టమి తిథుల్లో నక్త వ్రతాన్ని అవలంబించి, ఆ రోజు రాత్రి కేవలం హవిషాన్నం మాత్రమే భుజించాలి. ఇలా ఒక సంవత్సరకాలం చేయాలి. నక్త భోజనానికి ముందు ప్రదోషకాలంలో ఉమామహేశ్వరుల్ని పూజించాలి. ఇలా సంవత్సరం పాటు వ్రతాన్ని ఆచరించిన తరువాత చివరి మాసంలో బంగారు లేక వెండితో పార్వతీ పరమేశ్వరుల ప్రతిమని చేయించి, వాటిని యథావిధిగా పూజించాలి. విప్రులకి భోజన దక్షిణ తాంబూలాల్ని సమర్పించాలి. తరువాత పార్వతీ పరమేశ్వరుల ప్రతిమల్ని రథం లేక ఏదో ఒక వాహనం మీద ఊరేగింపుగా తీసుకెళ్ళి శివాలయంలో సమర్పించాలి. ఈవిధంగా ఉమామహేశ్వర వ్రతాన్ని ఆచరించినవాడు పురుషుడైతే శివసాయుజ్యాన్ని, స్త్రీ అయితే దేవీ సాయుజ్యాన్ని పొందుతారు.

అష్టమీ-చతుర్దశీ తిథుల్లో ఉపవాసముండి, ఒక సంవత్సరం వరకూ బ్రహ్మచర్యాది నియమాల్ని పాటిస్తూ ఈ ఉమామహేశ్వర వ్రతాన్ని ఆచరించాలి. అలా ఆచరించిన వారు వ్రతపరిసమాప్తి కాగానే సంవత్సరాంతంలో ఉమామహేశ్వర ప్రతిమల్ని శివాలయంలో సమర్పిస్తే దేవీ లోకంలో సుఖంగా నివసించే యోగాన్ని పొందుతారు.

వ్రతాన్ని ఆచరించే స్త్రీలు భర్త అనుమతితోనే ఏ వ్రతాన్నైనా, నోములనైనా చేయాలి. అంతేకానీ స్వతంత్రించి చేయకూడదు.

నియోగాదేవా తత్కార్యం భర్తృణాం ద్విజసత్తమాః ।
జపోదానం తపః సర్వమస్వంతంత్రా యతః స్త్రియః ॥

జపం, దానం, తపస్సులాంటి సమస్త పుణ్యకార్యాలూ భర్త అనుమతితోనే చేయాలి. మహిమోపేతమైన ఈ దివ్య వ్రతాన్ని మార్గశీర్షమాసం నాడు మొదలుపెట్టి తిరిగి కార్తీకమాసం వరకూ ప్రతినెలా చేయాలి. ఒక్కోమాసంలో చేసిన వ్రతానికి, దానానికి ఒక్కోరకమైన ఫలితం వస్తుంది.

1. **మార్గశీర్షమాసం :** ఈ మాసంలో వ్రతాన్ని ఆచరించి సంపూర్ణ, శుభలక్షణాలతో ఉన్న వృషభాన్ని శివుడికి నివేదించి దాన్ని శివాలయానికి దానమివ్వాలి. ఇలా చేసే స్త్రీ దేవలోకాన్ని చేరుకుంటుంది.
2. **పుష్యమాసం :** ఈ మాసంలో త్రిశూలాన్ని పూజించి శివాలయానికి వెళ్ళి త్రిశూలాన్ని శివుడికి సమర్పించాలి.
3. **మాఘమాసం :** ఈ మాసంలో వ్రతాన్ని చేసినవారు. సమస్త అంగాలతో ఉన్న రథాన్ని పూజించి దాన్ని శివాలయానికి సమర్పించాలి. ఆ తరువాత బ్రాహ్మణులకి అన్న సంతర్పణ చేస్తే దేవీ సాయుజ్యాన్ని పొందుతారు.
4. **ఫాల్గుణమాసం :** ఈ నెలలో బంగారం లేక వెండితోగానీ రాగితోకానీ ఉమామహేశ్వరుల ప్రతిమని నిర్మించి, దాన్ని శ్రద్ధా భక్తులతో పూజించి శివాలయంలో ఉత్సవ మూర్తులుగా వాటిని సమర్పించాలి. అలా చేసినవాడికి దేవీలోక ప్రాప్తికలుగుతుంది.
5. **చైత్రమాసం :** ఈ మాసంలో ఉమామహేశ్వరుల ప్రతిమలతో పాటు కుమారస్వామి విగ్రహాన్ని కూడా బంగారం, వెండి లేక రాగిలోహాలతో తయారుచేయించి విధివిధానంగా పూజించి, వాటిని శివాలయానికి సమర్పించాలి. అలాగే వెండితో శివమందిరాన్ని నిర్మించి దాన్ని శివాలయానికి కానుకగా ఇవ్వవచ్చు. ఇలా చేసిన వారికి శివలోక ప్రాప్తి కలుగుతుంది.
6. **వైశాఖమాసం :** ఈ నెలలో కైలాసపర్వతం మీద ఉమామహేశ్వరులున్న ప్రతిమని పూజించి, దాన్ని పూజానంతరం శివాలయంలో స్థాపించాలి.

అలా చేసిన వారికి కైలాసంలో కొలువై ఉన్న గౌరీదేవి దగ్గరకి చేరే అవకాశం లభిస్తుంది.

**7. జ్యేష్ఠమాసం :** ఈ నెలలో వ్రతాన్ని అనుష్ఠించేవారు ఒక శివలింగానికి ఇరువైపులా బ్రహ్మ, విష్ణువులు దోసిలిపట్టి నిల్చున్నట్టు వెండి లేదా రాగితో ప్రతిమని తయారుచేయించి, ప్రాణప్రతిష్ఠ చేసి, యథావిధిగా పూజాదికాలు నిర్వహించాలి. తరువాత విప్రులకి భోజన దక్షిణ తాంబూలాలు సమర్పించి ఆ ప్రతిమల్ని శివుడి ప్రీతి కోసం శివాలయంలో స్థాపించాలి. ఈ విధంగా చేసిన వారు గౌరీదేవి సంపూర్ణ అనుగ్రహాన్ని పొంది, చివరికి ఆమెలోకాన్ని చేరుకుంటారు.

**8. ఆషాఢమాసం :** ఇటికెలతో దృఢంగా ఒక ఇంటిని కట్టించి ఆ ఇంట్లోకి కావలసిన రోలు, రోకలి, చీపురు, చాప, మంచం, పరుపు, దిండ్లు లాంటి వస్తువులన్నీ అమర్చి ఒక సంవత్సరానికి సరిపడే వెచ్చాలు ఏర్పర్చి, ఒక పరిచారకుణ్ణిగానీ, పరిచారికను గానీ నియమించి,ఆ గృహంలో ఉమా మహేశ్వరుల్ని ప్రతిష్ఠించి, వారిని పంచామృతాలతో శాస్త్రోక్తంగా అభిషేకం చేసి, పూజాదికాలు నిర్వహించాలి. ఆ తరువాత యథాశక్తి విప్రులకి భోజన దక్షిణ తాంబూలాలు సమర్పించి ఆ నూతన గృహాన్ని వేదవేదాంగ వేత్తకి దానం చేయాలి. అవకాశం వుంటే గోదానం కూడా చేస్తే మంచిది. ఈ విధంగా గృహదానం చేసినవాడు శాశ్వతంగా గోలోక ప్రాప్తిని లేదా అమ్మవారి సాన్నిధ్యాన్ని పొందుతాడు.

**9. శ్రావణమాసం :** ఈ మాసంలో మేలుకట్టు ధ్వజం, నూతనవస్త్రాలతో సహా తిల(నువ్వుల) పర్వతాన్ని (కుప్పని) విప్రుడికి దానం చేయాలి. తరువాత భోజన దక్షిణ తాంబూలాల్ని సమర్పించినవాడు శాశ్వతంగా దేవీలోక నివాసాన్ని పొందుతాడు.

**10. భాద్రపదమాసం :** ఈ నెలలో అన్నాన్ని రాశిగా పోసి శివుడికి నివేదించి, దాన్ని నూతన వస్త్రాలతో సహా అందరికీ వితరణ చేయాలి. అలాగే యథావిధిగా విప్రులకి భోజన దక్షిణతాంబూలాన్ని సమర్పించాలి. ఇలా చేసిన స్త్రీ సూర్యకిరణాల తేజస్సుని పొంది దివ్యశరీరంతో దేవీలోకానికి చేరుకుంటుంది.

**11.ఆశ్వయుజమాసం :** ఈ మాసంలో వ్రతాన్ని ఆచరించే వారు బంగారం, నూతన వస్త్రాలు, వడ్లు, గోధుమలు, కందులు, పెసలు, సెనగలు వీటిలో ఏదో ఒక ధాన్యాన్ని శివుడికి సమర్పించి, ఆ తరువాత అన్నదానం చేసినట్లైతే వారికి దేవీలోక ప్రాప్తి కలుగుతుంది.

**12.కార్తీకమాసం :** ఈ మాసంలో ఉమామహేశ్వరుల ప్రతిమల్ని సర్వాంగ సుందరంగా బంగారం లేక వెండి, రాగిలతో చేయించి, ఆ ఆదిదంపతుల ముందు అగ్నిహోత్రుడు, బ్రహ్మదేవుడు, నారాయణుడు కన్యాదాతలుగా ఉన్నట్టు, చుట్టూ లోకపాలురు, సిద్ధులు, మునులు నిలబడినట్టు ప్రతిమల్ని చెక్కించి, ఆ ప్రతిమల్ని యథావిధిగా పూజించాలి. పూజానంతరం వాటిని శివాలయానికి తీసుకెళ్ళి సమర్పించాలి. ఈ విధంగా చేసిన స్త్రీ దేవీ స్వరూపాన్ని పొంది శివలోకాన్ని చేరుకుంటుంది.

ఈ విధంగా మార్గశీర్షం నుంచి కార్తీకం వరకూ ప్రతిమాసం చేయతగిన ఈ ఉమామహేశ్వర వ్రతం స్త్రీలకి, పురుషులకీ శ్రేయస్సుని కలిగిస్తుంది. ఈ వ్రతాన్ని ఆచరించేవారు పురుషులైతే శివసాయుజ్యాన్ని, స్త్రీలైతే దేవీ సాయుజ్యాన్ని పొందుతారు. ఇది సత్యం.

## శివ పంచాక్షర మహామంత్రం

అన్నిరకాల శివవ్రతాలలో చివరగా శివపంచాక్షరీ మహా మంత్రాన్ని విధిగా జపించాలి.

**పంచాక్షరీ మంత్ర మహిమ :** పూర్వం జగన్మాత పార్వతీ దేవి "ప్రభూ! పంచాక్షరీ మంత్రం అంటే ఏమిటి? దాని మహిమ ఎలాంటిది? ఆ మంత్రాన్ని ఎలా జపించాలి? అని శివుణ్ణి అడగగా, పరమేశ్వరుడు ఆమెకి పంచాక్షరీ మంత్ర మహిమని వివరంగా చెప్పాడు.

పూర్వం మహాప్రళయం సంభవించినప్పుడు స్థావరజంగమాలు, దేవాసురులు, అందరూ ప్రకృతిలో లీనమైపోగా, ఆ ప్రకృతి వెళ్ళి పరమేశ్వరుడిలో లయమైపోయింది. అప్పుడు ఈశ్వరుడు ఒక్కడే నిలిచి ఉన్నాడు. అదే సమయంలో శివుణ్ణి ఆశ్రయించిన పంచాక్షరాలలో వేదాలు శాస్త్రాలు నిక్షిప్తమై ఉన్నాయి.

అప్పుడు శంకరుడు ప్రకృతి రూపంలో నారాయణుడిగా, ఆత్మరూపంలో శంకరుడుగా ఉన్నాడు. ప్రారంభంలో శివుడి నుంచి ఆవిర్భవించిన నీళ్ళలో నారాయణుడు నిద్రపోతుండగా, ఆయన నాభికమలం నుంచి శివ సంకల్పంతో పంచముఖ బ్రహ్మ ఆవిర్భవించాడు. ఆ పంచముఖ బ్రహ్మ సృష్టి చేయాలని భావించి మొదట సనకాది మానస పుత్రల్ని సృష్టించాడు. అలా వారిని సృష్టించిన తరువాత "మహాదేవా! పరమేశ్వరా! నా పుత్రులందరికీ సృష్టిని వృద్ధి చేసే శక్తిని ప్రసాదించు" అని శివుణ్ణి ప్రార్ధించాడు. అప్పుడు పరమేశ్వరుడు తన అయిదు ముఖాలతో అయిదు అక్షరాలని బ్రహ్మదేవుడికి ఉపదేశించాడు.

పంచముఖ బ్రహ్మ, శివుడు తన పంచముఖాలతో బోధించిన పంచాక్షర మహామంత్రాన్ని గ్రహించి దాన్ని జపించే విధానాన్ని మొత్తం తన కుమారులకి ప్రబోధించాడు. అప్పుడు బ్రహ్మ పుత్రులంతా శివపంచాక్షర మహామంత్రాన్ని విని శ్రద్ధగా అక్షర లక్షలు జపించారు.

అల్పాక్షరం మహార్థంచ వేదసారం విముక్తిదం ।
ఆజ్ఞాసిద్ధమ సందిగ్ధం వాక్యమేత చ్ఛివాత్మకమ్ ॥

కొద్ది అక్షరాలే అయినప్పటికీ అవి గొప్ప అర్థాన్ని కలిగినవి. వేదసారం మోక్షప్రదమైన శివపంచాక్షర మహామంత్రం గుర్వాజ్ఞ సిద్ధమైనది. సంశయ రహితమైన శివవాక్యం ఇది.

**పంచాక్షర మంత్ర మహిమ :** సమస్త మంత్రాల అర్థం మొత్తం ఈ పంచాక్షర మహామంత్రంలో ఇమిడి ఉంది. అన్ని మంత్రాలకీ ఇది ఆద్యమైన మర్రి విత్తనం లాంటిది. "పరమేశ్వరుడు సర్వవ్యాపకుడైనప్పటికీ పంజరంలోని చిలకలాగా ఓంకార సంయుక్తమైన పంచాక్షరీ మహా మంత్రంలో స్థిరంగా ఉంటాడు.

లోకవ్యవహారంలో ఈ మహామంత్రం పంచాక్షరిగా ప్రసిద్ధి చెందినప్పటికీ ఓంకారం కలిసినందున ఇది షడక్షరీ మహామంత్రమవుతోంది.

ఈ మహామంత్రాన్ని గురువుద్వారా ఉపదేశం పొందిన వాడికి, ఇతర మంత్రాలతో, ధర్మ శాస్త్రాలతో పనిలేదు. ఎవరైతే ఈ మంత్రాన్ని గురువు ద్వారా

ఉపదేశం పొంది జపిస్తాడో, వాడు సకల వేద వాఙ్మయాన్ని అధ్యయనం చేసిన వాడవుతాడు. ఈ షడక్షర (పంచాక్షర) మంత్రాన్ని ప్రతిరోజూ నియమ నిష్ఠలతో జపించటం శివజ్ఞాన ప్రదం.

"పంచాక్షరైః సప్రణవోమంత్రోఽ యం హృదయం మమ" – నమః శివాయ అనే అయిదు అక్షరాలు, ముందు ఓంకారంతో కూడిన ఈ ఓం నమశ్శివాయ అనే మహామంత్రం నాకు హృదయం లాంటిది'' అని పరమేశ్వరుడు పార్వతీదేవికి చెప్పాడు.

**పంచాక్షర మంత్రజపం :** పరమేశ్వరుడి హృదయస్వరూపమైన పంచాక్షరీ మహామంత్రాన్ని గురువుద్వారా ప్రణవయుక్తంగా ఉపదేశం పొందాలి. ఆ తరువాత గురువుని యథాశక్తి దక్షిణ తాంబూలాలతో సంతృప్తి పరిచి ఒక శుభముహూర్తంలో మంత్రజపం చేయాలి. మంత్ర జపానికి ముందు శివలింగానికి అభిషేకం పూజచేసి తీర్థాన్ని పుచ్చుకోవాలి.

యావజ్జీవం జపేన్నిత్యం అష్టోత్తర సహస్రకం ।
అనశ్నం స్తత్పరో భూత్వా సయాతి పరమాం గతిం ॥

మంత్రోపదేశం పొందినవాడు జీవితాంతం ప్రతిరోజూ భోజనానికి ముందు వెయ్యిఎనిమిది సార్లు ఈ మంత్రాన్ని శివుడిమీద మనసు నిల్పి జపించాలి. అలా జపించినవాడు ప్రారబ్ధకర్మ ముగిసిన తరువాత ముక్తిని పొందుతాడు.

**పంచాక్షరీ మంత్ర పురశ్చరణ :** శివ పంచాక్షరీ మంత్రాన్ని అక్షర లక్షలు అనగా ప్రణవపంచాక్షరీ మంత్రంలోని ఆరు అక్షరాలకీ ఆరులక్షలు. దీనికి నాలుగు రెట్లు అనగా $6 \times 4 = 24$ లక్షల సార్లు జపిస్తే అది పురశ్చరణ అవుతుంది.

ఈ పురశ్చరణ చేసేవాడు నక్త వ్రతాన్ని ఆచరించాలి. బ్రహ్మచర్య నియమాన్ని పాటించాలి. ప్రతిరోజూ చేసే జపాన్ని ఒక నిర్ణీత సంఖ్యలో చేయాలి. ప్రతిరోజూ ఒకే పద్ధతిని పాటించాలి.

**మంత్రజప విధానం :** ప్రశాంతమైన ప్రదేశంలో ఆసనాన్ని వేసుకుని కూర్చోవాలి. మౌనంగా ఏకాగ్రతతో తూర్పులేక ఉత్తరాభిముఖంగా కూర్చోవాలి. ముందుగా పంచాక్షరీ మంత్రంతో 25సార్లు ప్రాణాయామం చేయాలి. ప్రాణాయామం వల్ల పాపాలు నశించి ఇంద్రియాలు స్వాధీనంలోకి వస్తాయి.

**జపస్థానం :** పంచాక్షర జపానికి మంచిస్థలాన్ని ఎంచుకోవాలి. గృహంకన్నా గోశాలలో చేస్తే వందరెట్లు, నదీ తీరంలో చేస్తే లక్షరెట్లు, శివసన్నిధిలో చేస్తే అనంతమైన ఫలం లభిస్తుంది. అలాగే సముద్రతీరాలు, దివ్యమైన సరోవరాలు, పర్వతాలు, దేవాలయాలు, సమస్తమైన పుణ్యాశ్రమాలు. ఈ ప్రదేశాలలో చేసే మంత్రజపం కోటిరెట్లు అధికమైన ఫలాన్నిస్తుంది.

శివుడి సన్నిధిలోగానీ, గురువు దగ్గరలోకానీ, దీపం ముందుగానీ, ఆవుకి, నదికి దగ్గర్లో కానీ మంత్ర జపంచేయటం ప్రశస్తం.

**జపసాధనం :** జపాన్ని లెక్కించటానికి మాల అవసరం. చేతివేళ్ళ కణుపులతో లెక్కించటం ఒక పద్ధతి, దీన్ని కరమాల లేక అంగుళి మాల అంటారు. దీనికన్నా పదిరెట్లు అధికఫలం పుత్రజీవపూసల మాలతో జపిస్తే కలుగుతుంది. దానికన్నా శంఖాలమాలతో వందరెట్లు, పగడాల మాలతో వేయిరెట్లు, స్ఫటిక మాలతో పదివేల రెట్లు, ముత్యాలమాలతో లక్షరెట్లు, తామరపూసల మాలతో పదిలక్షల రెట్లు, బంగారు పూసల మాలతో కోటిరెట్లు, దర్భముడులమాలతో, రుద్రాక్ష మాలతో జపంచేస్తే అనంతమైన ఫలితం కలుగుతుంది.

**జపమాల పూసల ఫలం :** జపంచేసే పూసల మాలలో 25 పూసలుంటే అది మోక్ష సాధనంగా పనికివస్తుంది. 50 పూసలు మాలలో ఉంటే అది ఇతరులపై చేసే ప్రయోగాలకి ఉపయోగపడుతుంది. 108పూసల మాల భోగమోక్షాల్ని అందిస్తుంది.

**జపంచేసే దిక్కు-ఫలితం :** పంచాక్షరీ మంత్ర జపాన్ని లేక ఏ మంత్ర జపాన్నైనా తూర్పు ముఖంగా కూర్చుని చేస్తే జనవశీకరణ కలుగుతుంది.

దక్షిణాభిముఖంగా కూర్చుని చేస్తే అభిచార సిద్ధి, పడమర దిశకి అభిముఖంగా కూర్చుని జపిస్తే ధనాగమం, ఉత్తరాభిముఖంగా కూర్చుని తపస్సు చేస్తే అది శాంతిప్రదం.

యజ్ఞాలన్నిటికన్నా జపయజ్ఞం ఎంతో గొప్పది. ఎందుకంటే ఈ యజ్ఞంలో హింసవుండదు. కర్మయజ్ఞాలు, తపస్సులు, మహాదానాలు, జప యజ్ఞానికి పదహారోవంతుకి కూడా సరిరావు.

జపం చేయటం వల్ల ఆ మంత్రాన్ని అధిష్ఠించిన దేవత సాధకుడికి ప్రసన్నమై అతడి కోరికలన్నీ తీరుస్తుంది. మరణానంతరం ఆ సాధకుడికి ముక్తిని ప్రసాదిస్తుంది. పూర్వజన్మలో చేసిన పాపాలన్నీ జపంతో నశిస్తాయి. కనుక మానవులందరూ పరమేశ్వరానుగ్రహం కోసం శివపంచాక్షరీ మహామంత్రాన్ని శ్రద్ధగా గురువుద్వారా ఉపదేశం పొంది జపించాలి.

## సూర్యమండలంలో శివపూజా విధి

సదాశివుడు సూర్యమండలంలో ఉమాదేవీ సహితంగా, కోటిసూర్యుల కాంతితో ప్రకాశిస్తూ, ఎనిమిది చేతులతో, నాలుగు ముఖాలతో, పన్నెండు నేత్రాలతో, జటాముకుటాల్ని ధరించి అర్ధనారీశ్వరుడుగా కొలువుంటాడు. ఆయనే సృష్టి స్థితి లయకారకుడు.

ఆ మహాదేవుడి తూర్పుముఖం 'తత్పురుష' అనే పేరుతో ప్రసన్నంగా ఉంటుంది. దక్షిణ ముఖం 'అఘోర' అనే పేరుతో నీలవర్ణంతో, కోరలతో, భయాన్ని కలిగిస్తూ కనిపిస్తుంది. ఆయన ఉత్తరముఖం 'వామదేవ' అనే పేరుతో పగడం రంగుతో ప్రసన్నంగా వుంటుంది. పశ్చిమం వైపున్న ముఖం 'సద్యోజాతం' అనే పేరుతో ముత్యాలలాంటి వెలుగులు వెదజల్లుతూ ప్రకాశిస్తుంది.

ఈ విధంగా సూర్యమండలంలో ప్రకాశించే సదాశివుడి ముందు 'సూర్యుడు', ఆయనకి దక్షిణ భాగంలో 'భానుడు', ఉత్తర దిశలో 'రవి', కుడివైపు బ్రహ్మదేవుడు, ఎడమ ప్రక్క శ్రీమహావిష్ణువు ఉన్నారు. ఋగ్యజుస్సామవేద క్రమంగా, త్రిమూర్త్యాత్మకుడైన ఆ సదాశివుడు ధర్మం జ్ఞానం అనే బ్రహ్మాసనం మీద కూర్చుని,

తన చుట్టూ చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని గ్రహాలు పరివేష్ఠించి ఉండగా, ఆ రవి మంగలంలో గ్రహాధీశ్వరుడుగా ప్రకాశిస్తున్నాడు.

సూర్యుణ్ణి పరమేశ్వరుడుగా, చంద్రుణ్ణి పార్వతీదేవిగా భావిస్తూ, సకల దేవతలూ ఆయన్ని నమఃశివాయ రుద్రాయ" అనే శ్లోకాలతో ఇలా ఘనంగా కీర్తించారు.

## సూర్యాత్మక శివస్తుతి

నమఃశివాయ రుద్రాయ – కద్రుద్రాయ ప్రచేతసే ।<br>
మీఢుష్టమాయ సర్వాయ – శిపివిష్టాయ రంహసే ! 1

ప్రభూతే విమలే సారే – హ్యాధారే పరమే సుఖే ।<br>
నవశక్త్యావృతం దేవం – పద్మస్థం భాస్కరం ప్రభుమ్ ॥ 2

ఆదిత్యం భాస్కరం భానుం – రవిం దేవం దివాకరం ।<br>
ఉమాం ప్రభాం తథా ప్రజ్ఞాం – సంధ్యాంసావిత్రికా మపి ॥ 3

విస్తారా ముత్తారాం దేవీం బోధనీం ప్రణమామ్యహం ।<br>
ఆ ప్యాయనీం చ వరదాం బ్రహ్మాణం కేశవం హరమ్ ॥ 4

సోమాదిబృందం చ యథాక్రమేణసంపూజ్య మంత్రై ర్విహిత క్రమేణ ।<br>
స్మరామి దేవం రవిమండలస్థం సదాశివం శంకర మాదిదేవమ్ ॥ 5

ఇంద్రాది దేవాంశ్చ తథేశ్వరాంశ్చ – నారాయణం పద్మజ మాదిదేవం।<br>
ప్రాగాద్యధోర్ధ్వం చ యథాక్రమేణ వజ్రాదిపద్మం చ తథా స్మరామి ॥ 6

సిందూరవర్ణాయ సమండలాయ సువర్ణవజ్రాభరణాయ తుభ్యం ।<br>
పద్మాభనేత్రాయ సపంకజాయ బ్రహ్మేంద్రనారాయణకారణాయ ॥ 7

రథం చ సప్తాశ్వమానూరువీరం – గణం తథాసప్తవిధం క్రమేణ ।<br>
ఋతుప్రవాహేణ చ వాలఖిల్యాన్ స్మరామి మందేహ గణక్షయంచ ॥ 8

హుత్వా తిలాద్యైర్వివిధై స్తథాః గ్నౌ – పునః సమాప్యైవ తథైవ సర్వం।<br>
ఉద్వాస్య హృత్పంకజమధ్యసంస్థం – స్మరామి బింబం తవ దేవ దేవ॥ 9

స్మరామి బింబాని యథాక్రమేణ రక్తాని పద్మామలలోచనాని ।
పద్మం చ సవ్యే వరదం చ వామే కరే తథా భూషితభూషణాని॥ 10

దంష్ట్రాకరాళం తవ దివ్య వక్త్రం విద్యుత్ ప్రభం దైత్యభయంకరం చ ।
స్మరామి రక్షాఽభిరతం ద్విజానాం మందేహరక్షోగణభర్త్సనంచ ॥ 11

సోమం సితం భుమిజ మగ్నివర్ణం చామీకరాభం బుధ మిందుసూనుం ।
బృహస్పతిం కాంచన సన్నికాశం శుక్రం సితంకృష్ణతరం చ మందమ్ ॥ 12

స్మరామి సవ్య మభయం వామ మూరుగతం వరం ।
సర్వేషాం మంద పర్యంతం మహాదేవం చ భాస్కరమ్ ॥ 13

పూర్ణేందు వర్ణేన చ పుష్పగంధ ప్రస్థేన తోయేన శుభేన పూర్ణం ।
పాత్రం దృఢం తామ్రమయం ప్రకల్ప్య దాస్యే తవార్ఘ్యం భగవన్ ప్రసీద ॥ 14

*(శ్లో॥27-40,అధ్యా-19)*

ఈ దివ్య స్తోత్రాన్ని ఉదయం మధ్యాహ్నం సాయం సమయాల్లో సూర్యమండలాన్ని (సూర్యుణ్ణి) దర్శిస్తూ, అందులో ఉమాసహిత పరమేశ్వరుణ్ణి భావిస్తూ పఠించాలి. తరువాత ఒక రాగి పళ్ళెంలో పుష్పగంధ కుంకుమాక్షతలతో ఈ శ్లోకాలు పఠిస్తూ సూర్యుడికి అర్ఘ్యాన్ని ఇవ్వాలి. ఈ విధంగా చేసిన వారికి ఆయురారోగ్యాలు పెంపొందుతాయి. చివరికి శివసాయుజ్యం లభిస్తుంది.

సూర్యమండలంలో సదాశివుణ్ణి భావిస్తూ చేసే పూజని (స్తోత్రపఠనాన్ని) బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్రులు, స్త్రీలు అందరూ చేయవచ్చు.

## సకల దేవతల గాయత్రీ మంత్రాలు

హరిహర బ్రహ్మాది దేవతల్ని ప్రతిష్ఠచేసేడప్పుడు ఆయా దేవతల మూలమంత్రాలతో పాటు గాయత్రీమంత్రాలని కూడా పఠిస్తారు. ప్రతి దేవతకీ, ఆ దేవతా మంత్ర గాయత్రీ వుంటుంది. ఈ గాయత్రీమంత్రం కూడా అనుష్ఠాన యోగ్యమైనదే. ఇక్కడతెలిపే దేవతల గాయత్రీమంత్రాల్ని నిత్యం జపానికి వినియోగించుకోవచ్చు. ఈ గాయత్రీ మంత్రాల్ని నిత్యం 108 సార్లు పఠిస్తే ఆయా దేవతల అనుగ్రహం సాధకులకి తప్పకుండా కలుగుతుంది.

"తత్పురుషాయ విద్మహే వాగ్విశుద్ధాయ ధీమహి, తన్నః శివః ప్రచోదయత్"

"గణాంబికాయై విద్మహే కర్మసిద్ధ్యై చ ధీమహి, తన్నో గౌరీ ప్రచోదయత్"

"తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి, తన్నో రుద్రః ప్రచోదయత్"

"తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి, తన్నో దంతిః ప్రచోదయత్"

"మహాసేనాయ విద్మహే వాగ్విశుద్ధాయ ధీమహి, తన్నః స్కందః ప్రచోదయత్"

"తీక్షశృంగాయ విద్మహే వేద పాదాయ ధీమహి, తన్నో వృషః ప్రచోదయత్"

"హరివక్త్రాయ విద్మహే రుద్రవక్త్రాయ ధీమహి, తన్నో నందీ ప్రచోదయత్"

"నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి, తన్నో విష్ణుః ప్రచోదయత్"

"మహాంబికాయై విద్మహే కర్మసిద్ధ్యై చ ధీమహి, తన్నో లక్ష్మీః ప్రచోదయత్"

"సముద్ధృతాయై విద్మహే విష్ణునైకేన ధీమహి, తన్నో ధరా ప్రచోదయత్"

"వైనతేయాయ విద్మహే సువర్ణపక్షాయ ధీమహి, తన్నో గరుడః ప్రచోదయత్"

"పద్మోద్భవాయ విద్మహే వేదవక్త్రాయ ధీమహి, తన్నః స్రష్టా ప్రచోదయత్"

"శివాస్యజాయై విద్మహే దేవీరూపాయ ధీమహి, తన్నో వాచా ప్రచోదయత్"

"దేవరాజాయ విద్మహే వజ్రహస్తాయ ధీమహి, తన్నః వహ్నిః ప్రచోదయత్"

"రుద్రనేత్రాయ విద్మహే శక్తి హస్తాయ ధీమహి, తన్నో వహ్నిః ప్రచోదయత్"

"వైవస్వతాయ విద్మహే దండ హస్తాయ ధీమహి, తన్నో యమః ప్రచోదయత్"

"నిశాచరాయ విద్మహే ఖడ్గహస్తాయ ధీమహి, తన్నో నిఋతిః ప్రచోదయత్"

"శుద్ధ హస్తాయ విద్మహే పాశహస్తాయ ధీమహి, తన్నో వరుణః ప్రచోదయత్"

"సర్వప్రాణాయ విద్మహే యష్టిహస్తాయ ధీమహి, తన్నో వాయుః ప్రచోదయత్"

"యక్షేశ్వరాయ విద్మహే-గదాహస్తాయ ధీమహి, తన్నో యక్షః ప్రచోదయత్"

"సర్వేశ్వరాయ విద్మహే-శూలహస్తాయ ధీమహి, తన్నో రుద్రః ప్రచోదయత్"

"కాత్యాయన్యై విద్మహే-కన్యాకుమార్యై ధీమహి, తన్నో దుర్గా ప్రచోదయత్"

*(మంత్రాలు 1-22, అధ్యా-48)*

## లింగపురాణం ఫలశ్రుతి

పదకొండువేల శ్లోకాలతో 163 అధ్యాయాలతో రచించబడ్డ ఈ లింగ పురాణాన్ని శ్రద్ధా భక్తులతో పఠించినవారికి ధర్మార్థ కామ మోక్షాలు సిద్ధిస్తాయి.

లైంగమాద్యంత మఖిలం యః పఠేచ్ఛృణు యాదపి ।
ద్విజేభ్యః శ్రావయేద్వాఽపి సయాతి పరమాం గతిం ॥

సంపూర్ణంగా ఈ లింగపురాణాన్ని ఆద్యంతం పఠించేవాడు, ఆసక్తిగా వినేవాడు, సమాజంలో అన్ని వర్ణాలవారికీ వినిపించేవాడు, ఉత్తమగతిని పొందుతాడు. తపస్సు చేత, యజ్ఞంచేత, దానంచేత, రుద్రాధ్యయనం, వేదాధ్యయనం చేయటం చేతా ఎంత పుణ్యఫలం లభిస్తుందో, ఈ లింగ మహాపురాణం పఠన శ్రవణాల వల్ల కూడా అంతే పుణ్యఫలం లభిస్తుంది.

యః పఠేత్ శృణుయాద్వాపి లైంగం పాపహరం నరః ।
స భుక్తభోగోలోకేఽస్మిన్నంతే శివపురం వ్రజేత్ ॥

ఈ లింగమహాపురాణాన్ని వినేవారు, చదివేవారు, సకల సుఖభోగాలూ అనుభవిస్తారు. వారి పాపాలన్నీ నశిస్తాయి. జీవితం ముగిసాక శివపురమైన కైలాసానికి చేరుకుంటారు.

**స్వస్తి**

**సర్వేజనాః సుఖినోభవన్తు**



